# భారతి



వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## జనవరి 1957

# విషయానుక్రమణిక

## జనవరి 1957



వైట్‌హౌస్‌లో నెహ్రూ - ఐసెన్‌హోవర్ సంప్రదింపులు

శాంతిదౌత్యం నిమిత్తం ప్రధాని నెహ్రూ గతమాసంలో అమెరికా వెళ్లి అంతర్జాతీయ సమస్యలగురించి అమెరికా అధ్యక్షుడు శ్రీ ఐసెన్‌హోవర్‌తో చర్చించారు. పరస్పరం ఇలా హృదయాలు విప్పి ముఖాముఖి మాట్లాడు కోవటంవల్ల అమెరికా భారత దేశాలమధ్య మరింత సుహృద్భావం యేర్పడి నట్లు ఉభయ దేశాలలోని రాజకీయ వేత్తలూ అభిప్రాయపడుతున్నారు.

# స్వ విషయము

**భారతి** ముప్పదిమూడు స్వర్ణ సంక్రాంతులను అధిగమించి ముప్పదినాలుగవపేట అడుగువెట్టింది. భారతికి ఈ ముప్పది నాల్గవ జన్మదినోత్సవం గత జన్మదినోత్సవాలన్నిటికంటే ముదావహమైనది. కారణం, ఆంధ్రప్రజాసేవకు భారతికి గల అవకాశాలు గత నవంబరునుంచీ విస్తృతమైనాయి. నవంబరు ఒకటవతేదీ ఆంధ్ర జాతి చరిత్రలో ఉత్కృష్టతమమైన మహా పర్వదినం. శతాబ్దాల బానిసత్వ కారణంగా, ఛిన్నాభిన్నమై, శిథిల శిథిలమై పోయిన మహాంధ్రసీమ ఆనాడు తిరిగి ఏకైకఖండంగా, సమగ్రమూర్తిగా రూపొందింది. మహత్తరములయిన ప్రతిభా సంపత్తులు కలిగివుండి కూడా యే కార్యసాధనకూ అవకాశములు లేని స్థితిలో అనేక ప్రాంతీయ పరిపాలనల క్రింద అజ్ఞాతులుగా అణగి నామరూప రహితులై పోయిన సోదరాంధ్ర ప్రజాసీకం ఏకైక కుటుంబంగా తిరిగి సంఘటితులై, స్వతంత్రులై, స్వయంపాలకులై, అనంతావధిని భావిభాగ్యోదయావకాశములు చేపట్ట గలిగారు. భారత ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ప్రారంభమయిన దశలో ఆంధ్ర ప్రజకు ఇట్టి శుభపరిణామం రావటం, నిజంగా అదృష్టం. అవకాశాలతో పాటు బాధ్యతలుకూడా సంక్రమించుతూ వుంటాయి. అవకాశాలు లేనప్పుడు బాధ్యతలు వుండి ప్రయోజనం వుండదు. అలాగే అవకాశాలున్నా బాధ్యతలు నిర్వహించుకో లేనప్పుడు ప్రయోజనం వుండదు. పైపెచ్చు బాధ్యతారహితంగా ప్రవర్తించటం వల్ల, ప్రయోజనం లేకపోగా, అనంతములయిన అనర్థములను నెత్తికెత్తుకొనవలసి వస్తుంది. సర్వాంధ్ర ప్రజలూ, నాయకులూ, మహాంధ్రాభ్యుదయ సాధనబాధ్యతను నిర్వహించనున్న యువతీ యువకులూ ఈ సత్యాన్ని అవగతం చేసుకోవలసి వుంది. సకలాంధ్ర ప్రజాసీకంతో పాటు నూతనంగా యేర్పడిన ఈ బాధ్యతలను ఈ శుభసమయాన భారతి సంస్మరించుతున్నది.

**ఈ** రానున్న అవకాశాలను ముందుగానే గుర్తించి, భారతి భవిష్యన్నిర్మాణ కార్యక్రమానికి వలసిన సాధనసంపత్తిని చేకూర్చటానికి గత ఒకటి రెండు సంవత్సరాలుగా ప్రయత్నించుతూనే వుంది. కాని, ఆశించిన అవధికి ఫలితాలు సాధించలేక పోయింది. ఇందుకు కించపడుతున్నాం.

**అ**సలు మనము వాంఛించుతున్న భవిష్యత్తు ఏమిటి? ఇందుకు మనకు వలసిన విజ్ఞానాదికమైన సాధనసంపత్తి ఎలాంటిది? ఈ రెండు విషయాలనూ మనం సరిగా అవగాహన చేసుకోలేక పోతున్నాం. నిజానికి మన ప్రాచీన సంస్కృతి మహోత్కృష్టమైనదే, మన ప్రాచీనాంధ్ర పురుషులు మహామహులే, ఆ యా మహోజ్వల చరిత్రనంతా భారతి ముప్పదిమూడు సంవత్సరాలుగా వేనాళ్ళల వక్కా

ణించుతూనే వుంది. బానిసలై నిర్వీర్యులై పడి వున్న జాతిలో ఆత్మవిశ్వాసాన్ని ప్రభవింప జేయవలసి వున్న ఒక దశలో ఈ ప్రాచీనోజ్వలచరిత్రా ప్రబోధము అవసరమై వుండవచ్చు. కాని, నేడు, పురోగామి దృష్టిలేని ఈ చర్విత చర్వణ నిష్ప్రయోజనకరమే గాక, దురభిమాన స్ఫోరకమూ, అనర్థకదాయకమూ గూడ. భారతి పాత సంచికలలోని విషయములనే తిరిగి తిరిగి ముద్రించుకొని ప్రయోజన ముండదు గదా !

ఈ అవకాశమును పురస్కరించుకొని రచయితల కొక విజ్ఞప్తిచేసుకుంటున్నాము. రచనలు వీలయినంత సంక్షిప్తంగా వుంటే ఆహ్లాదజనకంగా వుంటాయి. ఇటీవల ప్రతి దానినీపెంచి వ్రాసే ఒక ధోరణి వ్యాపించుతూ వుండటంవల్ల ఈ సూచన చేయ వలసి వస్తూన్నది. కథాసాహిత్య శాఖలో కూడా ఈ పెంచివ్రాయాలనే ధోరణి వల్లనే శిల్పసౌందర్యాదికాలు నానాటికి దిగజారుతున్నట్టు కనిపించు తున్నది. రచయితలు ఈ విషయాన్ని గమనించి సహకారం నెరపగలరని ఆశించు తున్నాము.

గత సంవత్సరం, అధునాతనాంగ్ల సారస్వతంనుంచి శిల్ప ప్రాభవం గల కొన్ని నాటికలను అనువాద రూపంలో అందజేశాము. పాఠక లోకంలో వీటికి విశేషాద రముకూడా లభించింది. కాని అనువాదాలు ప్రచురించుతూ వుండటం మా ఉద్దేశం కాదు. ఈ నాటికలను దృష్టిలో వుంచుకొని, ఆంధ్ర రచయితలు వర్తమాన జాతీయ ప్రజాజీవితంలో గల సమస్యలను సేకరించి ఉత్తమ శిల్ప రూపాలలో ఆవిష్కరించగలరనే ఉద్దేశంతో అలా అందజేశాం.

ఇటీవల భారతిలో త్రివర్ణచిత్రాన్ని ప్రచురించలేక పోతున్నాము. ఉత్తమ చిత్రాలు లభించక పోవటమే యిందుకు కారణం. తగిన చిత్రాలు లభించితే ఎడనెడా ప్రచురించుతూ వుండగలం.

తమ అమూల్య రచనలతోనూ, చిత్రాలతోనూ భారతిని అలంకరించుతూ, భారతిని సమున్నత స్థాయిలో నిర్వహించుటకు కారణభూతు లౌతున్న సర్వాంధ్ర రచయితలకూ, కళాకారులకూ, సారస్వతాభిలాషు లయిన పాఠకు లకూ మా కృతజ్ఞత !

# దివ్యమానవుడు

సి. నారాయణరెడ్డి

నేను దానవుని సైతము
నిర్జించిన మానవుడను
కాని మానవుని జయించ
లేని లోని మానవుడను.

వెదురు బొంగులో దాగిన
మృదురసార్త నాదమువలె
హంస ముక్కులో నక్కిన
అతిలోక వివేచనవలె;

మానవపదవాచ్యుని ఎద
మలకలలో మరుగువడిన
అజ్ఞేయుడ నేను వివే
కజ్ఞేయుడ నేను సుమా!

ఒకని సిరి జూచి మరొక
డుల్కిపడిన విషమవేళ
ఒక్క గొంతుపై మరొక్క
ఉక్కుచేయి మసలు వేళ;

చూడలేక నోరు రాక
స్రుక్కువడిన మానవుడను;
చిత్రమైన వ్యూహములో
చిక్కువడిన మానవుడను.

అసహిష్ణుత ఝంఝానిల
మై విరుచుక పడినప్పుడు
పశుతత్వ మ్మురుతమస్స
దృశమై మురిసిన యప్పుడు;

# భా ర తి

ఆలంబన రహితమైన
ఆత్మవోలె నిల్చియుంటి;
ఏ స్నేహ బలమ్మునో
ఇంతదాక వెల్గుచుంటి.

నా కీర్తిని రాకాచం
ద్ర జ్యోత్స్నల బంతిలోన
సరి గద్దియ నిల్పెదు లి
ప్సాలేశము లేదు నాకు.

ఆశించను గగనధునీ
హైమాంభోజము లెన్నడు
మట్టిలోన విరబూచిన
మల్లియ లిష్టములు నాకు.

నా చుట్టు భ్రమించెదు అం
ధ లోకమును వెల్గించగ
బ్రతుకును కప్రమువలె అ
ర్పణ సేయుట ప్రియము నాకు.

సురభిళ శబ్దమ్మొక్కటి
తరగెత్తిన చాలు; నాయె
డంద సందులందు కోటి
నందనాలు గుబాళించు.

ఒక చాంద్రీమయ దృఙ్మా
లిక ప్రసృతమ్మైన చాలు
నా మనస్సులో పుల్కలు
నారువోసినట్టులౌను.

ఇరుగుండియ లొక సూత్రపు
విరులై కలిసిన చాలును
పొంగి వింగి వందుకొందు
భూదివమ్ము లతికినట్లు.

# దివ్య మానవుడు

స్ఫటిక స్వచ్ఛమ్ములుగా
భాసించిన అంతరంగ
ములలో నెత్తురు చారలు
మిలమిలమని కదలాడగ;

తన గుండెలు చీల్చి దేవ
తల కమృతము పంచిపెట్టు
చంద్రునివంటి మహాత్ములు
క్షయగ్రస్తు లగుచుండగ;

నాలోపల నేదో మం
దరగిరి అట్టిట్టు కదలి
నట్టులౌను; కాలకూట
ముట్టిపడిన యట్టులౌను.

పువు రేకులలో పర్వత
మూలమ్ముల పెకలించెడు
వాగ్రేయ మహా సంక
ల్పమ్ము నాంది పల్కునాడు;

దీన జగద్రుధిర కణో
ద్దీప్త మనోవర్తులు చ
ల్లని స్నేహ స్పర్శన మా
త్రమున వెల్గిపోవునాడు;

పాపము పోలిక గుట్టలు
గా పుట్టలుగా పెరిగిన
జిఘాంస నేలమట్టమై
జిజీవిష చివుర్చునాడు;

నాపై కన్పడు మానవ
రూపము సార్థకమ్మగును
నా సంజ్వరితాత్మ కమృత
కాసార స్నాన మగును.

# నానారసాభ్యుదయోల్లాసి

## శ్రీ రాంభట్ల లక్ష్మీనారాయణ

భారతాంధ్రీకరణమున నద్వితీయ స్థానమలంకరించిన మహాకవి తిక్కన సోమయాజి అసదృశ ప్రజ్ఞా ధురంధరుడు. "హృదయాహ్లాది చతుర్థ మూర్జితకథోపేతంబు నానారసాభ్యుదయోల్లాసి విరాటము" అని తారచింపంబూనిన కథాసంవిధానము నానారసాభ్యుదయోల్లాసి యనెను. కీచకవధఘట్టముననే తన ప్రతినను సార్థక మొనరించుకొనిన యా మహాత్ముని వచనము లన్వర్థము లనుటలో వింతయావంతయు నుండబోదు.

మహాకావ్య లక్షణము లటనట గొంతకానవగుటం జేసి యీ ఘట్టమొక చిన్న కావ్యమై యొప్పుచున్నది. ఇందు నాయకుడు భీమసేనుడు. "నీ యుత్తమ నాయకత్వమెఱిగి నినుగొనియాడ నేనెంతదాన"నని పాంచాలీ ప్రశంసను బడసిన ప్రసిద్ధుడతడు. నాయిక ద్రౌపది. ఆమె ధీరయేగాక ప్రౌఢ. మఱియు స్వాధీనపతిక. ప్రతినాయకుడు కీచకుడు. అతడు రూపాభిమాని. దుర్విదగ్ధుడు. బలగర్వితుడును. అస్థానపతితమగు ప్రతినాయకుని ప్రణయ మీ ఘట్టమునకు ప్రాణము. ఆ ప్రణయ మాభాసమై రససిద్ధికి దూరమయినది. వీరరస విజృంభణమునకు దావొసంగినది. రసాంతరముల కటనట నిలువ చోటొసంగినది. కావున నిందంగిరసము వీరమనియు రౌద్రాదు లంగరసరములనియు జెప్పసాహసోక్తి కాజాలదు. కావ్యమున ప్రధానరసమున కుపోద్బలకములై, రసాంతరములు, భావము, భావాభాసము, భావశబలతాశాంత్యాదులు వర్ణింపబడును. అనాడే రసము సుస్థిరమై సహృదయ హృదయాహ్లాదకమగుచుండును. గ్రహములన్నియు గ్రహరాట్టు ననుసరించి పరిభ్రమించునట్లు, రసాంతరములు భావాదులు నంగి రసము నాశ్రయించి వృద్ధి హ్రాసముల నందుచుండును. ప్రధాన పరిపుష్టమగు నాయంగిరసము కావ్యమున నాయకాశ్రయమైయుండును. అప్పుడే యది యలౌకికమగును. కావ్యగత రసస్వరూప మట్టిది.

ప్రకృత ఘట్టమున ముఖ్యరసము వీరము. అయ్యది క్రమ పరిపుష్టమైన ఫలకారి యయ్యెను. రౌద్రకరుణ భయానక భీభత్స హాస్యాద్భుతములు దానికి బరిపోషకములు. శృంగార మాభాసప్రాయమయ్యెను. ఇట్లని మిది రసములు పరిస్ఫుటముగ నిందుపవర్ణితములు. శాంతము సూచనా మాత్రముగ నిరూపితము. ఇట్లు నానారసాభ్యుదయాంచిత మీ కీచకవధఘట్టమనుట నిర్వివాదము.

కీచకుడు తన యక్కకు నమస్కరింపంజని యద్దేవి కనతి దూరంబున నున్న ద్రుపదరాజపుత్రిని దర్శించెను. అక్కజమైన యామెచెలువ మాతని యాత్మకు దుర్భరమయ్యెను. అతని మనము కామునిచే జిక్కెను. చిక్కిన మనము ద్రిప్ప నాతని కశక్యమయ్యెను. అతడు వేటకాని బారింబడిన మృగమయ్యెను. మనోజ వికారముగ్నుడై బాంచాలిని బరికించెను. భయమున నామెలో జనించిన కంపస్వేదాది లక్షణములను గాంచి వివేకహీనుడై వానిని మదనవికృతులని మదినిదలంచి 'కామీ స్వతాం పశ్యతి' యనుమాటను సార్థకము నొందించెను. రాగరసపూర నిమగ్నుడయ్యెను. అనంగుడు వట్టియుండెడు జంత్రము పగిది కొంత తడవుండెను. తన యక్కవలన నామె వృత్తాంతమును వినెను. వెరవుమాలి యా ద్రౌపదిని సమీపించెను. తన యభిలషితము నెఱింగించెను. ఆమెయు మెత్తని పలుకుల నాతని వారింప సమకట్టెను. కాని యాతని ప్రలాపములు హద్దుపద్దుల నతిక్రమించెను. ద్రౌపది కినిసి, యాతని జంకింప నుత్సహించి: తన కయిదుగురు పతులు గలరనియు, వారు గంధర్వులనియు, దుర్వారోద్యమ బాహువిక్రమ రసాస్తోకప్రతాపమున ప్రతివీర నిర్మథన విద్యాపారగులనియు బల్కెను. అందని ద్రాకులపండ్లు గోయుట హితము గాదనెను. రావణాదులను దృష్టాంతీకరించెను. అతని సంరంభమును మాన్పయత్నించెను. కీచకుడు చిన్నవోయినమోముతో

# నానా రసాభ్యుదయోల్లాసి

సుధేష్ణపాలికిం జనెను. ఆమె గావించు నుపదేశములను జెడచెవిం బెట్టెను. తుట్టతుదకు తన పట్టుదలచే నామె నంగీకరింపజేసి ద్రౌపదిని తన యింటికి వచ్చునట్లు గావించుకొనెను. ఆమె నచట పరాభవింప సమకట్టెను. ఆమెచే బరాభూతుడయ్యెను. ఈ సన్నివేశమున గవి చూపిన కల్పనాచాతుర్య మంతయు శృంగారరసమయము. అట్లయ్యు చివరి కయ్యది యాభాసమయ్యెను. 'ఏక త్రైవానురాగః" అను నాలంకారిక నియమమునకు దార్కాణయయ్యెను. ఆభాసముగ బరిణతమయ్యు నారసము నాయకుడగు భీమసేనుని వ్యవసాయమునకు సహకరించెను. బీజరూపమున నాగ్రహవృత్తమున కాధారమయ్యెను.

సభామందిర ప్రాంగణమున కీచకునిచే కచాకృష్టయై పదాహతయగు భామిని ద్రౌపది భీమునికంటబడెను. అతని కాగ్రహముదయించెను. సంపూర్ణ రౌద్రరసలక్షణము లాతని నాక్రమించెను. కన్ను లరుణములయ్యెను. కటము లదలెను. ఘర్మజల మంగకంబుల నాక్రమించెను. కనుబొమలు నిటలతటమున నర్తించుచుండెను. రూపము భయానకమయ్యెను. భావములతీతములై మిన్నునంటుచుండెను. ప్రళయకాలానలమున గంపరించిన రూపంబు కరణి భీము డతి భయంకరాకారమున నుండెను. ఇట్లున్న యీరసరాజములు రెండును వీరరసమున కంగములయి యాతని యుత్సాహము నినుమడింప జేసెను. 'రాగరసపూరనిమగ్నుడు' అనిలజుకోపరసంబు పేర్మి జెరచె" అనుచోట్ల తిక్కయజ్వ యీరసద్వయమును సూచించెనన వచ్చును.

భీముని కోపాటోపమును యుధిష్ఠిరుడు గాంచెను: అన్యాపదేశవ్యాజమున నిగూఢభాషణముల నాతని కోపమును శమింపజేసెను. ఇచ్చట శాంతరసము సూచనామాత్ర నిబద్ధము. శమమిచట స్థాయి యయి భీముని కోపము జ ర్చెను.

ద్రౌపది యా రాత్రియందే మహానసమున కొంటరిగ నేగెను. సుప్తుడగు వృకోదరుని మేల్కొల్పెను. తా బడ్డ యవమానమును వివరించెను. ధర్మజాదుల దుస్థితిని వేవిధముల వర్ణించి విలపించెను. మేరుధీరుడగు నా భీముని స్వాంతమును గలంచెను. అనిలసుతు డెంద మట మట నొందించెను. చింతాక్రాంతుడగు నా కాంతేయుని గీచకవధకై నియోగించెను. మీ ముక్కున నూర్పు గలుగ నొక మూర్ఖునిచే నట్లయితినని పలికి యాతని చిత్తమును కనలించెను. వానిదగ జూడనిచో వారినైన వహ్నినైన విషమునసైన మరణింతునని ప్రతినగావించెను. భీమునికంట తడిపెట్టించెను. తుదకు భీము నొప్పించెను.

ఆభాస ప్రాయమగు శృంగారమున జనించి, పత్నీ పరాభవ దర్శనజనిత క్రోధమున ప్రవృద్ధమై కష్టపరంపరా శ్రవణమున బరిపుష్టమై కీచక వధోత్సాహము చిట్ట చివరకు భీమునిలో స్థిరమై వీరముగ బరిణమించెను. "అలఘు మదీయబాహుబల మప్పుడు నూపని తప్పు చాలదే" యని భీముని నోట బలికించెను. "ధర్మతనయుండు దావచ్చి యడ్డపడెనేని, నీవు పెంపారు కరుణ గాచితేని నాచేబడు కీచకుండు" అని పలికించి యాతని యుత్సాహము సుస్థిరమును గావించెను.

కీచకుని జంప నుపాయము నూహించి భీముడామెను బంపెను. సమయభంగభయము. ధర్మజుని యాజ్ఞయు నారసవిజృంభణమున కంతరాయములయ్యును నాతని వ్యవసాయ మావంతయు నశింపజేయ సమర్థములు గాకుండెను. వీరము ప్రధానస్థాన మాక్రమించెను.

మరునాడు ద్రౌపది మరల కీచకుని కంటబడెను. ఆమెయు భీమానుమతమున 'నీ వొక్కరుండవ యరుగుదేరవలయు. లేకున్న నయ్యెడ నిల్పుదాననుగాను' అని పలికి నర్తనాగారమును సంకేతస్థలముగ నిర్ణయించెను. సమయ నిర్ణయమును విని కీచకుడు సంతసించెను. ద్రౌపదియు నేకాంతముగ మహానసమున కేగి యావార్తను భీమునకు నెఱింగించెను. "అత్యంత చింతాధూతాత్ముడనైన నాకు బరమోత్సాహంబు సంధిల్ల" యని పలికి భీము డా కార్యక్రమమున కుత్సహించెను. "వెఱవక సంకేతించిన తెఱగున వచ్చునో కాకమానునో తా నొక్కరు డేగుతెంచునో లేక మఱి కొందఱనట దెచ్చునో, నెడగై రహస్యమును వెలిబుచ్చునో" యని భీముడు భావపరంపరా సమాకుల చిత్తుడయ్యెను. "మదాంధవృత్తి నాతడు వచ్చును, నాట్యశాల జొచ్చును. నాకు సంగరం బిచ్చును. నాచే బడి చచ్చును. రిత్తి విచారములేల" యని తన యుత్సాహమును సుస్థిరము గావించుకొనెను. సుస్థిరీభూత చేతస్కుడయ్యెను. "కట్టలుక బెబ్బులి గోలవేసినటు లుగ్రాకార మేపారగ, మండపము సంక్షోభింప నాతని నేతునసెను. పిఱుసనిన బై కుఱుకుదును. సాళువము కాకి నాడిసిన విధమున పొదువుదును. పఱిపఱి సేయు

డును. నా పూన్కి సఫలం బొనర్చెదను. నాతో జెనగి నన్ను గొంత గినియింప నోపెడుచందమైన క్రోధమును కృతార్థముగా నొందించి చిత్రవధప్రౌఢి నా సూతుం దెగటార్చెదన"నియు పల్కెను. ఈపల్కులన్నియు భీముని యుత్సాహసంపద నినుమడింప జేయుచున్నవి. ఉత్సాహము స్థాయియై వీరము కృతార్థమగుచుండెను. భీముని భీమభాషితములకు భీతచిత్తయై యా ద్రౌపది సమయభంగమగునని శంకించి మరల పిఱికి మందు పోసెను. "అటుగాక తక్కినను వలదు సుమీ" యని యాతని వారించెను. కాని భీముడా మాటలను గీటున బుచ్చి 'నిగూఢ వృత్తిపై తిన్ననియుపాయమున నాతని తెగటార్తునని పనికెను. తన యుత్సాహము నినుమడింప జేసెను. ఇట్లు సజాతీయ విజాతీయ భావములచే భీముని యుత్సాహము సందిగ్ధ దశనందక సుస్థిరత్వమును గాంచెను.

నిశీథమున భీముడు పాంచాలీ ద్వితీయుడై నర్తనాగారమును జేరెను. భావభవవంచితుడగు నా కీచకుడును ఒంటరిగనే యచటి కేతెంచెను. అంధతమసంబున నదృశ్యరూపంబగు నచటి పర్యంకమును జేరెను. నిగూఢరూపమున నట నున్న భీమునిగాంచి పాంచాలియని భావించి తన యభిమానితను, సౌభాగ్యమదమును నుగ్గడించెను. భీముడా మాటలాలించెను. వచ్చుచున్న కోపము నాపుకొనెను. 'ఇట్టివాడవుగావున నీవు నిన్ను పొగడికొనదగును. నా పోల్కి యాడుదియు నీ కెచ్చట నైన లభించుట దుర్లభము. నా యొడలు చేర్చినప్పుడ నీయొడ లెట్లుండునో నీ కిప్పుడే తెలియగలదు. నను ముట్టి నీవు మరల వనితలసంగతికి బోవువాడవుగావు. జన్మసాఫల్యము నింకబడయగలవు" అని మృదుభాషణముల నా కీచకునికి సమాధాన మొసంగెను. ఈ మాటలను వినువారి కందఱికి నిండలిహాస్యము మనోవికాసము నొదవింపక తప్పదు. వికృతరూపదర్శనమున, వికృతవచశ్శ్రవణమున గల్గు మనోవికృతియే హాసమునకు బీజముగదా.

కీచకుడు కామపరతంత్రుం డగుటంజేసి యందలి యంతరార్థమును గ్రహింప జాలడయ్యెను. 'పవనపుత్త్రుని పజ్జను మెల్లగ జేరెను. పర్యంకమునధివసించెను. భీముడు రౌద్రాకారమున నొక్కయట్టహాసమును గావించెను. కీచకుడు గంధర్వుడేతెగుదెంచెనని తలంచెను. పిఱుతివియక పోరునకు గడంగెను. భీముడుగ్రుడై పంచాననమేణమును బొదువున ట్లాతని నాక్రమించెను. చెడిదములగు పిడికిటిపోటులనాతని పొడిచిచంపెను. ఇది యాతని రౌద్రరసా విష్కృతికి దార్కాణము. అంతటితో భీముని కోపము చల్లారలేదు. వికృతపు జావు జంపనాతనికి వేడుకజనించెను. కీచకుని మస్తమును భుజములును పాదములను నాతని మేనులో జొనిపి, క్రంతల తిత్తియైన యాతని దేహమును నేలపై జదిపి చక్కని ముద్దగ నొనరించెను. ఆ దృశ్యమును దిలకించిన ప్రతివారికి భయము జనింపక తప్పదు. ఆ వికృత రూపమును గాంచిన వ్యక్తులకు రోతజనించును. ఇట్టి యీ భీమ వ్యవసాయము భీభత్స భయానక రసములకు బుట్టినిల్లయ్యెను. పాంచాలియు నా ప్రాంతమున కరుగుదెంచెను. చచ్చిన సూతుని సంతసముగ గాంచెను. ఆ చావునకు నాతని వికృత రూపమునకు అట్లుగావించిన భీముని బలసంపదకు మిక్కిలి విస్మయమునందెను. ముక్కుపై వేలువేసికొనెను. 'మహిత విస్మయానంద నిమగ్ననైతినని' భీముని స్తుతియించెను. అనితర సాధ్యమగు నిట్టి కార్యమాశ్చర్య జనకమగుటం జేసి యిది యద్భుతరసాసాదక మనకతప్పదు.

ఇట్లు మహాకవి తిక్కన, పాంచాలీ దర్శనమున గీచకునికి మనోవికృతిని జనియింపజేసియు శృంగార భావములను విరివిగ సృష్టించియు శృంగార రసము నాభాసముగ నొనరించి పాంచాలీ పరాభవమున భీమునికి గ్రోధము నుద్భవింపజేసెను. మరల ధర్మజు శాంతవచనమున నా భీముని కోపమును, నాతని కీచకవధోద్యమమును వారించియు, ద్రౌపదీ కరుణపరిదేవనమూలమున మరల భీమునిలో గ్రోధోత్సాహములను రేకెత్తించి యుత్సాహము నినుమడింపజేసెను. ఉత్సాహమును స్థాయిగ నొనరించెను. నర్తనాగారమునందలి భీముని పల్కులలో హాస్యరసమును చిత్రించి కీచకవధమూలమున భయానక భీభత్సాద్భుతములను రూపొందించెను. ఇట్లు రసముల నన్నింటి నేకత్ర పరిపుష్టములను గావించి వీరరసము నుజ్జ్వలతర మొనరించి భీముని ధీరోదాత్తతను సుదృఢముగావించెను. కావున నీఘట్టము నానా రసాభ్యుదయోల్లాసియైనది.

# మంజూష: భీష్ముడు

శ్రీ వేలూరి శివరామశాస్త్రి

భీష్మునకు తర్పణము వదలి అర్ఘ్యము ఇచ్చు వారందఱును :

'వైయాఘ్రపద్యగోత్రాయ సాంకృత్యప్రవరాయచ । గంగాపుత్రాయ భీష్మాయ ఆ జన్మ బ్రహ్మచారిణే । అపుత్రాయ దదామ్యేత దుదకం భీష్మవర్మణే'[2] అనియు

'వసూనా మవతారాయ శంతనో రాత్మజాయ చ। అర్ఘ్యం దదామి భీష్మాయ ఆబాల్యబ్రహ్మచారిణే'[3] అనియు మంత్రములు చెప్పి తర్పణము విడుచుచున్నారు, అర్ఘ్యప్రదానమును చేయుచున్నారు. ఈ మంత్రములు పూర్వాచారముగా నేటిదనుక వచ్చుచున్నవి. ఈ రెండు మంత్రములలో భీష్ముడు మనకు ఆ జన్మబ్రహ్మచారిగా కానిపించుచున్నాడు. మఱియు

'అయం పితర మాజ్ఞాయ కామార్తం శంతనుం పురా । ఊర్ధ్వరేతస మాత్మానం చకార'[4]......అను వచనమువలనగూడ ఇతడు నిత్య బ్రహ్మచారి యని విస్పష్టము. కాని యీవిషయమున కొన్ని సందేహములు కానిపించుచున్నవి. శాంతిపర్వమున :

'త్వాం హి రాజ్యే స్థితం స్ఫీతే సమగ్రాంగ మరోగిణమ్ । స్త్రీ సహస్రైః పరివృతం పశ్యా మీహోర్ధ్వరేతసమ్' ఇచట 'పశ్యా మీవోర్ధ్వరేతసమ్' అనియు 'ఋతే శాంతనవా ద్భీష్మా న్న పశ్యా మ్యూర్ధ్వరేతసమ్' అనియు పాఠాంతరములు : "అంగవైకల్యముగాని రోగముగాని లేక వేలాది స్త్రీలచే పరివేష్టితుడవై సమృద్ధమైన రాజ్యమునందున్న నిన్ను ఊర్ధ్వరేతస్కుని వలె చూచుచున్నాను" అని యున్నది. ఇచట వేలాది స్త్రీలచే పరివేష్టితుడనుట వివాహితుడేమో యని సందియము కలిగించుచున్నది. కాని ఇచట స్త్రీలు అనగా దాసికలు మొదలగువారని అర్థము. స్త్రీ శబ్దము పత్నీ పర్యాయము కాదు. పెక్కువేలమందిని పెండ్లి చేసికొనకపోవుట జేసియు ఇచటి స్త్రీ శబ్దము పత్నీపర్యాయము కాదు. 'పశ్యామీ వోర్ధ్వరేతసమ్' అను పాఠమునకు శివునివలె చూచుచున్నానని అర్థము. 'ఋతే శాంతనవాత్ ...' అను పాఠమునకు 'భీష్మునికంటె వేఱు ఊర్ధ్వరేతస్కుని మఱి చూడను' అని అర్థము. ఊర్ధ్వరేతస్త్వ మనగా ఎనిమిది తీరులైన కామము లేకపోవుట.

ఆదిపర్వమున :

'అద్య ప్రభృతి మే దాశ బ్రహ్మచర్యం భవిష్యతి'[5]

ఓ దాశుఁడా! ఇపుడు మొదలుకొని నాకు బ్రహ్మచర్యము కాగలదు.

అని ఉన్నది. ఇందలి 'అద్యప్రభృతి=ఇపుడు మొదలుకొని అనునది సందేహాస్పద మని అనరాదు. దాసు నెదుట జేసిన ప్రతిజ్ఞవలన ఇదివఱకున్న బ్రహ్మచర్యమే మరల నిపుడు మొదలుకొనియు కాగలదని యర్థము. తొల్లి బ్రహ్మచర్యమే లేనినాఁడు అమోఘవీర్యుఁడగుటచే అతనికి పుత్రాభావ మెటులు? మఱియు వేలాది పత్నులున్నచో

'ఋతుస్నాతాం తు యో భార్యామ్'

ఇత్యాదులచే దోషము చెప్పబడుటచే బ్రహ్మచర్య ప్రతిజ్ఞ అత్యనుచితమయిపోవును. అట్టియెడ దాశుఁడుమాత్ర మెటులు పర్యనుయోగము చేయును ?

---

(1) మంజూష యను వ్యాకరణ గ్రంథమును రచించిన వాడు శ్రీ నాగోజీభట్టు. ఇతడు సర్వతంత్రస్వతంత్రుడు, విశేషించి పతంజలి తరువాత పతంజలి యంతివాడు. ఇతనికాలము ఇంచుమించు క్రీ. శ. 1715-1800 నడుమ.

(2) ఇది పద్మపురాణము నందలిది : వైయాఘ్రపద్యగోత్రుడును సాంకృత్యప్రవరుడును గంగ కొడుకును అపుత్రుడును ఆ జన్మబ్రహ్మచారియునగు భీష్మునకు ఈ యుదకము నిచ్చుచున్నాను.

(3) ఇదియు పద్మపురాణము నందలిది : వసువుల యవతారము, శంతనుని కొడుకు ఆ బాల్య బ్రహ్మచారియు నగు భీష్మునకు అర్ఘ్య మిచ్చుచున్నాను.

(4) తండ్రియైన శంతనుడు కామార్తుడని తెలిసికొని భీష్ముడు తన్నూర్ధ్వరేతస్కుని గావించుకొనెను.

(5) క. ధృతి బూని బ్రహ్మచర్య
వ్రత మున్నతి దాల్చితిని ధ్రువంబుగ ననప
త్యత యైనను లోకము లా
యతిఁ బెక్కులు గలవు నాకు ననుభావ్యములై.
ఆది-౪-౧౮౩

ఈ నన్నయ తెలిగింపులో "అద్య ప్రభృతి" అనునది మెలకువతో విడువబడెను.

కావున ఈ బలము చూచుకొని భీష్మునకు పత్ని కలదని కల్పించుట సమసినది.

'ఋతుకాలమందు భార్యోపగమము నిత్యము, తండ్రికొఱకు దొరకొన్న బ్రహ్మచర్యము నైమిత్తికము. ఈ నైమిత్తికముచే నిత్యమునకు బాధ చెప్పరాదా? అనగా అతనికి పత్ని కలదు. కాని విధించుకొన్న బ్రహ్మచర్యముచే భార్యోపగమ మొనరించుటలేదు.' అని చెప్పరాదా?

...నిత్యముచేతనే ఆయాయీ నైమిత్తికములన్నిటికిని బాధ కనుపట్టుచున్నది. కావుననే ఋతుకాలమందు శ్రాద్ధదినమునందేని భార్యోపగమమువలన బ్రహ్మచర్యమునకు హాని లేదని మితక్షర.

ఇంకొక పెద్ద సందియము: భీష్మ స్వర్గారోహణ పద్యమునందు,—

మహతా రాజయోగేన 6 పరివారేణ 7 సంయుతః
స్తూయమానో మహాతేజా భీష్మ స్త్వగ్నీ 9 ననువ్రజన్
ప్రాప్తోఽస్మిసమయే రాజన్నగ్నీ నాదాయ తేవిభో!

...నీ యగ్నులను దీసికొని సమయమునకు వచ్చితిని.' అని ధర్మజుని వాక్యము. మఱియు

'య ఏష రోషాత్ ప్రతపన్ బలస్థో
యోఽన స్సేనాం సింహ ఇ వారరక్ష
స ఏష భీష్మః కురువంశకేతు
ర్యేనాహృతా స్త్రీదశా (త్రిశతం) వాజిమేధాః

ఎవడు కోపముతో మండిపడుచు మనబారినుండి తనసేనను రక్షించెనో, ఎవడు ముప్పది (మున్నూఱు) అశ్వమేధము లొనరించెనో, కురువంశకేతు వగు ఆ భీష్ముడితడుగో!

అనియు గలదు. ఈ రెండు చోటులందును భీష్మునకు అగ్నులు కల యట్టులు స్పష్టము. భీష్ముడపత్నీకు డగుచో అపత్నీకునకు

'పత్నీవ ద స్యాగ్నిహోత్రం భవతి' ఈ మొదలగు వచనములచే అగ్ని సాధ్యమైన కర్మయం దధికార మెట్టులు? ఇట్టిదే యింకొకటి—కాళిదాస మహాకవి శాకుంతలము ప్రథమాంకమున,—

'రాజా—భగవాన్ కాశ్యపః శాశ్వతే బ్రహ్మణి స్థిత ఇతి ప్రకాశః; ఇయంచ వ స్సఖీ తదాత్మజేతి కథ మేతత్?'

'దుష్య—కణ్వ భగవానుడు శాశ్వత బ్రహ్మచర్యమున నున్నవాడని లోక ప్రసిద్ధము; మీ యీ నెచ్చెలి కణ్వభగవానుని కూతురగు టెట్లు?

అని భారతోక్తమగు కణ్వుని ఊర్ధ్వరేతస్త్వమును కాళిదాస మహాకవి స్వయముగా చెప్పి నాలవ యంకమున,—

'అమీ వేదిం పరితః క్లుప్త ధిష్ణ్యాః
సమిద్వన్తః ప్రాన్త సంస్తీర్ణ దర్భాః
అపఘ్నన్తో దురితం హవ్యగన్ధై
ర్వైతానా స్త్వాం వహ్నయః పావయన్తు' 8

'వేదిచుట్టును తమతమ తావులలో సమిధల నొప్పి ప్రాంతములందు పఱచిన దర్భలుకలిగి హవ్యగంధములచే పాపములు పో ద్రోలుచున్న యీ యాజ్ఞాగ్నులు నిన్ను పవిత్రపఱచుగాక.'

అని కణ్వునకు యజ్ఞసంబంధమైన త్రేతాగ్నులున్నటులు వర్ణన మొనరించెను. ఈరీతిగా అనధికారులగు ఆధునికులకు కూడ అగ్నిసాధ్యమగు కర్మ చేయనగునా?

బహ్వృచ బ్రాహ్మణమున,—

'అపత్నీకోఽగ్నిహోత్ర మాహరే3న్నాహరే3త్'= 'అపత్నీకు డగ్ని నాహరింప నగునా? కూడదా?' అని విచారింప దొరకొని,—

'ఆహరే దిత్యాహుః, యది నాహరే దనద్ధా పురుషః స్యాత్ । కోఽనద్ధా పురుషః । న దేవా న్న పితౄ న్న మనుష్యా నితి । తస్మా దపత్నీకో ఽప్యగ్నిహోత్ర మాహరే దితి తస్మాత్ సౌమ్యం యాజయేత్'

='ఆహరింప నగునని వక్కాణింతురు. ।ఆహరింపని యెడల అసత్పురుషు డగును. అనగా దేవతలను గాని పితృదేవతలనుగాని అతిథులనుగాని పూజింపనివా డగును. కావున అపత్నీకుడు గూడ అగ్నిహోత్రము నాహరింప వలెను...'

అని చెప్పబడుటజేసి అపత్నీకున కగ్ని సాధ్యమగు కర్మయెడల నధికారము కలదు. ఇచట 'అపత్నీకోఽపి' =అపత్నీకుడు గూడ' అనుచో 'అపి=కూడ' అను శబ్దము ఒకయెడ పత్ని యుండెనేని పత్ని లేకుండ యాగము చేయరాదని సూచించును.

---

(6) "రాజభోగేన" అని పాఠాంతరము

(7) "పారిబర్హేణ" అని పాఠాంతరము.

(8) తే. అనఘ! వచ్చితి ధర్మనందనుడ బ్రణతి
యాచరించెద నాపలు కవధరింప
నవసరంబేని విను సమయంబు వార్చి
యగ్ని మొదలుగ దేదసనట్టి దాని
సీ. తెచ్చితి...

ఆను-౫-౪౫౩-3

ఈ తిక్కన తెలిగింపులో ఇచ్చట "అగ్నీన్" అను బహువచనమున కేకవచనమున్నది. ౪౩ 3 వ వచనమున — "దేవవ్రతుని దేహంబు శ్రౌతాగ్ని కాహుతిసేసి" అని యున్నది.

(9) "భీష్మ స్త్వగ్నీనితి- తేన తస్యాపి పత్నీ ఆసీత్ యద్వా సంస్కారకా నగ్నీన్" అని నీలకంఠుడు. భీష్మ స్వర్గారోహణ పర్వ. ౧౧ శ్లో. చూ.

# మంజూష : భీష్ముడు

ఈ బ్రాహ్మణము రామాండారుడు చెప్పినటుల మృతపత్నీకుని గూర్చి చెప్పినదని ఏల చెప్పరాదు?

పెండ్లి చేసికొనక పోవుటవలనను, చచ్చిపోవుట వలనను గూడ పత్ని లేకపోవచ్చును. అట్టి యిరువురును అపత్నీకులే. అట్టి అపత్నీకుని గూర్చి సామాన్యముగా ఈ శ్రుతి ప్రసక్తించినది. ఇట్టి శ్రుతిని సంకోచించి మృతపత్నీక పరమేయని వ్యాకరింప దగదు. కావుననే—

'యా యజమానస్య పత్నీ సాఽభిద్రుత్యావహాన్తి, యో వా కశ్చి దవిద్య మానాయామ్' అను ఆపస్తంబ సూత్ర వ్యాఖ్యానమున రుద్రదత్త విద్యారణ్యులు 'అవిద్యమానాయామ్' అనగా చెఱుగు మాయుట మొదలగు నిమిత్తములచే పత్ని అసన్నిహితయై యుండినను, పత్ని లేకుండినను, అని అర్థము వ్రాసి 'అవిశేషమువలన' అని చెప్పిరి. మఱియు

'అ స్యాగ్నిహోత్రం మే'

అనునది యజమానునకే స్వామిత్వము ప్రకటించుచున్నది. దాన 'వ్రీహి యవ పశ్వాజ్య కపాల పత్నీ సంబంధాని' అని ప్రసిద్ధాంగ సమభివ్యాహారముచే గూడ పత్ని అంగమగుటచే పత్ని లేకున్నను యాగము సిద్ధించును. మఱియు విద్యమానపత్నికి సహాధికారమున్నను అమెకు యజమానునితో సామ్యము లేదు. ఇంతియ కాక

'వసంతే బ్రాహ్మణోఽగ్ని మాదధీత',

'దర్శపూర్ణ మాసాభ్యాం స్వర్గ కామో యజేత'

ఈ మొదలగు కర్మచోదనయు యజమానునే అధికరించుచున్నవి గాని పత్ని నధికరించుటలేదు.

కావున

'అపత్నీకోఽ ప్యగ్ని మాహరేత్'

'అపత్నీకుడు గూడ అగ్ని నాహరింపనగు' అని బహ్వృచబ్రాహ్మణము. ఇంతియకాక కణ్వ విభాండక భీష్మాదులును భగవంతుడగు శ్రీరాముడు మొదలగు తొంటి శిష్టుల పూర్వాచారము గూడ కానబడుచున్నది. వీరిలో శ్రీరాముడు అసన్నిహితపత్నీకుడు. కణ్వాదులు పత్ని లేనివారు' అని చెప్పియున్నారు. ఇచట నిటులు చెప్పిన విద్యారణ్యులకు శ్రుతిని సంకోచించి వ్యాకరించుట అభిమతము కాదని విస్పష్టము. తొల్లిటి పెద్దలయాచారముచే శ్రుతికి అసంకుచిత వ్యాఖ్యానమే లభించుచున్నది. మఱియు

'పత్నీవ దస్యాగ్నిహోత్రం భవతి'

అను సూత్రమున, రుద్రదత్తుడు

'స్వే ఆయతనే పత్నీ ఉపవిశతి' అను ఉత్తర సూత్రముచే సిద్ధించుచుండగా పత్నీవద్వచనము పత్ని ఉన్నచో ఆదరార్థ మనియు 'అస్య' అని చెప్పుటచే యజమానునకే కర్మస్వామ్యము గాని పత్నికి గాదనియు వెల్లడియగుచున్నది' అని వ్రాసియున్నారు. కావున — 'అపత్నీకోఽ ప్యగ్ని మాహరేత్' అను బహ్వృచ బ్రాహ్మణమునకు రామాండారుడు చేసిన మృతపత్నీకత్వ సంకోచము రుద్రదత్త విద్యారణ్య విరుద్ధమేకాక శిష్టాచార విరుద్ధము. కావుననే శాకుంతల నాటకరూపకావ్యము శాస్త్రవిరుద్ధత్వ దోషదుష్టము కాదు. ఇంక నొకశంక:

వేదాధ్యయనము కావించినపిదప సమావర్తన మొనరించినను ఏదేనొక కారణముచేగాని అనిచ్ఛచే గాని దారపరిగ్రహముచేయని భీష్మాదులకు అనాశ్రమిత్వ దోషములేదా? "అనాశ్రమీ న తిష్ఠేత క్షణ మేక మపి ద్విజః" = 'ద్విజుడు ఏ యాశ్రమమును లేక నిమిష మయినను ఉండగూడదు'అని ఉన్నదిగదా!' అనుచో—

అగ్నిహోత్రానుష్ఠానాతిథిపూజనాదులచే వారికి గృహస్థాశ్రమము సిద్ధించినది. అగ్నిహోత్ర విధురునితోపాటు అగ్నిహోత్రాదికముచే వారికి దేవర్ణముక్తి, పితృభక్తిచే భీష్మునకు పితృఋణవిముక్తి ఇతరులకు దత్తకాదులచేగాని తపోబలముచేగాని మానసపుత్రులచే గాని సిద్ధించినది...

'త్రిభిః ఋణవాన్ జాయతే బ్రహ్మచర్యేణ ఋషిభ్యః యజ్ఞేన దేవేభ్యః ప్రజయాపితృభ్యః ఏష వాఽనృణో యః పుత్రీ యజ్వా బ్రహ్మచారీ చ'

='ఋషులకు దేవతలకు పితృదేవతలకు అప్పుతో పుట్టుచున్నాడు. బ్రహ్మచర్య మొనరించి యాగము చేసి పుత్రునికని పైమూడు అప్పులు తీర్చుచున్నాడు'

అని శ్రుతికలదు. ఐనను నైష్ఠికబ్రహ్మచర్యము మొదలగువానిననుష్ఠించువారికి యప్పులబాధ లేదు. బ్రహ్మచర్యము అగ్నికార్యము మొదలగువానిచే వారికి ఋణవిముక్తి యని స్మృతులు చెప్పుచున్నవి.

'భారతమునందలి వాజిమేధ పదమునకు వాజిమేధము లొనరించినచో ఎంతఫలము కలిగించునో అంత ఫలము కలిగించు దానాదులు అని అర్థము, ఏలనగా భీష్మునకు పత్ని లేకపోవుటచే వాజిమేధమునం దధికారములేదు' అని కొందఱనిరి. అగ్నులను తీసికొని వచ్చితిని' అనుచోట అగ్నిపదము సంస్కారకాగ్ని పరమని కొందఱు చెప్పిరి. 'ఇదియే భీష్మునకు పత్ని ఉన్నటులు తెలుపుచున్నద'ని యింకకొందఱు చెప్పిరి. ఇది యంతయు పైనవ్రాసిన గ్రంథమువలన ఎగిరిపోయినది. ఇక 'ఇప్పటివారుగూడ అటులు చేయవచ్చునా?' అను శంకమిగిలినది. అట్టియాచారము పోవుటవలనను ఊర్ధ్వరేతస్త్వము మొదలగు గుణములుగల తొల్లిటి వారికే చేయదగిన దగుటను ఇప్పటివారి కట్టిది మిక్కిలి యగుటను కూడదు.

# తేలుకాటు

## శ్రీ జొ. రమాకాంత్

ముఖ్యవీధిన అందకత్తె జనుమండినచో నొక సంచలనము పుట్టును. ఇదమిద్ధమని నిర్ణయింపరాని పలురకములైన భావములు రేకెత్తును. క్షణికమైన ఈ అనుభూతిని తొలుత ఆనందింతుము; అది పొందరాని వస్తువని గుర్తించి ఆత్మగతమున విచారింతుము! ఆమె ప్రవర్తనయందు చిలిపితనమో, వెకిలితనమో, తదితరమైన యసాధారణతయో గోచరించునపుడు మనస్సున వికృతమగు కాంక్ష జనించును. ఇది సామాన్యము.

లచ్చి పల్లెపడుచు. అందకత్తె. పట్టణమునకు అదే మొదటిసారి రాక. వీధులు, మనుజులు, భవంతులు వింత వింతలు గన్పట్టుచుండెను.

లచ్చి అమాయకురాలు. గుణవంతురాలు. తనతల్లిదండ్రుల కిష్టము లేకున్నను రామిగానినే పెండ్లాడెను. రామిగాడు సాధువు. పరువు మర్యాదలు కలవాడు. పౌరుషము గలవాడు. వారామెను వల్లనికీయ నిశ్చయించిరి. వల్లనికి రెండెకరముల పొలముండెను. కండపుష్టి కలవాడు. పలుకుబడి గలవాడు. దూరపు బంధువు. మిత్రుడు. లచ్చి ప్రకృతి చిత్రమైనది. వల్లడన్న ఆమెకసహ్యము. దీనికొక ప్రత్యేక కారణములేదు. ఇది బుద్ధి విషయముకాదు. మనోవిషయము. సామాన్యముగా ఇట్టి భావములు కొన్ని వస్తువుల చూచినపుడు, కొందరి మనుజుల జూచినపుడు కలుగును. కొన్నిరూపములకు ప్రత్యేక గుణముల నాపాదింతుము. కొన్ని గుణములకు ప్రత్యేక రూపముల సృష్టింతుము. కొంతకాలమునకీ కల్పన మరుతుము. అప్పుడు గుణములలో రూపము, రూపములో గుణములు గాంతుము...లచ్చి పట్టుదలగల మనిషి. వల్లని కిచ్చుచో బలవన్మరణము నొందెద ననెను. తలిదండ్రులు బెదరి పోయిరి. రామిగాడు ఒక ఆసామివద్ద భూమి కవులుకు తీసికొనెను. లచ్చి వచ్చినసంవత్సరమే చెల్లెలి పెండ్లి నిమిత్తము ఆయనవద్ద వందరూప్యములు అప్పుతీసికొనెను. ఆ ఏడు మిడతలు పంటనంతయును నాశనము చేసెను. తరువాత సంవత్సరము బకాయితీర్చుటే కష్టతరమాయెను. ఈ సంవత్సరము అతివృష్టివలన పైరులు మురిగిపోయి ఎకరమునకు మూడుబస్తాల ధాన్యమయ్యెను. కవులుదారీ చట్ట మమలులోనికి రానున్నదనియు, భూమి రామిగాని పరమగుననియు ఆసామి కెవరో బోధించిరి. భయము బలవంతమైనది. తన పైకముకొరకు వత్తిడి చేయసాగెను. రామిగానికి సంభవించిన విపత్తు తానెరిగినదే. అతడును చెప్పుకొనెను. కాని ఆసామి వినిపించుకొనలేదు. పైగా అతని ననరాని మాటలనెను. అతనికి రోషము కలిగెను. లచ్చిని పుట్టినింటికంపి తాను నెలరోజులలో తిరిగివత్తునని పట్టణమేగెను.

కాపురమున కేగినపిదప పుట్టినింటి కప్పటివరకు పోలేదు. కొన్నిరోజులు ప్రశాంతముగ గడచెను. వల్లని రాకపోకలు పెరిగెను. అనవసరముగ ఆమెతో కల్పించుకొని మాటలాడుచుండెడివాడు. వారు రామిగాని నాడిపోసుకొనెడువారు. చాటున మాటున నూటిపోటి మాటలనుచుండెడివారు. ఆమె కది దుర్భరమయ్యెను. రోజులు లెక్కించుకొనుచు ఎట్లో కాలము గడిపెను. స్త్రీపురుషులమధ్య నింత తారతమ్యమేల. కుమారుడప్రయోజకుడై ఇంటనుండినను సమంజసమే కాని అవసరమునకు పుత్రిక పుట్టింటనుండుట సహించరు. ఒకప్రేగునుండి జన్మించినవారియందు సంఘమునకీ విభేదమేల? తలిదండ్రులకీ విచక్షణెందులకు? తొమ్మిదివారములు గడిచెను. జాబైనను రాలేదు. ఆమె నవ్వులపాలాయెను. ఎంతతొలగి తిరిగినను కవ్వించి ఎగతాళిచేయువారు.

ఒక సాయంకాలము తలిదండ్రులు పొలమేగిరి. సంధ్యచీకటులు ముదిరెను. వారురాలేదు. లచ్చి భోజనముగావించి వసారాలో వారికొరకు నిరీక్షించుచుండెను. ఇంతలో వల్లడు వచ్చెను. ఆమె వారెవ్వరు లేరని చెప్పెను. తనకు తెలియునని సమాధానమొసగెను. ఆమె కనుమానముకలిగెను. భయపడెను. ఇంతలో వల్లడు రామిగాడిక రాడనియు, తాను మూడేండ్లనుండి ఆమెకై తపించుచుండెననియు, ఇప్పటికీ ఆమెను నిరభ్యంతరముగ స్వీకరింతుననియు ఏమేమో ప్రేలుచు

చెయ్యి పట్టుకొనెను. ఆమె కావేశము కలిగెను. కొండంత మనిషిని ఒక్క పెట్టున త్రోసెను. అతడు నిలువున నేలకూలెను. అతని ఉద్రేకము హెచ్చెను. వెంటనే లేచి వికటముగ నవ్వుచు పిట్టవలె అడలు చుండిన దానిని చేతులలోనికి లాగుకొనెను. ఆమె మూర్ఛిల్లెను. ఉన్మాదమున కది తెలియదు.

ఆమెకు తెలివి వచ్చునప్పటి కింకను అతని కౌగిలి లోనే యుండెను. అతడు గాఢముగ నిద్రించు చుండెను. పట్టు వదల్చుకొని ఈవలకు వచ్చెను. రాత్రి ప్రొద్దుపోయెను. ఆమె లోనికరిగెను. తలి దండ్రులు యథాస్థానమున నిశ్చింతగ నిదురించు చుండిరి. పన్నాగ మవగతమాయెను! కోపము ఆశ్చ ర్యము, అసహ్యము ఆవేశము ఒక్కపెట్టునవచ్చి ఆమెను తబ్బిబ్బు పఱచెను. ఆ యింట నొక్క క్షణ ముండతగదని స్ఫురించెను. వెంటనే మూటముల్లె సర్దుకొని రామిగానితోడను పట్టణమునకు బయలుదేరెను.

పట్టణమున ఒక సత్రమునందు బసచేసెను. ఆ సత్రము మధ్య ఖాళీస్థలముండును. చుట్టు రెండువైపుల గదులుగల భాగములున్నవి. తూర్పుప్రక్కన నాలుగు గదులలో సత్రాధిపతి నివసించును. అతడు మంచివా డనియు, దైవభీతి గలవాడనియు, సత్యవ్రతుడనియు పేరుగాంచినవాడు. ఒంటరిగనున్న స్త్రీలు తరచు ఆసత్రమునకే పోవు ఆచారము కలదు. వారికి తనప్రక్క నున్న గదులిచ్చును. అతని కిటీవల భార్యపోయెను. తల్లిముదుసలి. ఆమెయే ఎట్లో వండిపెట్టి ఒకమూల పరుండును. ఆమెకు పుట్టెడు చెవుడు.

లచ్చి రామిగానితోడను వీధులన్నియు తిరుగు చుండెను. వచ్చు, పోవువారిని విమర్శగా చూచి నిరాశచెందుచుండెను. ఆమె వ్యాపా రము పలువురకు చోద్యముగా నుండెను. ఆమె అలసిపోయెను. అతనిజాడ ఎవరైన తెలుపగల రేమోనని తీరికగా నిలబడి ధూమపానము చేయుచున్న నొకనిని, రామిగాడు తెలియునేమోనని ప్రశ్నించెను. పట్టణమున ప్రజలు పలురకములు. వేష భాషలు, వ్యాపారవ్యవహారములు, ఊహా ప్రవర్తనలు వేరువేరు. అనేక విషయములగూర్చి ప్రస్తావించుకొనుచు, విమ ర్శించికొనుచు, వాదించుకొనుచు, పరిహాసము లాడు కొనుచు వీధులవెంట నిరంతరము తిరుగుచుండెడివారి సంఖ్య పెద్దది. అంతరంగికముగా కాంక్షించుదానినే పైకి బిగ్గరగా పలువురు నిరాకరింతురు. దాని కనేక కారణము లుండవచ్చును. తమ కోరిక యసాధ్య మని ఎఱిగి కొందరు, తమకట్టి కోరిక లున్నవని పరులెరి గిన తమ పరపతికి భంగము వాటిల్లునని కొందరు, తమ శారీరక మనోభావముల తర్కించి వాని స్వరూపముల గుర్తింప సాహసించనివారు కొందరు. అనుభవజ్ఞుల తర గతి వేరు. వారు మెలకువలు తెలిసినవారు, సాహసింప గలిగినవారు, తేనె పూసినట్లు మాటలాడ నేర్చినవారు. లచ్చి ప్రశ్నించినవాడు ఈ తెగకు చెందినవాడు. ఆమె అందకత్తె. అతనిదేహము పులకరించెను. 'ఓ తెలియకేం! ఎర్రగా దృఢంగా ఉంటాడు కదూ' అనెను.

'కాదు. పొట్టిగ నల్లగొంటాడు' అని లచ్చి యనెను. మాటలలోని 'యాస'ను అతడు పూర్తిగ గుర్తించెను. వెంటనే ఇంకొక యబద్ధమాడెను. 'అతడా! మా ఇంటి ప్రక్కవారింట్లో కొలువుకుంటున్నాడు. చూపుతాను పద' అనుచూ ఒక 'టాక్సీ'ని పిలిచెను. ఆమె కనుమానము కలుగకపోలేదు. కాని మనిషి మర్యా దస్తునివలె నుండుటచేసి నమ్మెను. కొంతదవ్వేగినపిదప రామిగాడు వారింట నెంతకాలమునుంచి పనిచేయు చున్నాడని ప్రశ్నించెను. అతడు తడబడెను. సంవత్స రమునుంచి ఉన్నాడని బొంకెను. వెంటనే లచ్చి 'ఐతే ఆడు కాడు' అని లేవబోయెను. ఆ పురుషుడు వ్యంగ్యముగ నవ్వెను. 'ఫరవా లేదులే' అనెను. అతని కన్నులలో మెరుపు ఆమె గుర్తించెను. వెంటనే 'కారు' నాపించి, దిగి చరచర వెడలిపోయెను. అండలేని వారి అందము దుఃఖభాజనము!

సత్రము చేరునప్పటికి ప్రొద్దుపోయెను. సత్రాధి పతి మంచివాడు. ఆమెకు వంటకై వలయు వస్తువు లన్నియు నిచ్చెను. తన ఇంటిలోని పచ్చళ్ళను సహి తము పంపెను. లచ్చి సంతోషించెను. వీధులన్నియు తిరిగి డస్సియుండుటవలన త్వరత్వరగ భోజనము ముగించి వసారాలో ప్రక్క పరుచుకొని పండుకొన్నదే తడవుగా నిద్రించెను. కొంతసేపటి కామెకు హఠా త్తుగ మెలకువవచ్చెను. ప్రక్కగదిలో ఎవ్వరో 'అయ్యో, అమ్మో' అని మూలుగుచున్నట్లుండెను. చెవులు నిక్కపొడుచుకొని వినెను. 'అబ్బ! ఈ తే లెక్కడ్నించి దాపురించిందిరా!...అయ్యో నీళ్ళు మంచినీళ్ళు — అబ్బో' అనుచుండిరి. ఆ గదిలో సత్రాధిపతి నివసించునని వెంటనే జ్ఞాపకము

వచ్చెను. నిజము! అది అతని కంఠస్వరమే. వెంటనే ఓరగా వేసియున్న తలుపులు తెరచుకొని అతని గదిలో ప్రవేశించెను. దీపము పెద్దదిచేసి మంచినీరునిచ్చెను. అతడు బాధపడుచుండిన వానివలె నగుపించలేదు. చిత్రము! మంచినీరు సావకాశముగ త్రాగెను. చేయి కనబడనట్లు తడుముచు ఆమెచేయి పట్టుకొని చెంబు నందించెను. అది సాధారణమైన పట్టుకాదు. రక్తములోని ఉడుకు శరీరములోని ఆత్రము మనసులోని తహతహాలలో కూడిన సందేశమును ప్రసరింపజేయు సాధనము. ఈ రెండుమూడు రోజుల అనుభవమువల్ల వెంటనే దానిభావము ఆమెకు పూర్తిగ అవగతమాయెను. ఆమె ఆశ్చర్యమునకు మేరలేకపోయెను...లోకపు స్వరూపము తెలియుచున్నకొలదియు ఆమె ఊహకు సత్యమునకుగల విపరీత భేదమును గాంచి దిగ్భ్రాంతి చెందుచుండెను...అతని గుణములు పలువురు ప్రశంసించిరి. అతని ప్రవర్తన అప్పటివరకు హృద్యముగ నుండెను. అతనిజాలి జాలికాదా? అతనికరుణ కరుణకాదా?... తానే పొరపడెనా...లచ్చి చెంబు నందుకొనెను. తేలెక్కడున్నదని ప్రశ్నించెను. మాయమైనదని వ్యంగ్యముగా సమాధానము చెప్పెను. ఆమె సంశయము తొలగిపోయెను. అతడు చిత్రముగ ప్రవర్తింప దొడగెను. మత్తుగాలేచి ఒడలు విరుచుకొనుచు బిగ్గరగ నవ్వెను. లచ్చి కావేశము కలిగెను. ఆమె కన్నులు చింతనిప్పులయ్యెను. చూపులు అగ్నిజ్వాల లట్లుండెను. అతడు బెదిరిపోయెను. గడగడ వడకుచు నేలకూలెను. ఆమె చకచక తన గదిలోనికిపోయి తలుపు బిగించుకొని వంటయింటిలో ప్రక్క పఱుచుకొని పండుకొనెను.

ఆమెకు నిద్ర పట్టలేదు. అంతులేని ఆలోచనలు తెరలుతెరలుగా వచ్చుచుండెను. వల్లడొక్కడే దుర్మార్గు డనుకొనుచుండెడిది. లోకమెంతచెడ్డది! ఒక యనాసయందమును గౌరవించలేని పాడుప్రపంచము! పురుషులందరును ఒకేరకము!!

కాని సత్రాధిపతి ప్రవర్తన కాతడే బాధ్యుడు కాడు. భార్యపోయిన క్రొత్తలో ఒకతె తీర్థయాత్రలకేగుచు ఆ గదులలోనే బసచేసెను. రాత్రి రెండు ఝాములు గడిచినపిదప తేలు కుట్టినదని అరచెను. అతడామె గదిలోనికి పోయి తేలెక్కడ కుట్టినదని ప్రశ్నించెను. మనసును కుట్టినదని అభినయపూర్వకముగా తన అభిప్రాయము వ్యక్తీకరించెను. తదుపరి తేలుమంత్రము చాలసారులు సహాయపడెను. ఈసారి మంత్రము పారలేదు.

ఆమెకు కునుకు పట్టలేదు. పట్టణమన్న ఏమో ఎఱుగదు. పట్టణము చేరినవెంటనే రామిగాడిని కలువ వచ్చునని గంపెడాశతో వచ్చెను. అప్పుడే ఒకరోజు వృథాయయ్యెను. కర్తవ్యముకూడ తెలియరాకుండెను. ప్రతివారును తన్నుపయోగించుకొనుటకే ప్రయత్నించిరి కాని తనపై జాలితలచినవారు లేకపోయిరి. తన కర్మను నిందించుకొనెను. కాని ధైర్యము కోల్పోలేదు. మరునాడు తప్పక కలువగలనని సమాధానపఱచుకొనెను...ఇంతలో తన కాలిపై నేదో కీటకము ప్రాకెను. వెంటనే లేచి ప్రక్కపై తడిమిచూచెను. హటాత్తుగ విద్యుత్ప్రసారమగుచున్న తీగను తాకినట్లయ్యెను. తన చేతిని ఒక్కసారిగ అగ్నిగుండమున పెట్టినట్లయ్యెను. ఏదో కుట్టినదని తెలియుటకు కొంత కాలము పట్టెను. సన్నని దీపపు కాంతిలో పొయ్యి వైపున కొక తేలుపోవుట గుర్తించెను. ఆమె పై ప్రాణములు పై నెగిరిపోయెను. పూర్వము తేలు కుట్టినప్పుడు ఎంత ప్రమాదమగు బాధపడెనో జ్ఞాపకమునకు వచ్చెను. బాధకును భీతికిని తాళలేక ఒక్కపెట్టున బిగ్గరగా అరచెను.

సత్రాధిపతి అప్పటి కింకను నిద్రింపలేదు. వస్తుతః మంచివాడు. చేసిన తప్పునకు పశ్చాత్తాపపడెను. వణు కింకను తగ్గలేదు. కాని ఆర్తనాదము విన్నవెంటనే ఒడలు పులకరించెను. మదిలోని పేరాశ ఉప్పొంగి అతని తబ్బిబ్బు చేసెను. ఉత్సాహముతో ఆవేశముతో ఆమె తలుపు రెక్కల త్రోసెను. బీగము విరిగిపోయెను. లచ్చి బాధతో గిలగిల కొట్టుకొనుచుండెను. అతడు సిగ్గుపడి పిట్టంత మనిషాయెను. తన ప్రవర్తన తనకే అసహ్యమాయెను. ఆమెయందు చెప్పరానంత దయకలిగెను. అప్రయత్నముగ కన్నులవెంట బొటబొట నీరు కారెను...ఈ మార్పు నామె గుర్తించెను. అతడు తేలుపోయిన దెసగుర్తెరిగి జాగరూకతతో దానిని కనుగొని చంపెను. అది ఒంటిపూసతేలు!! అతనికి ముచ్చెమటలు క్రమ్మెను. మతిపోయినంత పని జరిగెను. ఇంతలో ఆమె తెలివితప్పి నురుగులు గ్రక్కమొదలిడెను. అతని గుండెలు దిగజారెను. ఎట్లో పొరుగునున్నవారి సాయముతో ఆమెను వెంటనే వైద్యాలయమునకు గొనిపోయెను. రాత్రికి నియమింపబడిన వైద్యుడు శెలవు తీసికొనెను. ప్రధాన వైద్యునకు కబురంపిరి.

# తేలుకాటు

వైద్యుని ఇల్లు అక్కడికి మైలుదూరముండును. అతడు వీధిలోనికి వచ్చునప్పటికి 'టాక్సీ'లుకాని బండ్లుకాని లేవు. ఒక రిక్షావాడు మాత్రము కనుబడెను. అతడు అర్ధరూపాయి ఇమ్మనెను. సాధారణముగా ఆ సమయమున రూపాయి పుచ్చుకొందురు. ఐనను వైద్యుడు బేరము లాడసాగెను. మనిషి బరువు మనిషి. లాగుకొనిపోవుటయే అప్రశస్తము. వైద్యుడు నిజముగా బేరములాడ నవసరములేదు. ఆ రిక్షావాడమాయకుడు. లేకున్న రెండురూపాయల దగ్గరనుండి బేరము మొదలుపెట్టువాడు. చివరకు ఆరణాలకి ఒప్పుకొనిరి. ఒంటరితనము మఱచుటకు కాబోలు, వైద్యుడు వానితో మాటలు పెంచెను. అతనికి రోజు కెంత గిట్టుబాటగునని అడిగెను. తాను రాత్రి మాత్రమే రిక్షా లాగుదుననియు, పగలు కర్మాగారమునందు పని చేయుదుననియు చెప్పెను. తను విశ్రాంతిలేక కష్టపడుట శరీరమునకు మంచిదికాదని బోధించెను. అప్పు డాతడు తన చరిత్ర కొంత తెలిపి తన కీ బాధ ఇంకొక పదిపది హేను రోజులలో పోవునని చెప్పెను. వైద్యు డాతని దీక్షకచ్చెరు వొందెను. వైద్యశాలవద్ద దిగి రూపాయి ఇచ్చెను.

సత్రాధిపతి లచ్చివద్దనే యుండెను. దాని కంతకు తనే కారకుడనని పరితపించెను. తేలు నాటక మాడనిచో ఆమె వంటింటిలో పండుకొనెడిది కాదు. ఈ విపత్తు సంభవించెడిదికాదు. స్త్రీ హత్య చేసినట్లే భావించెను. పసిపిల్లవానివలె వాపోవుచుండెను... అప్పుడే ధైర్య మేలకోల్పవలయును. తేలుకాటువలన చచ్చువారు సాధారణముగ నుండరు. కాని ఇది ఒంటిపూస తేలు! దీని కాటుకు మందులేదని లోకోక్తి. దానికి శాస్త్రీయ నిదర్శనములేదు. లచ్చిని కావుమని భగవంతుని హృదయపూర్వకముగ ప్రార్థించుచుండెను. ఆమె ఏవేవో పిచ్చిమాటలు మాట్లాడుచుండెను. భయముచే వడకును. బాధచే కొట్టుకొనును. మధ్య మధ్య వల్లని పేరు వినబడును. అప్పుడు పండ్లు కొరుకును. తేలు తేలని అరచుచు ఏడ్చును. రామిగానిని తలచి చిరునవ్వు నవ్వును.

వైద్యుడు తిరిగి వచ్చునప్పటికి తొల్లిటి రిక్షావాడే వేచియుండెను. అతడు రోగివిషయము ప్రశ్నించెను. ఆమెపరిస్థితి చూచునప్పటికి వైద్యుని మనస్సుకూడ కరిగెను. 'ఎవరో పాపం! పల్లెపడుచు. ప్రొద్దునే ఏటివైపునున్న సత్రాని కొచ్చిందట... తేలుకుట్టింది' అనెను.

'తేలేనా'యని రిక్షావాడు సర్దుకొనెను.

'కాని అది ఒంటిపూస తేలుట......అసలామె శరీరానికి తేలుకాటే ప్రమాదం. అందులో ఒంటిపూస తేలు!...పాప మామె చెప్పరాని బాధ పడుతున్నది...'

తనభార్య తేలుకుట్టినప్పు డెంత అవస్థపడెనో హఠాత్తుగ జ్ఞప్తికివచ్చెను. గుండె ఝల్లుమనెను.

'...ఆ అమ్మాయిని చూస్తే నాకే జాలేస్తున్నది. కాని ఆమెను రక్షించటం నా శక్తికి మించినపని. ఆ భగవంతు డనుగ్రహిస్తేతప్ప!'

'తెలివుందా బాబూ'

'తెలి వెక్కడిది. హాస్పిటల్ కొచ్చేటప్పటికే మతిపోయింది...అసలు తే లెక్కడకుట్టిందోకూడ ఎవ్వరికి తెలీదు...'

'పాపం!' అది అప్రయత్నముగ వెలువడినమాట. వైద్యునిమాటలు వినుచుండెనేకాని అతనిబుద్ధి చచ్చుపడెను. ఆలోచన నశించెను. యంత్రమువలె చరచర రిక్షా నీడ్చుకొని పోవుచుండెను. హృదయములో నొక నల్లకల్లోలము రేకెత్తెను. తుది మొదలులేని అనేక భావములు ఒక్కపెట్టున చెలరేగెను. మనసులో చెయ్యివేసి కదలవేసినట్లయ్యెను.

'...ఏవేవో పిచ్చిపిచ్చిమాటలు మాట్లాడుతుంది...వల్లడు వల్లడంటుంది. పండ్లు కొరుకుతుంది. రామిగా డంటుంది నవ్వుతుంది...'

—ఇంతలో వైద్యునికి ప్రపంచము తల్లక్రిందులైనట్లయ్యెను. నడివీధినొక పిలిమంత్రము వైచెను. మతి తెలియునప్పటికి క్రింద పడియుండెను. వెంటనే లేచి దిక్కులుచూచెను. తనవనుక రిక్షా నేలకు ఒరిగియుండెను. రిక్షావాడు వైద్యశాల వైపునకు వెఱ్ఱిగా పరుగిడుచుండెను. హఠాత్తుగ నాతనికి మెరుపువలె సత్యము స్ఫురించెను. వెంటనే తన మందుల పేటికతో వైద్యాలయమునకు వడివడిగాపోయెను.

రామిగాడు వచ్చునప్పటికి లచ్చి కన్నులు తెరచెను. తుదిక్షణ మాతని చూచు భాగ్యమునకు నోచుకొనెను కాబోలు! గుర్తించినట్లు చిరునవ్వు నవ్వెను. అంతే. దేహ మల్లే కొయ్యబారెను.

తెల్లవారులు సత్రాధిపతి కాలుగాలిన పిల్లివలె నుండెను. ఆమెమరణమునకు తానేబాధ్యుడని మిక్కిలి వగచెందెను. అది ఇంకొకరికి తెలుపరాని బాధ!... సత్రాధిపత్యము రామిగానికి చెందునట్లు దస్తావేజు వ్రాసి వైద్యునికంపి, తాను శిరోముండనము గావించుకొని సన్యాసులలో కలసిపోయెను.

# భవభూతిః రామతత్త్వము

## శ్రీ చివుకుల మార్కండేయశాస్త్రి

తపస్వీ కాం గతో ఉవస్థాం
ఇతి స్మేరాననా వివ
గిరిజాయా స్తనా వందే
భవభూతి సితాననా॥

శ్రీకంఠపదలాంఛనుడైన కవికి భవభూతి యను బిరుద మీ శ్లోకమువలన కలిగెనట. తథాస్తు. కాని, ఇది భవభూతియొక్క జీవిత తత్త్వావలోకమునకు ప్రతీకమేమో! అఖండ తపోగరిష్ఠుడగు పరమేశ్వరుడు గిరిజా స్తనములను శూల్యముచే స్పృశించినాడు. అతని శరీరమందలి విభూతిచే అవి భూషితము లయినవి. కాగా "ఔరా! ఎంతవాడెంతకు దిగజారినాడు!" అని శివుని చూచి అవి నవ్వుచున్నవట. భావోన్నతుడై ధర్మపథగామి యగు జీవి తాత్కాలికోద్రేకమున క్షణికములయిన అనౌచిత్యములచే, తన ధర్మమున కసంగత వ్యాఖ్యను కల్పించుకొనును. తత్పర్యవసానముగా ధర్మమనార్ద్రమై హృదయవిదూరమగును. ఏవస్తువువలని సంతృప్తి నాశించి ఈ విపరీతపథమును జీవి ఎన్నుకొనెనో, అది అతనినుండి చ్యుతమగుటచే, విధి ఇతనిని వెక్కిరించిన ట్లనుపించును. లక్ష్యము సిద్ధింపకుండుట, ఆత్మసుఖము దూరమగుట—ఏకకాలమందలి ఈ యనుభవములవలన జీవి నేర్చుకొనునది "హార్దమగునదియే ధర్మ"మని. సత్యశ్రేయస్సుల ఈ సామరస్యము నాకళింపుచేసికొనుట జీవిత పరమలక్ష్యము, పరసుఖాపాదకమున్నూ. ఈ జ్ఞప్తి లేకుండుటయే జీవితమందలి సంఘర్షణలకు హేతువు.

ఉత్తర రామచరిత్రలో భవభూతి ఈతత్త్వమునే రామపాత్రయందు నిక్షేపించినాడు. సీతాలక్ష్మణులతో చిత్రఫలకసమీక్ష చేయుచూ, ఆయాఘట్టములందలి సుఖమునుగాని, దుఃఖమునుగాని భావనచేయు రాముడు తనను ధర్మప్రభువుగా భావించుకొని, వసిష్ఠాదేశమునకు వక్రవ్యాఖ్యానమొనరించుకొని సర్వశ్రేయస్కారిణియగు గృహలక్ష్మిని విసర్జించినాడు. కాని, తాను ఆశించిన ధర్మతృప్తి స్వపర పరితాపకారణమైనది. ఈ ధర్మాభాసనివృత్తికొరకు, ప్రత్యక్షముగా వాసంతీరూపమున, పరోక్షముగా జనకాదుల రూపమున ప్రవర్తిల్లిన శ్రేయాన్వితమైన ధర్మము భాసించినది. పర్యవసానముగా, సపుత్రకయగు సీత తన దివ్యత్వము నుద్దీపింపజేసికొని ప్రియకారిణియైనది.

కవి తన నాయకునిలో ఈ పరిణామ మెట్లు తీసుకుని వచ్చినాడు? ప్రథమాంకమున సీతను అనునయించు రాముడు, తన గృహలక్ష్మియొక్క యతిక్రాంచిన్మనో వైకల్యమునుగూడ సహించలేని స్థితిలో నున్నాడు. వివాహమై అత్తింటికి వచ్చిననాటనుండి సీత తన జనకుని విడిచియే యున్నది. ఈనాడు పట్టాభిషేకమునకు మాత్రము వచ్చిన తన తండ్రివలని వియోగము తాత్కాలికమని, సహ్యమని రాముడెఱుగును. ఐనను ఆమె వినోదమునకై చిత్రఫలకముల నేర్పరిచినాడు. ఆమెయొక్క ఈషద్దుఃఖాపనోదనము తనవిధిగా భావించెను. ఇట్టి సమయములోనే, అష్టావక్రుడు ఋష్యశృంగాశ్రమమునుండి సందేశము తెచ్చును. వెంటనే కృపణమైన రాజత్వ ముప్పొంగినది.

స్నేహం దయాంచ సౌఖ్యంచ యది వా జానకీ మపి
ఆరాధనాయ లోకస్య ముంచతో నాస్తి మే వ్యథా॥

అను ప్రతిజ్ఞ చేసినాడు. స్నేహదయాసౌఖ్యముల నేకకాలమునపొందవలసిన అంతర్వృత్తి, అమూటియొక్క మూర్తియగు సీతను విడచుట తనకు వ్యథాకరము గాదని చెప్పుట కొందరపాటు గదా! ఈ ఔదార్యమే మరికొన్ని నిమిషములలో

ప్రత్యావృత్తః పునరపి స మే జానకీ విప్రయోగః

అని భ్రమించునపుడు,

కి మస్యా న ప్రేయోయది పరమసహ్యాస్తువిరహః

అని అపవాదము కల్పించుకొనునపుడు ఆభాసమాత్రముగా కన్పించునుగదా! ఇట్లే రాముని అనా

లోచిత ప్రవృత్తి, తాత్కాలికోద్వేగకలితమై ప్రథమాంకమున, ప్రతి క్షణమున మనకు వ్యక్తీకరింపబడుచున్నది. చిత్రఫలక వృత్తాంతమంతయు రాముని ప్రవృత్తిలోని ఈ నిమ్నోన్నతములను చూపించుచున్నది. కవి, ఈ ప్రవృత్తిని స్పష్టముగా నిర్దేశించు సన్నివేశములనే చిత్రఫలకరూపమున జొప్పించినాడు. ఈ చిత్రములను మూడు విధములుగ మనము విభజించుకొనవచ్చును. నాయకీనాయకులకు జయప్రదములై సుఖవంతములైనవి. వివాహవృత్తాంతము హనూమత్సందర్శనము మొదలైనవి. దర్శనమాత్రముననే ఇవి సహజముగా రామునిలో సుఖతరంగముల నుచ్చైఃకక్ష్యలకు ప్రకోపింపజేయును.

జనకానాం రఘూణాం చ సంబంధః కస్య న ప్రియః
యత్ర దాతా గృహీతా చ స్వయం కుశికనందనః॥

అన్నవాడు

జనకానాం రఘూణాంచ యత్కృత్స్నం గోత్రమంగళం
యాం దేవ యజనే పుణ్యే పుణ్యశీలామజీజనః॥

అని సీతాపరిత్యాగ సమయమున ఈ రఘుజనకాదులను స్మరించుకొన్నాడు గదా! ఐననూ ఈ పరిత్యాగముచే రఘువంశమే పవిత్రమగునని సిద్ధాంతీకరించుకొన్నాడు.

రెండవరకపు చిత్రములు భయజుగుప్సావహములైనవి. దుఃఖోన్మీలనము చేయునవి. రాముడు వీటిని చూచి దుఃఖస్తంభితుడగును. నిందాగర్భితమగు ఆత్మవిమర్శనలో లీనమగును. ఇటగూడ సీతావిషయములో పూర్వపు కష్టములకు తనకేమో బాధ్యత యున్నటుల ఆరోపించుకొనును.

నైసర్గికీ సురభిణః కుసుమస్య సిద్ధా
మూర్ధ్ని స్థితిర్న చరణై రవతాడనాని.

అను నుపమలో ఈ విధమగు ఆత్మనిందను ధ్వనీకరించుకొన్నాడు. మూడవరకము పరనిందాకారకములు. వీటిని చూచునపుడు ఆత్మశ్లాఘ్యత్వమును బుద్ధిపూర్వకముగ నివారించినాడు. అందుగూడ కొంత అసహజత తోచుచున్నది. ఈ ప్రవర్తన గూడ ఆత్మశ్లాఘ్యతా పర్యవసాయియే కాగలదు. మంథరావృత్తాంతము, పరశురామ భీషణము మొదలగు దృశ్యములకు విముఖుడైన రాముడు "యది వా జానకీ మపి" అని ఏల ప్రతిజ్ఞలు పలుకుట? ఇచ్చట అనాలోచితముగానే తన శక్తి నుల్లంఘించిన వాడు గాలేదా?

ఇట్టీ యంకమున అనేక స్థలములలో రాముని ప్రవృత్తిలో ఉద్రిక్తత గోచరించుచున్నది. ఇది అపరినిష్ఠతకు తార్కాణము. ఒకస్థితినిగాని, విషయమునుగాని ప్రాకృతము భంగురము నగు దృష్టితో చూచి తేల్చివేయు తేలికస్వభావము నీవిధముగా వ్యక్తము చేయుటతో కవి తన నాయకపాత్రోన్మీలనము ప్రారంభించినాడు.

కాని ఈవిధమైన అస్థిరతలో నున్ననూ, మన కత డవిశ్వాస్యుడు కాడు. రాజుగాను, భర్తగాను కూడ మన కత డశంకనీయుడుగా కన్పించును. అతని ప్రతి వాక్యములో హృదయమందలి ఆవేగము, స్వచ్ఛత సమన్మీలితము లగును.

లౌకికానాం హి సాధూనాం అర్థం వా గనువర్తతే
ఋషీనాం పున రాద్యానాం వాచ మర్థోనుధావతి.

అని నిత్యసత్యములను పల్కునపుడుగాని,

మ్లానస్య జీవకుసుమస్య వికాసనాని
సంతర్పణాని సకలేంద్రియమోహనాని
ఏతాని తే సువచనాని సరోరుహాక్షి
కర్ణామృతాని మనసశ్చ రసాయనాని॥

అనుచోట సీతకు తనకుగల సంబంధమును నిర్వచించుకొనునపుడుగాని—

క్రవ్యాద్భ్యః బలి మివ నిర్ఘృణః క్షిపామి

అను ఆత్మ దూషణములోనున్న నిజమును గాని మనము శంకింపలేము. ఐననూ ఎక్కడికక్కడ సత్యమైన రామప్రవృత్తిలో పరస్పరవైరుధ్యము పొడగట్టుచూ, అనుస్యూతమైన నిత్యశ్రేయస్త్వము తెరమఱుగై, తన ప్రవృత్తిలోని వైకల్యము తనకే గోచరించెనో యన్నట్లొక బాధ కన్పించును.

ఈ ఆత్మవిరోధమే అష్టావక్రముఖ విగళితమైన వశిష్ఠసందేశమునకు వక్రవ్యాఖ్యానమును గల్పింపజేసినది. ఈ వ్యాఖ్యానము దుర్ముఖ దూషితమైన వార్తతో మేళవించి దుష్ఫలితము నిచ్చినది. నైకదా విరహితమగు వశిష్ఠారుంధతీతత్త్వము అష్టావక్రత్వమును బుచ్చుకొని, దుర్ముఖగామియై విపరీతమగు విరహమిచ్చుటకు కారణము రామపాత్రలోగల ఈ ఆత్మవైరుధ్యమే గదా. కవి తన సన్నివేశములనేగాక, పాత్రనామములను గూడ అనుగుణముగా రూపొందించుకొని, నాయకునిలో నీభావసంఘర్షణ కల్పించినాడు. లేకున్న

వాల్మీకి చెప్పని అష్టావక్రు డేల? రామాయణములోని భద్రముఖుడు దుర్ముఖు డేల కావలసివచ్చె?

ఇట్లు బయలుదేరిన ఆత్మసంఘర్షణముయొక్క పర్యవసానమేమి? ఇది యీ రెండు భావములకు అతీతముగావలె; ఆ రెంటిలోనూ అనుస్యూతమున్నూ గావలె. దీనినే రాముడు ప్రథమాంకములో ఒక సంధి సమయమున అనుసంధానించినాడు. చిత్రదర్శనమైనది. సీత సంతృప్తితో నిద్రకొరిగినది. దుర్ముఖుడు రానున్నాడు. ఇట భావసంఘర్షణ లేదు. చిత్తము ప్రశాంతముగా నున్నది. పూర్వచర్వితమైన సుఖలాల సత విశ్రాంతి గైకొన్నది. ఆగామిదుఃఖపరంపర తల యెత్తలేదు. ఆ సమయమున కవి రామునిచేత ననిపించినాడు:

అద్వైతం సుఖదుఃఖయో రనుగతం
సర్వాస్వవస్థాసు య
ద్విశ్రామో హృదయస్య యత్ర
జరసా యస్మిన్నహార్యో రసః।
కాలే నావరణాత్యయా త్పరిణతే
య త్స్నేహసారేస్థితం
భద్రం తస్య సుమానుషస్య
కథమప్యేకం హి తత్ప్రాప్యతే॥

ఈ పరమోత్కృష్టతత్త్వమును రాముడు కేవలము భావన చేసికొన్నాడు. దానిని చేరవలసియున్నది. ఇందుకై సందేశద్వయముచే భావ సంఘర్షణము బయలుదేరినది. ఇట బీజముప్తమై మొలక వేసినది.1 ప్రథమాంక మంతమైనది.

ద్వితీయాంకము దండకారణ్యములో శంబూక వృత్తాంతము. ఇచట గూడ రెండు భిన్నభావములకు సంఘర్షణ చూపబడినది. ఒకటి ఋషిప్రోక్తమగు రాజధర్మము; రెండవది కేవల మానవతా జుష్టము. ఈ రెంటి సంఘర్షణ పూర్వాంకమందలి లవణాసురవృత్తాంతమందే ప్రారంభింపబడెనని భావింపవచ్చును. సీతా పరిత్యాగము తప్పని సరియై, రాముడు ఆక్రోశించు సమయమున మునీశ్వరుల అబ్రహ్మణ్యము విన్పించినది; తన ప్రభుత్వమును జ్ఞప్తికి తెచ్చినది. ఆ క్షణము తన కర్తవ్యమను విషయము మాత్ర మీ లవణాసుర వృత్తాంతము జ్ఞప్తికి దెచ్చుట సంభావితము. కాని, ఆపన్నురాలు, ఆపన్నసత్వయు నగు తన ధర్మపత్నిని విడుచుటకే రాముడు సంకల్పించినాడు. ఇందుకై తనను సమాధానపరిచిన వ్యాఖ్యానము పన్నెండేండ్లుగా తన హృదయములో సలుపుచున్నది. ఆ తర్వాత తిరిగి అట్టి నృశంసత్వమే చూపింపవలసి వచ్చెను. కాని ఇప్పుడు జరిగినది అధర్మము. దాని ఫలితము బ్రాహ్మణబాలుని మృతి. రాజధర్మముచే అతనిని బ్రతికింపవలెను. కాని మానవధర్మము దానికి ఒప్పుట లేదు.

రే హస్త దక్షిణ మృతస్య శిశో ర్ద్విజస్య
జీవాతవే విసృజ శూద్రమునౌ కృపాణమ్।
రామస్య బాహు రసి నిర్భరగర్భఖిన్న
సీతావివాసనపటోః కరుణా కుత స్తే॥

దాక్షిణ్యమనుట కేవల బాహ్యాడంబరము. "రే, నీచ హస్తమా! శూద్రుడైనను, ముని మౌనవ్రతావలంబి. కరుణారహితుడవు నీవు". అని తన కృత్యములకు తనే అసహ్యించుకొనుచున్నాడు. ప్రథమాంకమున రాముని లో రాజత్వ మెక్కువపాలు. అచ్చటవస్తుతః ప్రభువు, బాహ్యతః రాముడు. ఇచ్చట ఇది వినిమయమైనది. ప్రభుత్వము ప్రపంచముకొరకు మానవత్వ మాత్మక్షాళన కొరకు. ఈ మార్పుకు ఈ ద్వాదశవర్ష పరితాప తపః ప్రభావమే కారణము కావచ్చును. కాగా ఇట ప్రేయస్త్వ మాత్మభాసిత మగుట మొదలైనది. రాజత్వములోని రాజసత్వము నశించుటకు ప్రారంభించినది. ద్వితీయాంక ప్రారంభమున రాముని మనోవృత్తి,

వజ్రాదపి కఠోరాణి మృదూని కుసుమాదపి
లోకోత్తరాణాం చేతాంసికోహి విజ్ఞాతు మర్హతి॥

అన్నవాసంతివలెనే మనకు గూడ దురవగాహము. కాని అంకాంతమున.

పురా యత్ర స్రోతః పులిన మధునా తత్ర సరితాం
విపర్యాసం యాతో ఘనవిరలభావః క్షితిరుహామ్,
బహోర్దృష్టం కాలా దపరమివ మన్యే వన మిదం
నివేశః శైలానాం త దిద మితి బుద్ధిం ద్రఢయతి

అని రాముడు తనలో కలిగిన విపర్యాసమునే బహిఃప్రపంచమున గూడ చూచెనేమో, రాముడు చూచుచున్న దివ్యప్రకృతిలో ఒక భాగము మహోన్నతము; మరొకటి నిమ్నగామి. కవి ఈ రెంటిని చూపుటలో అంకమును ముగించినాడు.

1. ఇట ఆలంకారికార్థ ముద్దేశింపబడలేదు.

# భవభూతి : రామతత్త్వము

ఏతే తే కుహరేషు గద్గద నద
ద్గోదావరీవారయో
మేఘాలంబిత మౌళి నీల శిఖరాః
క్షోణీభృతో దక్షిణాః,
అన్యోన్య ప్రతిఘాత సంకుల
చలత్కల్లోలకోలాహలై ః
ఉత్తాలస్య ఇమే గభీరపయసః
పుణ్యాః సరిత్సంగమాః.

ఈ గోదావరి అచ్చటనుండి ప్రవహించుచున్నది. ఇచ్చట తరంగము లుత్తాలములై ఆ మేఘాలంబిత మౌళి నీల శిఖరములను తాకుచున్నవి. ఈ రెండు వేరుగాదు. రెంటిమధ్య సామరస్యము గలదు. దానిని చూపుటకు రెంటికి అధిష్ఠాత్రియగు వాసంతి కావలె. ఆమె తృతీయాంకమున ఈపని నొనర్చినది.

ఈ ఘట్టము కవియొక్క పరిణామదృష్టికి పరాకాష్ఠ. రాముడు దండకారణ్యావాసప్రియసఖితో ననుభవించిన సుఖములను స్మరించుకొని విశీర్ణుడగుచున్నాడు. వేరొకవంక "కరుణస్యమూర్తి రథవా శరీరిణీ విరహ వ్యథేవ"-జానకి రామునిలో తనను విషయముగా గైకొన్న పరిణామమును కనులార జూచుచున్నది. వాసంతిరాముని అంతఃకరణమును క్షాళన చేయుచున్నది. వేలయైన సీత రామునకు కల్గు దారుణాఘాతములచే క్రుంగిపోవ, తమస వాగమృతమును స్వదింపచేయుచున్నది.

అంతర్లీనస్య దుఃఖాగ్నే రద్యోద్దామం జ్వలిష్యతః
ఉత్పీడ ఇవ ధూమస్య మోహః ప్రాగావృణోతి మామ్॥

ఇది రాముని మనస్థితి. ధూమోత్పీడనము పోయి రామునికి జాజ్వల్యమాన మయిన అగ్ని ప్రకాశించుటతోపాటు తత్కారణమైన దుఃఖమునుగూడ నశింపవలె. సీతా సంస్పర్శన సుఖమను చల్లగాలి ఎడనెడ ఈ ధూమమును పోగొట్టుచున్నది. కాని యిది తాత్కాలికమును, జడతోత్పాదకము నగుచున్నది.

సంతాపజాం సపది యః పరిహృత్య మూర్ఛా
మానంద నేన జడతాం పునరాతనోతి॥

రాముడు తనలోనున్న ప్రేయస్యాగ్నికి ఈ దుఃఖావృతిని తెచ్చుకున్నాడు.

ప్రసాద ఇవ మూర్తస్తే స్పర్శః స్నేహార్ద్రశీతలః
అద్యాప్యానందయతి మాం త్వంపునః క్వాసినందిని॥

దుఃఖావృతి సడలినది. ఆనందము దృగ్గతమైనది. కాని ఇది కేవలము త్వగ్గతమయిన స్పర్శానందము. అనంతరానందమునకై నందిని కన్పించవలెను. ఆమె ప్రత్యక్షమగుటకు సడలిన ఆవరణ మస్పష్టగానే నిలచి యున్నది. వాసంతి ఆఘాతములచే ఈ దుఃఖావృతి అంతఃకరణమునుండి విశీర్ణమై పొరలు పొరలుగా ఉద్గీర్ణ మయినది.

ఈ విశీర్ణ ప్రక్రియకు కవి అవలంబించిన సాధనము అతిలోకము. సీతాప్రవాసమువలన, రాముడు ముఖ్యముగా సీతా సంతానమునకు, సుఖైకక్షేమమగు ఆమెక్షేమము నాకాంక్షించు బంధుజనమునకు దూరం కావలసిన వాడయినాడు. ఈ వర్గద్వయ మందలి అపచారమును రామునకు చూపి పరితప్తుని చేయుట దండకారణ్య విహారమందలి మొదటి ఘట్టము.

సీతాదేవ్యా స్వకరకలితైః స్సల్లకీ పల్లవాగ్రైః
అగ్రేలోలః కరికలభకో యః పురాపోషితోఽభూత్
వధ్వాసార్థం పయసి విహరన్ సోఽయ మన్యేన దర్పా
దుద్దామేన ద్విరదపతినా సన్నిపత్యాభియుక్తః॥

అనువాసంతీవాక్యమున మాతృపరిత్యాగముచే సీతా సంతానమునకు రాగల ప్రమాదము ధ్వనితమైనది. కాని రాముని ప్రయత్నము లేకనే స్వశక్తితో కరికలభము సురక్షితమైనది. ఇందుచే రామునకు పితృధర్మ జ్ఞాపకము, సీతకు మాతృత్వసిద్ధి. ఈ ధర్మలోపకృతమైన దుఃఖముచే కతిపయకుసుమోద్గమమైన కదంబము, పరిచయమనుసంధించు మయూరము రామునికి మోదకరములు మాత్రమేవినవి. కాని—

నీరంధ్ర బాలకదలీవన మధ్యవర్తి
కాంతాసఖస్య శయనీయశిలాతలం తే।
అత్రస్థితా తృణమదా ద్వన గోచరేభ్య
స్సీతా తతోహరిణకైర్న విముచ్యతే స్మ॥

అను దృశ్యము సీతకుగూడ నిర్వాణ మనునట్లుగా రాముని కదలించి వేసినది. వాసంతిగూడ ఈ పరితాపముతో సీత యెడల జరిగిన అపచారము క్షాళితమైనట్లు, సీత నుద్దేశించి "కథమపి స ఇత్యున్నేతవ్య స్తథాపి దృశోః ప్రియః" అని పల్కినది.

ఇట్లు సీతా విషయకమగు దోషము రామునిలో క్షాళనచేసి, వాసంతి రామునిలోని ఆత్మనిష్ఠములగు దోషములను బహిర్గతముచేయ సమకట్టినది. ఈ దోషము

లను గూడ, ప్రభుత, యశఃకామత అనివర్గీకరణము చేయవచ్చును. ప్రభుతాదోషము నుల్లేఖన చేయుటకు వాసంతి తిర్యంచములను, స్థావరములను ప్రభువుల కుపచారముచేయ నాజ్ఞయిచ్చినది. ఏమి ఈవ్యంగోక్తి? ఈ ప్రభుతా ఛాయలో సుఖపడవలసినది ప్రజలు (ప్రజలు మాత్రమేనా?) వారికి అగ్రగామి యగు ప్రతీక లక్ష్మణుడు. అందుకే వాసంతి అడిగినది "మహారాజ, అపికుశలం లక్ష్మణ కుమారస్య?" అని. ఈ లక్షణా వృత్తి గూడా గంభీరుడగు రాముని ఖాలన చేయలేకపోయినది. కర్కశమైన అభిధ—అభిధానానర్హమైన అభిధ — ప్రయోక్తకే వజ్రాఘాతమైన అభిధ నుపయోగింపవలసి వచ్చినది.

త్వంజీవితం త్వమసి మే హృదయం ద్వితీయం
త్వంకౌముదీ నయనయో రమృతం త్వమంగే।
ఇత్యాదిభిః ప్రియశతై రనురుధ్య ముగ్ధాం
తామేవ—శాంత మథవా కిమిహోత్తరేణ"

ప్రజాకారణముగా వచ్చిన దుఃఖములను జీర్ణింప చేసికొన్న ప్రభువు దీనిని హాలాహలమువలె మ్రింగినాడు. కాని మనస్సులో గూడుగట్టుకున్న దుఃఖము ద్రవించినది. దీనిని నిష్క్రమింప చేయుటకు యశఃకామతపై ప్రేటువేసినది.

అయికఠోర యశః కిల తే ప్రియం
కిమయశో నను ఘోరమతః పరం।
కిమభవ ద్విపినే హరిణీదృశః
కథయనాథ కథం బత మన్యసే॥

రాముడు తన తప్పిదమును ఒప్పుకున్నాడు.

క్రవ్యాద్భి రంగలతికా నియతంవిలుప్తా.

ఇది కరుణమునకు పరాకాష్ఠ. దోషి తను చేసిన దోషఫలమును తన మనసుతో నూహించి తననోటితో నొప్పికొనుట దోషత్వాపనోదకము. దీనితో రామునిలో నున్న మాలిన్యము లన్నియు క్షాళితములైనవి. తమసా వాక్యములో—

పూరోత్పీడే తటాకస్య పరీవాహః ప్రతిక్రియా।
శోకక్షోభేచహృదయం ప్రలాపై రేవ ధార్యతే॥

ఈపరీవాహములో క్షోభ కశ్మలమంతయు కొట్టుపోయి కేవల స్వచ్ఛమైన కరుణ మిగిలినది.

"నను లాభో హి రుదితమ్."

ఇదియొక సంధ్యవస్థ. మాలిన్యావృతమైన కరుణ దుఃఖమగుచున్నది. స్వచ్ఛతావలంబియైనపుడు స్థాయిని బొంది సంవేదనాకారణమగును. కశ్మలనివృత్తమైన రసము నిరవలంబనమైనచో శూన్యత్వము ప్రబలి నీరసవాదమున కాస్కారమగును. ఈ తత్త్వమునే తమసావాక్యముగా తన నాటకమున కాయువుగా కవి చెప్పినాడు.

ఏకో రసః కరుణ ఏవ నిమిత్తభేదాత్
భిన్నః పృథక్పృథ గి వాశ్రయతే వివర్తాన్
ఆ వృత్త బుద్బుదతరంగమయాన్ వికారాన్
అంభోనిధి స్సలిలమేవహి యత్ సమస్తం"

ఆవృత్త మధోగామి. బుద్బుదము క్షణికము. తరంగ మూర్ధ్వగామి. రామునికరుణ ఆవర్తమునుండి లేచినది. ఇది తిరంగము కావలె. లేకున్న బుద్బుదమై క్షణికమై శూన్యమగును. రాముడు రెండవసారి మోహము పొందినపుడు.

శూన్యం మన్యే జగదవిరల జ్వాల మంతర్జ్వలామి.

అని మందభాగ్యునిగా భావించుకొన్నాడు. తిరిగి సీత స్పృశించినది. కాని ఈ స్పర్శమున రాముడనుభవించిన ఆనందము పూర్వస్పర్శవంటిదిగాదు. ఇట రాము డాయానందానుభవమున కళ్ళు తెరువలేదు.

"ఆలింప న్నమృతమయై రివ ప్రలేపై
రంతర్వా బహిరపివా శరీరధాతూన్
సంస్పర్శః పున రపి జీవయ న్నకస్మా
దానందా దపర మివాదధాతి మోహం"

ఇట జడత్వ ప్రసక్తిలేదు. కేవలమగు అమృతప్లావనముచే అంతర్ధాతువుల జీవన మే. కాని అనభ్యస్తమగుటచే ఆలంబనము జారిపోయినది. ఇది నిత్యమగుటకు కాలము కర్మగూడ కలసిరావలెను. ఈ కాలము ప్రాచేతసనిర్ణీతము. కర్మనాశమునకు తనదోషములచే వంచితులైనవారి తృప్తి ఉపలక్షకము. ఈ రెండు క్రమేణ జరుగ గలవు. అపుడే అమృతయగు సీతాప్రాప్తి. అంకాంతమున తమసావాసంతుల ఆశీర్వాక్య మిది.

అవని రమరసింధుః సార్థమస్మద్విధాభిః
సచకులపతి రాద్యః ఛందసాంయఃప్రయోక్తా।
సచమునిరనుయాతారుంధతీకోవశిష్ఠః
స్త్వయివితరతుభద్రం భూయసే మంగళాయ॥

# భవభూతి : రామతత్త్వము

వాల్మీకి వశిష్ఠులు యుక్తకాల నిర్ణేతలు—అన్యులు కర్మపరిపాక నిర్ణాయకులు. వీరందరి ఆమోదము భూయో మంగళకరము. నాల్గవ యంకమునుండి ఈ కాలకర్మము లెట్లు కలసివచ్చినవో చూడగలము.

నాల్గవ యంకమున ప్రవేశించినది జనకరాజర్షి.

ఏషవః శ్లాఘ్య సంబంధీ జనకానాం కులోద్వహః।
యాజ్ఞవల్క్యో మునిర్యస్మై బ్రహ్మ పారాయణం జగౌ॥

అని అరుంధతిచే గూడ ప్రస్తూయమానుడైన జనకుడు తన శిశువుయొక్క వదనకమలమును, స్ఖలదసమంజ సమంజు భాషితములను స్మరించుకొని, క్రకచమువలె మర్మనికృంతమైన కోపముతో "అః కోయ మగ్నిర్నామ అస్మత్ప్రసూతి పరిశోధనే" అని హుంకరించినాడు. కాని తన కెదురుగా నున్నది ఉషోదేవివలె నున్న జగద్వంద్య భగవతి అరుంధతి. కౌసల్యపై రోషము చూపింపవద్దని ప్రతిమాలుచున్నది. ఆత్మసంయమనము జీవిత మావిదేహునకు. అయినను సంకటము, "ఘోరేఽస్మిన్ మమ జీవలోకనరకే పాపస్య ధిగ్జీవితమ్" అనిపించినది. కాని వశిష్ఠుని వాక్యము ఆవిర్భూత బ్రహ్మర్షి వ్యాహారము. లవుడు వచ్చినాడు. జనకునిలో కౌసల్యలో జీవనమున స్పృహ నేర్పరచుచున్నాడు.

వత్సాయాశ్చ రఘూద్వహస్యచ శిశావస్మిన్నభివ్యజ్యతే
సంపృక్తిః ప్రతిబింబితేవ నిఖిలా సైవాకృతి స్సాద్యుతిః
సావాణీ వినయ స్సఏవసహజః పుణ్యానుభావోఽప్యసౌ

అని ఆలంబనము దొరికినది. కాని వెంటనే.

హాహా దేవి కిముత్పథైర్మమ మనః పారిప్లవం ధావతి?

అని నిస్పృహ. ఈ అసహాయతనుండి—లవ సంభాషణవలన ఈ నిస్సహాయత జ్ఞప్తికిరాగానే—రోషజ్వాలలు.

ఏతద్వైశస వజ్రఘోరపతనం శశ్వన్మమోత్పశ్యతః
క్రోధస్య జ్వలితుం ఝటిత్యవసరః చాపేనశాపేన వా॥

అన్నాడు. కాని అరుంధతీ సాంత్వనామృత మా జ్వాలలను చల్లార్చినది. తన కర్తవ్యమేమి? ఈ మార్గమునకు ప్రాచేతసుని దర్శనము చేయవలె. అందువలనగాని తన రక్తములోని రక్తమను చిన్నతల్లి సీతను పరిత్యజించిన రామునియెడల దుష్టమైన మనస్సు ప్రశాంతము కాదు. వాల్మీకి చిత్తప్రశాంతి నొసంగి జనకుని క్షమాదాతనుగా చేయగలడు. అందు రామునికర్మ కొంత వశింపగలదు.

కాని సంపూర్ణమైన కర్మ నాశనమునకు, సీతా సంతానము గూడ తృప్తినొందవలెగదా! లవుడు జనకాదులకు తనకు తెలిసిన రామునికథను విన్పించుచున్నాడు. "రాజ్ఞా నిర్వాసితాం దేవీం దేవయాజన సంభవాం సీతా మాపన్న ప్రసవవేదనా మేకాకినీ మరణ్యే లక్ష్మణః పరిత్యజ్య ప్రతినివృత్తః"

రాముడు రాజు. ఆమె దేవి, దేవయజన సంభవ, ఆసన్న ప్రసవవేదన, ఏకాకినియగు సీత—యిది చాలు లవునకు రాముడన్న ఎంతకోపమో తెల్పుటకు. కావుననే జనకుని జూచి ఆమోదము తెల్పినాడు.

"ఏతద్ధి పరిభూతానాం ప్రాయశ్చిత్తం మనస్వినామ్" అని. ఇది సీతాసంతానముయొక్క ఆలోచన.

ఐదవయంకమున లవచంద్రకేతువుల సమావేశము. చంద్రకేతువు రాజప్రతినిధి. లవుడు సీతాపుత్రుడు. రాజ తద్వంచితుల కిట సమావేశము. కాని ఈ రాజు నాటి రాజుకాదు. తన ప్రభుతాదౌష్ట్యమును గుర్తించినవాడు. అందుచేతనే లవునిలోని రసము మిశ్రీకృతమైనది. ఒకరియం దొకరికి ఆదరము, అంతలో అహంభావతాజుష్టమైన విజిగీష. ఈ రెంటి ఘాతికసంఘర్షణ ఆరవయంకమున జరుగుచున్నది.

ఇట నొకవిషయము చర్వణము చేయవలసియున్నది. శ్రేయస్త్వ మాత్మధర్మము. బాహ్యములైన ధర్మాధర్మశాసనములు ఆత్మప్రత్యర్థులు కారాదు. ఆత్మయొక్క శ్రేయస్త్వ ముత్తుంగమై బాహ్య ప్రవృత్తులను పరిప్లుతము చేయజాలినప్పుడే ఆనందోల్లాసము జీవితమున కల్గును. అట్లుగాక బాహ్యములగు ధర్మాదులు శ్రేయస్త్వము నడంచజాలునంత తీవ్రములగుచో దుఃఖపర్యవసాయినులే యగును. రాముని ప్రవృత్తిలో దండకారణ్య వృత్తాంతమునకు పూర్వము ధర్మాదు లాత్మగుణములను తిరస్కరించుట వ్యక్తమగుచున్నది. దండకారణ్యమున జరిగిన తపశ్చర్యలో, ఆత్మయందలి శ్రేయస్త్వము తిరుగ నుద్దీపించి ధర్మాది బాహ్యగుణముల నవలోడన చేసినది. రామునిలో కల్గిన ఈ సుఖదాయకమగు పరిణామఫలమే జనకాదుల రోషములోను, లవాదుల సంభాషణలోను ప్రతీక ప్రాయముగా అంతరముల రూపములో కవిచూపించినట్లున్నాడు. విదేహుడైన జనకునిలో ఆశానిరాశల సంఘర్షణము, రాముని ఆత్మధర్మములో అంతస్సులో కల్గిన సంఘర్షణకు ప్రతీకయగుచో, లవచంద్రకేతువుల

ఘర్షణ, ఆ ప్రేయస్త్వము బాహ్యప్రపంచమును వ్యాపించునపుడు కల్గిన పరిణామమును సూచించు నేమో!

ఈ సత్పరిణామమునకై జరుగుచున్న బాహ్య సంఘర్షణలో ప్రేయస్త్వ పూర్ణుడగు రాముడు, దండ కారణ్యమునుండి అయోధ్యకేగుచు, ఈ రెండు దేశ ములకు సమరస స్థానమగు వాల్మీకి ఆశ్రమమున తన పుష్పకమునుండి దిగినాడు. వెంటనే లవునకు—

విరోధో విశ్రాంతః ప్రసరితరసో నిర్వృతిఘనః
తదౌద్ధత్యం క్వాపి వ్రజతి వినయః ప్రహ్వయతి మాం
ఝుటిత్యస్మిన్ దృష్టే కి మితిపరవానస్మి యదివా
మహార్ఘస్తీర్థానామివ హి మహతాం కోప్యతిశయః॥

సీతను పరిత్యజించిన రాముడు ఈ రాముడు కాడేమో! చంద్రకేతువు ఈయన జ్యేష్ఠ తాత పాదులని చెప్పగానే ప్రాచేతసాంతేవాసి నని చెప్పి నమస్కరించెను. యజ్ఞేచ్ఛాగాంతకుడగు కుశుడు గూడ అనుకున్నాడు—

అహో ప్రాసాదికం రూప మనుభావశ్చ పావనః।
స్థానే రామాయణకవి ర్దేవీం వాచ మవీవృధత్॥

ఈ కుమారు లెవరు? రాముని ఈ సంశయ నివృత్తికి కవి అవలంబించిన మార్గము అకాళిదాసము, అతి కాళిదాస మన్నను సాహసము కాదు. తనకు సీతకు గల పోలికలు ఈ సంశయ నివృత్తికి దోహదము లగు చున్నవి. తమ యిద్దరి సామరస్య మీ సంతానము.

అంతఃకరణ తత్త్వస్య దంపత్యోః స్నేహసంశ్రయాత్
ఆనందగ్రంథిరేకోయ మపత్య మితిగీయతే

అను తమసావాక్యమును రాము డిచ్చట మననము చేసికొనుచున్నాడు. అనుభవించుచున్నాడు. రామాయణగానమున కుశునిచేత రామునకు సీతా ప్రేయస్త్వమును కవి జ్ఞాపకముచేయుచున్నాడు.

ప్రకృత్యైవ ప్రియా సీతా రామస్యాసీ న్మహాత్మనః।
ప్రియభావః సతు తయా స్వగుణైరేవ వర్ధితః॥

తథైవ రామః సీతాయాః ప్రాణేభ్యోపి ప్రియో భవత్।
హృదయం త్వేవ జానాతి ప్రీతియోగం పరస్పరం॥

ఆహోర్ధత ఈనాడు ఏమైనదని రాముని పరితాపము. ఈ అంతః ప్రేయస్త్వమే బాహ్య సుఖమునకు కారణము. శిలాపట్టకము నుల్లేఖించి ఈ విషయమునుగూడ జ్ఞాపకము చేయించినాడు కవి. ఇంతటితో కుమార కర్తవ్యమైనది. వారుగూడ, అతి నిశితముగ, సూక్ష్మముగ రామునిలో మర్మోద్ఘాటనముచేసి, అతనిని క్షమార్హుని చేసినారు. కావుననే రాముని అల్లంత దూరమున జూచి జనకాదులు క్షమించినారు. శాప చాపములకు ప్రసక్తి లేనట్లుగా రాముడు తాపముచే పరిశుద్ధుడైనాడు. ఇట్లు సీతాపరిత్యాగ వంచితుల క్షమచే కర్మ పరిపక్వము చెందినది.

నిర్దిష్టకాలము గూడ ఆసన్నమైనది. వాల్మీకి పృథివీ భాగీరథుల చేసీత నర్పింపజేసినాడు. ఇటగూడ రామదోషముల నుల్లేఖించినాడు కవి.

నప్రమాణీకృతః పాణిః బాల్యే బాలేన పీడితః।
నాహం న జనకో నాగ్ని ర్నాను వృత్తి ర్న సంతతిః॥

ఇది నాటక ప్రారంభమున రాముడొనర్చిన దోష పరంపర. నేడు ఈ దోషములన్ని ఆత్మశోధనమున క్షాళిత మొనరించుకొన్నాడు. అందరు రాముని క్షమార్హుని చేసినారు. అతనిలోని నైర్మల్యము నుద్దీపింప చేసినారు. కాని ఇందుల కాలంబనములేదు. రాముని లో రసభరమునకు పాత్ర ఏది? సీతా విలయమేనా కావ్యార్థము? చివరకు రామునిలోని ప్రకాశము భిన్నమై పోవలెనా? అట్లగుచో దేవతలు రామునికి ఋణపడియే యుందురు. తపస్తాపము నిష్ఫలము కారాదు. ఈ తపస్సుకు పృథివీ భాగీరథులే సాక్షులు. కావుననే సీతను అర్పించి అనృణులైనారు వారిద్దరు. సీత రాముని స్పృశించినది. ఇది మూడవస్పర్శ. రాముడు తరంగ స్థాయిలో నున్నప్పటి స్పర్శ కావుననే రాముడామెను జూచి "కథం దేవి" అని మాత్రమన్నాడు. ఆమెలో దివ్యత్వమును చూడగల్గినాడు. బాహ్యమైన భోగతి, మానసికమైన లాలసత లుప్తమైనవి. ఈనాడామె అమృత.

ఈవిధముగ అమృతమూర్తి సీత రామునికి దక్కినది. తనలో రాజసముచే సీతను గుర్తించలేదు. దానికి ఫల మనుభవించినాడు. ఫలానుభవముచేగాని మానవుని కర్మ నశింపదు. ఈ అనుభవము మానసికమైనచో ఉత్తమోత్తమము. రాముడు తాప తపస్సుచే నిష్కళంకుడై సీత తనదేయని గ్రహించినాడు.

ఇట చారిత్రకము తాత్త్వికము నగు నొక విషయమును స్పృశించుట అసంగతము కారాదు. శ్రీకంఠుడు, భవభూతి — పూర్వమీమాంసావాది ఉంబేకుడు,

మండనమిశ్రుడు - సురేశ్వరాచార్యులు, విశ్వరూపధరాచార్యులు—వీరందరు చారిత్రకముగా నొకరేయని కొందరి మతము. ఈ జంటనామములు మూడింటిలో మొదటిది అసలుపేరు, రెండవది బిరుదమట. తథాస్తు. అద్వైతమున శ్రీ సురేశ్వరులు పరిణామవాదమునకు దర్శకులు. వారిది నైష్కర్మ్యసిద్ధి. మానవుడు కర్మనుండి దూరుడు కాలేడు. కర్మచే మనస్సు పరిపక్వము గావలె. ఆ నాడు తనకభిన్నమైన ప్రపంచములోని సత్త్వమును గ్రహింపగల్గుచున్నాడు. మృతప్రాయము జడమునగు ప్రపంచము మర్త్యత్వము జడత్త్వము లోపించుటచే, అమృతత్త్వమును, చిత్త్వము భాసింప చేసికోగల్గునది. కర్మనంటక కర్మ చేయుటచేతనే, ఇది సురేశ్వరుల ప్రవచనసారాంశము. ఇట పూర్వోత్తర మీమాంసల సమన్వయముగలదు. ఈ ప్రపంచమే బ్రహ్మ. ఇందలి ప్రపంచత్వ నిర్వ్యాసనమే బ్రహ్మ లాభము. ఇందుకు నీయొక్క అకామప్రయత్న మవసరము. రాముడీప్రయత్న మొనరించినాడు. బలీయమైన కాలీనమును కర్మచే తనవద్దనున్న అమృతమూర్తి సీతను వెట్టజూచినాడు. కాని ఆ సీత లేనందున తను మృతప్రాయుడనని గ్రహింపగల్గినాడు. తిరిగి, ఆసీతా ప్రాప్తికి తపఃకర్మ, పరితాపరూపమున చేసినాడు. ఇందుకు వాసంతి మొదలగు వ్యక్తులు, శంబూకవధ మొదలగు విషయములు ఉత్తేజకరములై సాధనములైనవి. అందుచే తనలోని అమృతమూర్తియగు కళను గుర్తించుకొన్నాడు. వాల్మీకి ప్రపంచమును లోపింపజేసి మానవునిలోని చిత్త్వమును భాసింప బూనుకున్నాడు. భవభూతి ప్రపంచత్త్వమును—అనగా అందలి మర్త్య ధర్మమును—లోపింపజేసి, అమృతత్త్వమును ప్రకాశింపజేసి, ఆ ప్రపంచమును కళను ఆత్మసధర్మముగా చేసినాడు. ఈ లక్ష్యము తన సాధ్యమని ఆయన నమ్మకము.

ఇదంకవిభ్యో పూర్వేభ్యః నమోవాకం ప్రశాస్మహే।
వందేమహి చ తాంవాణీ మమృతా మాత్మనః కలామ్॥

అనినాంది. అదే భరతవాక్యము గూడ కావచ్చును.

# కొడిగట్టిన దీపం

శ్రీమతి వి. అనసూయ

వర్ధనమ్మగారి జీతగాడు సాయంత్రం నాలుగున్నర కల్లా హైస్కూలు ఆవరణలో పంతుళ్ళందరూ విశ్రాంతి తీసుకునే గదిముందు నిలిచి ఆచారికోసం ఆతురతతో అటూ ఇటూ చూడసాగాడు. చివరి పిరియడ్ పాఠం చెప్పి చేతికైన సీమసున్నం కూడా దులుపుకోకుండా, ముఖంమీది చెమటబిందువులు కూడా తుడుచుకోకుండా ఆచారి జీతగాడివెంట బయల్దేరాడు.

బజారు మలుపు తిరగగానే కనిపించే రెండంతస్తుల మేడ గేటు తెరచి లోపలికి తీసుకుపోయాడు జీతగాడు ఆచారిని. ముందుగదిలో రేడియో ప్రక్కన మెత్తలుగల పెద్దకుర్చీ పైపంచతో దులిపి "కూర్చోండి బాబూ" అంటూ జీతగాడు లోపలివాకిలి తెరకుడ్డ తొలగించుకుంటూ గబగబా లోపలికి వెళ్ళాడు.

ఆచారి కుర్చీలో కూర్చుని గదంతా ఒక్కసారి కలయజూచాడు. ఎంతో అందంగా, నాగరికంగా అమర్చబడి ఉన్నది. విలువగల పల్లకట్టుకుర్చీలు, తనకుడి చేతిప్రక్కగా టేబిల్ మీద బుష్ రేడియో, బ్యాటరీ సెల్సు, వాకిళ్ళకూ, కిటికీలకూ నీలపురంగు తెరకుడ్డలూ—అన్నీ చూచేసరికి ఒక పెద్దసమస్య తీరినట్లయి ఆచారిముఖంమీద ఆనందరేఖలు విరిశాయి.

"వచ్చి వారంరోజులన్నా కాలేదు. అప్పుడే ఈపాటి ట్యూషన్ తగిలింది. ట్యూషన్లు లేకపోతే ఎలాగ? వారానికొకసారి రాయరున్నా ఈ డిస్ట్రిక్టుబోర్డు వారిచ్చే డెబ్భైరూపాయలు కాఫీనీళ్ళకుచాలవు" మనసులో కదిలిన ఆనందం ముఖంమీది రేఖల్లో వ్యక్తం కాకుండా చూచాడు ఆచారి.

పదిహేనునిమిషాలు గడిచాయి.

"పోయి మేష్టరుగారికి నమస్కారంచేయి తల్లీ"—అను మందరంలో వీణతీగలు నొక్కినట్లుగా తెర వెనుకనుంచి స్త్రీకంఠం వినిపించింది.

తటాలున ఆచారి చొక్కా బుజంమీది చినుగు కనిపించకుండా ఉత్తరీయపు చెరగులు సర్దుకుని కూర్చున్నాడు.

పరికిణీ కుచ్చెళ్లు సర్దుకుంటూ తొమ్మిదేండ్లపిల్ల ఆచారి పాదాలమీదకు వంగి నమస్కారంచేసి నిలువబడ్డది. గురువాత్సల్యంతో ఆచారిహృదయం ఆర్ద్రమైపోయింది. ఎడమచేతి ప్రక్కనున్న కుర్చీ ముందుకు లాగి "కూర్చోమ్మా" అంటూ టేబిలుమీదున్న తెల్లకాగితాల నోటుపుస్తకాలొకటొకటే తిరగవేయటం మొదలెట్టాడు.

రెండునిమిషాలు గడిచాక "నాన్నగారున్నారమ్మా" అని మెల్లగా అడిగాడు ఆచారి

లోపలినుంచి జీతగాడు హడావుడిగా అక్కడకు వచ్చి, "అమ్మగారున్నారు బాబూ, అయితే మా సుశీలమ్మ ఈఏడాదంతా తమదగ్గర చదివితే ఏక్లాసులో చేరుతుందంటారు?...కాస్త పరీక్షచేయండి బాబూ!" అంటూ తలగుడ్డవిప్పి బుజాన వేసుకొని గచ్చునేలమీద చతికిలబడ్డాడు.

ఇంగ్లీషులో, తెలుగులో వాక్యనిర్మాణం, లెక్కల్లో క. సా. గు, గ. సా. ప్ర, భిన్నాంకాలు సైన్సు, సోషల్ స్టడీస్, —జనరల్ నాలెడ్జి—అన్నీ ఒక అరగంట స్థాలీపులాకంగా పరీక్షచేసి జీతగాని మీదగా లోపలి తెరవైపు చూస్తూ అన్నాడాచారి, "థర్డుఫారంలో తేలికగా చేరుతుంది"

జీతగాడు ఒక్కసారి లోపలకుపోయివచ్చి సుశీల చేతిలో తాంబూలం పెట్టి "మేష్టరుగారికట, ఇవ్వు తల్లీ" అన్నాడు. సవినయంగా, ముద్దుగా లేచినిల్చిన చిరంజీవి చేతిలోని తాంబూలం అందుకుని "విద్యాప్రాప్తిరస్తు" అని తన వయస్సుకు మించిన పెద్దమనిషి తనంతో ఆశీర్వదించాడు.

"రోజూ ఈ వేళకే వస్తూంటానమ్మా. మరి... నే వస్తా" ఆచారి లేవబోయాడు.

"సుశీ, మేష్టరుగార్ని ఫలహారంచేసి పొమ్మనమ్మా!" లోపలనుంచి సన్నని గొంతు గౌరవపురస్సరంగా వినిపించింది. ఒత్తుగా తొడుక్కున్న బంగారు

గాజుల్తో, విలువైన వజ్రపుటుంగరంతో తళ తళ మెరిసే ఎఱ్ఱని కుడిచేయి తెరకు ఇవతలగా కదిలింది.

ఫలహారం ముగించి, తెరవైపుకు తిరిగి ఆచారి "సెలవండీ" అన్నాడు.

"మగదిక్కు లేని సంసారం, అమ్మాయి పట్టి పిచ్చిది. తమ బిడ్డగా చూచుకొని చదువు చెప్పాలి పంతులుగారు," సున్నితమైన గొంతు జాలిగా వినిపించింది.

"అట్లాగేనండీ" ఆచారి తృప్తిగా పలికి బైటకు వచ్చాడు.

మసక మసకగా చీకటి అలముకుంటూంది. పంచాయతీ బోర్డువారి ప్రజాసేవకు ప్రబలచిహ్నంగా నిల్చిన గుడ్డిలాంతరు స్తంభం ఒకటి ఆచారి ప్రక్కగా గబగబా వెనక్కు జరిగిపోయింది. ఉండబట్టలేక ఆచారి రెండడుగులు వెనక్కు వేసి చేతిలోని తాంబూలం విప్పి చూచుకున్నాడు. అతని కళ్ళల్లోకి విద్యుత్కాంతులు ప్రసరించినట్లైంది. ఒక్కడుగులో ఇంటికి వచ్చి పడ్డాడు.

మైసూర్ క్రేప్ సిల్కు చీర, అద్దాలు పొదిగిన జరీ అంచుల రైక గుడ్డ - చలిమిడి, లడ్లు—మొదలైన సర్వవస్తు సంభారంతో—ఆ మరునాడు ఆచారి తల్లి, తొలిచూలు కానుపుకోసం పుట్టింటి దగ్గరున్న కోడలికి సూడిదెలు జరిపించడానికి వియ్యపురాలింటికి కదిలిపోయింది.

హోటల్లో భోజనం చేసి ఆచారి మామూలుగా స్కూలుకు వెళ్లాడు. మొదటి పిరియడ్ పాఠం చెప్పటానికి టీచర్స్ వెయిటింగ్ రూమ్ ప్రక్కగా వస్తున్నాడు. హఠాత్తుగా నవ్వుల్తో కలిపి మాటలు వినిపించాయి. "వర్ధనమ్మ ట్యూషన్ మాంచి వాటంగా ఉన్నట్లుందాచారికి." ఆచారికి గుండె కలుక్కుమన్నది. ఆగి, మాట్లాడే వసతిలేక క్లాసురూములో కెళ్లిపోయాడు.

మధ్యాహ్నం విశ్రాంతిసమయంలో సైన్సు అసిస్టెంటు అచ్యుతరామయ్యను ఏకాంతంగా ప్రక్కకు పిలిచి అడిగాడాచారి. "ఉదయం నా ట్యూషన్ సంగతి ప్రస్తావించుకున్నారేమిటండీ?"

"అదే,...పాపం, ఆ యింట్లో మగదిక్కన్నా లేదా! ఆ పిల్లకు—ఇంత సొంత కూతురుకు చెప్పకున్నట్లు చెప్పుకుంటే సరి,......ఇందులో కొంత 'సోషల్ సర్వీస్' కూడా ఇమిడి ఉంది లెండి"—అంటూ క్రిందిపెదవి ఎడమప్రక్కకు మెలిపెట్టి నవ్వుతూ మెల్లగా కాఫీహోటలు వైపు వెళ్ళాడు అచ్యుతరామయ్య.

ఆరోజు సాయంత్రమంతా క్లాసుల్లో పాఠం చెప్పడం కష్టమైంది ఆచారికి. బడి ఎప్పుడు విడిచి పెడతారా అనిపించింది.

వర్ధనమ్మగారింటి వైపు ఆచారి చకచకా కాలాడించి నడిచాడు. బయటి వాకిట్లో అడుగుపెట్టగానే లోపలినుంచి ముప్పై ఐదేండ్ల మనిషి,...మంచి భారీ విగ్రహం—ఎఱ్ఱని శరీర వర్ణం—నిండుసూటులో ఎడమచేతితో నెక్‌టై సర్దుకుంటూ కుడిచేత్తో హాట్ ఊపుకుంటూ విసురుగా బైటకువచ్చాడు. ఆచారి బిత్తరపోయి చూచాడు.

ఆయన ఆచారి వంక—డాక్టర్ రోగిని పరిశీలించే పద్ధతిలో చూస్తూ వెళ్ళిపోయాడు.

టర్కీటవల్‌తో ముఖమూ, కాళ్ళూ తుడుచుకుంటూ ముందు గదిలోకివచ్చి సుశీల ఆచారికి నమస్కారం చేసింది.

"ఎవరమ్మా, ఇప్పుడు ఈ యింట్లోనుంచి వెళ్ళింది?"

"ఇప్పుడే నిద్రలేచి ముఖం కడుక్కొని వస్తున్నానండీ, నేను చూడలేదండీ,..." ఇచ్చిన హోమ్ వర్కే కాకుండా మరి రెండు పాఠాలలోని ప్రశ్నలకు కూడా జవాబులు వ్రాసిన నోటుపుస్తకాలు ఆచారి ముందు పెట్టి కూర్చున్నది సుశీల.

ఇతర భోగట్టా మానేసి నోట్సులు చూడటం మొదలెట్టాడాచారి. అందులో ఒక నోట్సు చూచేసరికి అతనికి చాలా ఆశ్చర్యం కల్గింది.

"అమ్మాయ్, నీవు సంస్కృతం కూడా నేర్చుకుంటున్నావా?"

"ఔనండీ, రఘువంశం మొదటి సర్గంతా ఐపోయింది."

"సంస్కృతం మేష్టారు ఉదయంపూటవస్తారా"

"లేదండీ, ఇంట్లో మా అమ్మే చెపుతుంది. మా అమ్మ ఎప్పుడూ సంస్కృతం శ్లోకాలు బలే చదువుతుందండీ, నా కసలు నోరు తిరగవు"

ఇంటర్మీడియేట్ దండయాత్రల్లో ప్రాణం విసిగి సెకండరీగ్రేడ్ ట్రైనింగ్‌తో సర్దుకున్న ఆచారికి థర్డ్ ఫారంవరకూ ఇంగ్లీషు, లెక్కలు, సోషల్ స్టడీస్ మొదలైన ఏ సబ్జెక్టైనా కొట్టిన పిండేకాని తెలుగంటే మాత్రం మ్రింగరాని ముద్ద. ఇటీవల శరత్, చలం నవలల వల్ల తెలుగంటే అభిమాన మేర్పడ్డా, "వర్ధనమ్మ గారమ్మాయికి తెలుగు పాఠం చెప్పాలంటే ఒళ్ళు దగ్గరపెట్టుకోవాలేమో" ననుకున్నాడు.

పాఠం చెప్పటం పూర్తైంది. ఒక్క క్షణంలో లోపలికి పోయి సుశీల ఫలహారపు పళ్ళెం తెచ్చి ఆచారి ముందు పెట్టింది. సుశీల పట్టిపట్టువల పిల్ల. ఆచారి వద్దన్నా అతనికి ఫలహారం చేయక తప్పింది కాదు.

మసక చీకట్లో ఇంటికిపోతున్న ఆచారికి బ్యాడ్మింటన్ కోర్టు నుంచి బ్యాట్ ఊపుకుంటూ వస్తున్న అచ్యుతరామయ్య ఎదురుపడి "గుడ్ నైట్ మిస్టర్ ఆచారీ, విష్‌యు ఎ హ్యాపీనైట్" అంటూ వెళ్ళిపోయాడు.

ఆచారికి చండ్ర కోలతో చఱచి కొట్టినట్లైంది. పండ్లు కొఱుక్కుంటూ ఇంటికి వెళ్ళాడు. "ఎగుటివాడు పచ్చగా ఉంటే చూడలేని దరిద్రుడు. చొక్కా కాలర్ పట్టుకొని ఆ చెంపా ఈ చెంపా వాయిస్తే సరిపోయేది......అయినా, ఈ ఊరికి మనం క్రొత్త ... తొందరపడకూడదు ......... కాకపోయినా ఇంత చదువుకొని, గౌరవంగా బ్రతుకుతూ రాఢీసన వల్లా కొట్టుకోవడ మేమిటి?" ఆచారికి అసహ్యం కల్గింది.

రాత్రి ఎనిమిదిన్నరగంటలైంది. ఇంట్లో ఎవ్వరూ లేరు. హోటలుకుపోయి భోజనం చేయాలనిపించలేదు. వర్ధనమ్మగారి టిఫిన్ బలంగాబడ్డది. "ఆమె స్వభావం ఎంత ఉదారమైంది?"

"...మఱి ... వర్ధనమ్మగారింట్లోనుంచి వెళ్తూ వన్నా తేరిపార! చూచిన సూట్‌వాలా ఎవడు?... జీతగాణ్ణడిగితే......ఆఁ... మనకెందుకు? పాఠం చెప్పి ఇవతల కొస్తే పోయేదానికి? ఆచారి ఆలోచిస్తూ నిద్రపోయాడు.

మర్నాడు శనివారం; బడిలేదు. "ట్యూషన్ పని ఉదయమే ముగించుకొని మధ్యాహ్నం నుంచీ టవున్‌కు పోయి సినీమా చూచి వచ్చినా బాగుండును?" ఆచారి నేరుగా వర్ధనమ్మగారింటికి వెళ్ళాడు. జీతగాడు కనిపించాడు.

"ఏం బాబూ, ఇవ్వాళ ఉదయమే వచ్చారు? అమ్మాయి, అమ్మగారూ బస్తీకెళ్ళారే, ఏవో పనులుండి!...అయ్యో, వాకిట్లోనే నిలబడి పోయారు? లోపలికిరండి. సాయంత్రం మీరు పాఠం చెప్పే వేళకు వచ్చేస్తామన్నారు."

ఆచారికి జీతగాణ్ణి కదిలించి కాసేపు సంభాషణ పెంచుదామనిపించింది. "అన్నట్లు నీపేరైనా అడిగాను గాదు!" కుర్చీలో కూర్చుంటూ అడిగాడు.

"అందరూ పిల్చేపేరుకేం గాని బాబు, మా వర్ధనమ్మతల్లి "సుబ్బులు బాబాయ్" అని కన్నబిడ్డ పిల్చినట్లు పిలుస్తుంది. మా చిట్టితల్లి సుశీలమ్మ "సుబ్బులు తాతా" అని తప్ప పిలవదు"

బైట గాలి విసురుగా ఉండటంచేత లోపలి వాకిలి తెరగుడ్డ ప్రక్కకు ఎగిరింది. గోడ ప్రక్కగా లోపల ఒక వీణ కనిపించిందాచారికి.

"ఇదుగో ఆ వీణ ఎవరు వాయించుతారు సుబ్బయ్యా!"

"సుబ్బయ్యా, ఎందుకులే బాబూ, అందరూ పిల్చేటు 'సుబన్నా' అంటే చాలు" జీతగాడు సిగ్గుపడుతూ అన్నాడు. "ఈ వీణంటారూ......చదువుల సరస్వతి—భగవంతుడు చిన్నచూపు చూచాడుకాని ఎంత తెలివిగలది మా వర్ధనమ్మ తల్లి? మనస్సు చీకాకుతో అన్నీ మర్చిపోయింది. మళ్ళీ మా చిట్టితల్లి సుశీల కోసమని బూజు దులిపి ఈ వీణమీద పాఠం చెబుతూంది"

సుబ్బన్న చెప్పుకు పోతూండగా మధ్యలో ఒక కుఱ్ఱవాడు వచ్చి "ఆచార్లు మేష్టారున్నారా, వారమ్మగారూర్నుంచి వచ్చారు. వార్ని రమ్మంటున్నారు" అని చెప్పాడు.

ఆచారి వెంటనే లేచి ఆ కుఱ్ఱవాడికి తాళం చెవి ఇచ్చి మళ్ళీవచ్చి కూర్చున్నాడు. సుబ్బన్న కూర్చున్న వాడల్లా లేచాడు. "పోయిరండిబాబూ,... నాకూ ఇంట్లో వల్లమాలిన పని."

ఆచారికి సంభాషణ పొడిగించటం కుదరక కుఱ్ఱవాడివంక కొరకొర చూస్తూ లేచాడు.

లోపలకు వెళ్తూన్న సుబ్బన్న మళ్ళా గిరుక్కున వెనక్కు తిరిగి వచ్చి "బాబూ, అడగ మరిచాను తమకు పిల్లలెందరు?" అన్నాడు.

ఆచారి లోపల్లోపల నవ్వుకొంటూ అన్నాడు. "ఏదీ, ఇంకాలేం...ఇప్పుడిప్పుడే..."

"మీలాగే బంగారంలాగుండే బాబు పుడతాడు లెండి...వస్తా" సుబ్బన్న తలుపు గడియ వేసి లోపలికి వెళ్ళాడు.

"సుబ్బన్న బహు గడుసువాడు" అనుకుంటూ ఆచారి వాకిట్లోనే ఉన్న కుఱ్ఱవాణ్ణి చూచి "నే నిక్కడ ఉన్నానని ఎవరు చెప్పార్రా?" అని కసురుకుంటూ అన్నాడు.

"మీరిక్కడ ఉంటారని మీ అమ్మగారితో అచ్యుతరామయ్యా మేష్టారు చెప్పారండీ!"

"వీడొకడు, శనిగ్రహంలా దాపురించాడు. వీడి వ్యవహారమేమిటో తేల్చుకోవాలిసిందే" ఆచారి రుసరుసలాడుతూ వెళ్ళాడింటికి.

తాళంవేసిఉన్న వాకిలి కివతలగా ఆచారి తల్లి వియ్యపురాలు పెట్టిన కొత్త మల్లు దోవతి తలమీదికి లాక్కుంటూ కూర్చున్నది. ముందు మెల్లాలో కూర్చొని అచ్యుతరామయ్య క్లాసులో పాఠం చెప్పే తీరుగానే చేతులు త్రిప్పుతూ ఆమెకు అదీ ఇదీ నూరిపోస్తున్నాడు. ఆచారికి వళ్లు మండిపోయింది. తలుపు తీసి చెయిగా లోపలికిపోయి మంచం వాల్చి పడుకున్నాడు. "వస్తానయ్యా, ఆచారి!" సంభాషణ ముగించి అచ్యుతరామయ్య బైట మెల్లాలోనుంచే చల్లగా కదిలి వెళ్ళాడు.

"అచ్యుతరామయ్యగారు మంచివారు నాయనా, ఎంతమంది వడిగినా నీ వెక్కడున్నదీ తెలియలేదు. శ్రమపడి ఒక్క నిమిషంలో నిన్ను పిలిపించారు......" ఆచారి తల్లి ఏమేమో చెప్పబోయింది.

"ఊఁ...సరేలే! అక్కడి విషయాలేవిటిః" ఆచారి విసుగ్గా అడిగాడు.

"అందరూ చీరా, రైకా బాగుందన్నారు నాయనా, నూసిదలు సలక్షణంగా జరిగాయి...తీరికగా చెపుతాలే, ప్రొద్దు తిరిగిపోతూంది" వంటగదిలోకి పోతూ చెప్పింది.

సాయంత్రం కాగానే మామూలు వేళకు ఆచారి వర్ధనమ్మ గారింటికి వెళ్ళాడు. ఆమె గారింకా రాలేదు. తలుపుకూడా తాళం వేసి ఉన్నది. "బహుశా సుబ్బన్న వారిని తీసుకురావటానికి స్టేషనుకు వెళ్ళాడేమో?"

ఆచారి ఒక గంటసేపు చూచాడు. "ఇక రారేమోలే" అనుకొని వెనక్కు తిరిగాడు. గుఱ్ఱపు బండి కనిపించింది. ముందు బండివాడి ప్రక్కగా సుబ్బన్న కూర్చొని ఉన్నాడు. ఆచార్ని చూచి "రండి బాబు రండి" అంటూ సుబ్బన్న బండిలోనుంచి దిగి తలుపు తాళం తీశాడు.

బండికి ముందు వెనుకల కట్టిన చీరను తొలగించుకుంటూ లోపలనుంచి క్రిందికి దిగి సుశీలనుకూడా రెండు చేతుల్లోకి తీసుకొని దింపింది. సుశీల భుజంమీద చేయి వేసి వర్ధనమ్మ నడిచిపోతూఉంటే వెనుకనుంచి చూచాడు ఆచారి.

"కనకాంబరం పట్టుచీర కట్టుకొని, కొంగు చుట్టు చుట్టుకొని, నిండా ముప్ఫైఏళ్ళైనా ఉండని నిండు జవ్వనంలోఉన్న వర్ధనమ్మ; ఎంత గంభీరమైన విగ్రహం? నడకలో ఎంతటి హుందాతనం!" ఆచారి వెనుకనుంచి నిదానంగా నడుస్తూ సావధానంగా చూచాడు.

"బండిలో కాయలసంచి ఉండాలే!" అంటూ గేటులో అడుగుపెడుతూ వర్ధనమ్మ గిరుక్కున వెనక్కు తిరిగింది.

బండివంకకు చూస్తున్న వర్ధనమ్మ ముఖంలోకి చూచాడు ఆచారి. "ముఖమంతా వాడిపోయిఉన్నది. కళ్ళు ఎఱ్ఱగాఉన్నై. అవమానంతో హృదయం గంటు పడినట్టుగా ఉన్నది." వర్ధనమ్మ ముఖంలోని విషాదరేఖలకు కారణం ఊహించుకోలేకపోయినాడాచారి.

"పాపం, మగదిక్కులేదు" ఆచారి మనస్సు దయతో తడిసిపోయింది.

ఆరోజు సుశీలకు పాఠం చెప్పి లేచేసరికి రాత్రి తొమ్మిదిన్నరయింది. ఇంటికి పోయేసరికి దాదాపు పదికావచ్చింది.

"అబ్బాయీ, నీవుఅక్కడాఇక్కడాతిరిగియింత ప్రొద్దుపోయి ఇంటికి వస్తూంటే నా మనస్సు అనేక విధాలుగా పోతూంది." అంటూ ఆచారి తల్లి సాగ తీయబోయింది.

ఉదయం అచ్యుతరామయ్య చేసిన పాడిప్రభావమేమోనని ఆచారికి తోచింది. భోజనంచేయకుండానే చటుక్కున బైటకు వచ్చాడు. "భోజనం చేయకుండానే వెళ్తావేంనాయనా ?" తల్లి పిలుస్తూనే ఉంది ఆకాశం మబ్బులుపట్టి చీకటి దట్టంగా ఉన్నది.

తిన్నగా అచ్యుతరామయ్య ఇంటికివచ్చి గట్టిగా తలుపుకొట్టాడు. అచ్యుతరామయ్య తలుపు తెఱచి చూచి దిగ్భ్రాంతి చెందాడు. ఆచారి బొమలు ముడిపడి ఉన్నై. కళ్లు చింతనిప్పుల్లా మెరిసిపోతున్నై.

"ఒక్కసారి ఏకాంతంగా మాట్లాడాలని వచ్చాను"

"ఓ! యధేచ్ఛగా," అచ్యుతరామయ్య లాంతరువత్తి పైకిత్రిప్పి కూర్చోమన్నట్లు ఆచారికి మంచం చూపించాడు. ఆచారి కూర్చోకుండానే అటూ ఇటూ చూచాడు.

"అంతా లోపల పడుకొని ఉన్నార్లే! ఎంతటి చిదంబర రహస్యమైనా చెప్పవచ్చు, చెప్పు" అచ్యుతరామయ్య విసురుగా ఒక ముక్తాయింపు ఇచ్చాడు.

"వర్ధనమ్మగారింట్లో ట్యూషన్ చరించి ఏమిటి నీవు చేసే ప్రచారం ?" ఆచారి అచ్యుతరామయ్య కళ్లల్లోకి భయంకరంగా చూస్తూ అన్నాడు.

"బుజాలు తడుముకోవడంగా ఉంది." అచ్యుతరామయ్య చిఱునవ్వునవ్వాడు.

"విషపు నవ్వులూ, డొంకతిరుగుడు మాటలూ వద్దు, సూటిగా చెప్పు."

అచ్యుతరామయ్య గట్టున మంచంమీదినుంచీ లేచి లాంతరు మరికొంచెం పెద్దదిచేసి గట్టిగా అన్నాడు. "ఏమి అభిమానం! విను; జాగ్రత్తగా విను; టూకీగా చెప్పేస్తాను"

ఆ పిల్ల—అంటే—సుశీల తన పిల్లగాదని ఆమె తండ్రి వర్ధనమ్మను విడిచిపెట్టి అయిదేళ్లయింది. ఇప్పుడింకా కోర్టులో వ్యవహారం నడుస్తూంది. ఇప్పుడున్న మేడలోనే వర్ధనమ్మ భర్తకూడా ఉండేవాడు. ఆమె ప్రవర్తన ఏమాత్రం నచ్చకనే ఆయన ఊరు వదలివెళ్ళి మరో పెళ్ళికూడా చేసుకున్నాడు ఆయనికిప్పుడు ఇద్దరు మగపిల్లలు.........వర్ధనమ్మ తరహా తెలియక నీలాగే నేనూ సుశీలకు ట్యూషన్‌కు కుదిరాను. డబ్బు వర్షంగా కురిపించింది. కాని నాపట్ల వర్ధనమ్మ ప్రవర్తన నన్ను నా సంసారాన్నించి దూరం చేస్తున్నట్లనిపించింది...అడ్డం తిరిగితే ఆమె ఎంత సాహసానికైనా తగు. ఆ యింట్లో ఉండే పోతరించిన మృగం- సుబ్బడు పీకలు కోసేరకం..."

"ఇంతా తెలిసి కాస్త వ్యంగ్యంగానైనా రెండు పోట్లు పొడిస్తే తేరుకుంటావుగదా అనుకున్నాను. వర్ధనమ్మ కైపు నీకిప్పటికే బాగా తలకెక్కింది. జాగర్తోయ్ కుఱ్ఱాడా! ఈ ఊళ్ళ నీకు కొత్త; ఏ అందచందాలు లేని నావంటి మొరటు మనిషిమీదకే ఉప్పెనలా వచ్చిపడ్డది వర్ధనమ్మ. మిసమిసలాడే కుఱ్ఱాడివి; మింగే నూరుకుంటుంది...మరోసారి చెబుతున్నా పడుచు పెళ్ళాం మొగుడివి; ఆ యమ్మ ఇక్కడ లేను కూడా లేనుకామాలె...పొద్దుపోయింది ఇంటికిపోయి మాత్రమే పడుకో."

జలపాతపు వేగంతో, ప్రక్క తిప్పకుండా అచ్యుతరామయ్య నాటకంలో పోర్షన్ చదివేసినట్లు చదివి మంచంమీద ధబ్బునకూర్చొని దీపంవత్తి తగ్గించేశాడు.

ఒక్కసారిగా అచ్యుతరామయ్యగదిలో భూమి బీటలువారి తాను పాతాళంలోకి సర్రున జారిపోతున్నట్లనిపించిందాచారికి. "ఇవంతా అభూతకల్పనలౌతుందా!...ఇతగాడు చెప్పిన వాటికన్నిటికీ నిదర్శనాలుకూడా కన్పిస్తున్నాయే! బురదలో దిగబడ్డానా ?"

ఆచారి ముఖంమీద నెత్తురుచుక్క లేదు. గాఢాంధకారం చీల్చుకుంటూ చరచరా ఇంటికి వచ్చాడు.

గాలికి గదిలో చిమ్నీదీపంకాస్తా ఆరిపోయింది. కన్ను పొడుచుకున్నా కనపడని చీకట్లో రేడియం డైల్ అలారం టైమ్‌పీస్ అంకెలూ, ముల్లూ మాత్రం గుడ్లగూబ కన్నుల్లాగ భీతావహంగా కన్పించాయి. ఆచారికి దీపం వెల్గించాలన్న స్పృహ కలుగలేదు. గుర్తుగా కాళ్లతో తడుముకొని మెల్లగా మంచంమీద శరీరం వాల్చాడు.

కన్ను మూతపడలేదు. ఆలోచనా తరంగాలు సుళ్లుతిరిగి అల్లకల్లోలం చేశాయి. ఆలోచించి ఆలోచించి ఒక స్థిరనిర్ణయానికి వచ్చాడు.

# కొడిగట్టిన దీపం

"ఈ ట్యూషన్‌కూ దీనికీ ఒక నమస్కారం పెటితో తెగతెంపులు చేసుకోవలసిందే! ముట్టిన వద్దనోటంటావ్ ? ఆఁ... చెప్పిన పనివాళ్లయినా చెముటోడ్చి దీక్షతో చెప్పలేమా ? దానికీ దీనికీ సరి!"

తెల్లవారింది గబగబా కాలకృత్యాలు తీర్చుకొని కాఫీ పుచ్చుకొని బయలుదేరాడు ఆచారి. లోపల నుంచివచ్చి వక్కపొడి డబ్బా చేతికందిస్తూ అన్నది ఆచారి తల్లి "ఒక్కసారి అత్తగారింటికిపోయి అమ్మాయిని చూచిరాకూడదటరా, కనీ ఆదివారాల్లోకూడా కుటుంబం పనులు మాచుకోకపోతే ఎట్లా ! ఎప్పుడూ ఉండే పైపైవేగా."

ఆచారి తల్లిమాటలు వినిపించుకోకుండానే వెళ్ళిపోయాడు. గదిలో అలారమ్ టైమ్‌పీస్ గణగణా మోగింది.

నేరుగా వర్ధనమ్మగారింటి ముందుగదిలోకి పోయి నిలబడ్డాడు. మేడ పైఅంతస్థునుండీ తెరలు తెరలుగా వీణానాదం వినిపిస్తూంది. వర్ధనమ్మగారి శ్రావ్యమైన కంఠస్వరంలో సుశీలమ్మ పిల్లకోయిల కొనసరింపులు లీనమై తీవలు తీవలుగా కదిలివచ్చి నట్లయింది. వర్ధనమ్మ వీణావాదన నైపుణ్యంగాని, గానకళా విన్యాసంగాని అనుభవించే ఓర్పు లేకపోయిందాచారికి. "సుబ్బన్నా" అని పెద్ద కేక పెట్టాడు.

చిటిపొటిజల్లులు చిలకరించుకొంటూ దొర్లి దొర్లి వచ్చే కొండవాగులా రెండు చేతుల్తో పరికిణీ కుచ్చిళ్లు ప్రక్కలకు లాగి పట్టుకొని దుముక్కుంటూ మేడమెట్లు దిగి, వచ్చింది సుశీల. "సుబ్బులు తాతతో పనుందండీ మేష్టారూ? బజారు వెళ్లాడు కూర్చోండి" వినయ విధేయతలు పెనగొన్న అమాయికపు పసినవ్వులు కుమ్మరిస్తూ పల్కిందీ. సహజంగానే ఏదో ఒక మెత్తందనము, మార్దవము తొణికిసలాడే సుశీల పలుకులు చెవిసోకగానే సుతిమెత్తని మనస్సుగల ఆచారి హృదయంలో వాత్సల్య రసం పొంగి పొరలెత్తింది. అతని ముఖంలోని కెంపు రంగులన్నీ ఒక క్షణంలో మాయమైపోయాయి అప్రయత్నంగానే అతని పెదవి చలించింది "ఏమీ లేదు తల్లీ, ఇవ్వాళ ఆదివారం కదూ, పాఠం చెప్పేసి పోదామని వచ్చాను. అమ్మగారు పాఠం చెపుతున్నట్లున్నారు; పోనీ సాయంత్రం వస్తాలే!"

"ఇంట్లో పిచ్చి పాఠాలకేమిలే, మేష్టరుగారిచేత పాఠం చెప్పించుకో సుశీ!" వర్ధనమ్మ గొంతుపైనుంచీ స్వరితక్రమంలో వినిపించింది.

"నేను చెప్పే చివరిపాఠం ఇదేకదా" అని మనసులో అనుకొని ఎంతో లాలనగా ఆప్యాయంగా ముద్దు ముద్దుగా చాలాసేపు చెప్పి, ట్యూషన్‌కు స్వస్తి చెప్పే సంగతి సుశీలముందు ప్రస్తావించడం మనస్కరించక, "అట్లా వెళ్ళి కాస్సేపు విశ్రాంతి తీసుకో తల్లీ" అని ఆ అమ్మాయి పోనంటున్నా బలవంతంగా అవతలకు పంపించాడు సుశీల వెనక్కి తిరిగి తిరిగి చూస్తూ పోతూంటే ఎందుకో ఆచారి కళ్లు చెమ్మగిల్లాయి.

"సుశీ, ఈ కాఫీ మేష్టరుగారి కిచ్చిపోమ్మా; సుబ్బులు తాతకూడా ఇంట్లో లేడు" లోపలినుంచీ వర్ధనమ్మ మెల్లగా పిలిచింది

"అమ్మాయి అట్లా అవతలకు వెళ్ళింది లెండి ఇప్పుడు కాఫీ ఎందుకు? ఒకసారైంది లెండి! వర్ధనమ్మ తనే తెర తొలిగించుకొని కాఫీ కప్పూ, సాసర్ ఆచారి ముందుంచి అవతలకు పోయింది. ఆచారి, మెల్లగా నడిచిపోతున్న ఆమె వైపుకు నిర్వికారంగా చూస్తూ అన్నాడు. "వర్ధనమ్మగారూ, ఇప్పటికే మీకు చాలా ఋణపడ్డాను. ఏదో ఈ పదిరోజులూ అమ్మాయికి శక్తివంచన లేకుండానే చెప్పాననుకుంటాను..." ఆచారి మాటల్లోని వీడ్కోలు సందేశం తాలూకు ధ్వని గుర్తించి వర్ధనమ్మ మనస్సులో ఎంతో నొచ్చుకున్నది.

"అయ్యో, మీకు ముట్టిన ఋణమెంత? అమ్మాయి కబ్బిన విద్యాబుద్ధులు గురించి బ్రతికినంతకాలం చెప్పుకుంటాము ఏమోగాని—మీరు చెప్పటం ప్రారంభించిన దగ్గర్నుంచీ అమ్మాయిలో ఎంతో మంచి వికాసం కనిపిస్తూంది. ఈ పదిరోజుల్లో మీకే మేమెంతో ఋణపడ్డాము" మళ్ళీ మళ్ళీ తెర తొలిగిస్తూ ఎంతో కృతజ్ఞత తొణికిసలాడేట్లు పలికింది.

"ఎప్పుడో రోజులో ఒక గంట నేను చెప్పటం వల్ల ఏ మబ్బుతుందండీ; సంగీత సాహిత్యాల్లో ప్రావీణ్యంగల పెద్దలు ఇంట్లో ఉండి బిడ్డల్ని తీర్చి దిద్దుకుంటూ ఉంటే అదే చాలు" వర్ధనమ్మ పాదాల మీద దృష్టి సారిస్తూ పల్కాడు ఆచారి.

"పూజ్యులు మా నాన్నగారు జీవించి ఉన్న రోజుల్లో నేర్చుకున్న చిన్ననాటి చదువు, ఆ చదు

వింతకీ... నిజంగా ఉదారులైన మీ వంటి గురువుల సన్నిధిలో ఉండి చదివే చదువు వేఱు" వర్ధనమ్మ తెర కివతలగా వచ్చి పైట చెరగుతో కన్నీళ్ళద్దుకుంటూ పల్కింది.

కోమలములైన వర్ధనమ్మ పాదాల మీదుగా పైకెగబ్రాకి ఆర్ద్రములైన ఆచారి చూపులు, కన్నీట్లుపడి వింత వింత రంగులు వెదజిమ్మే ఆమె రాళ్ళ నెక్లెస్ ప్రాంతాల్లో వాలాయి.

"కాఫీ చల్లారిందేమో, చాలాసేపైంది. భోజనం వేళకూడా కావచ్చింది. మరి మీకు అభ్యంతరం లేకపోతే... ఇక్కడ వంటకూడా అయింది భోజనానంతరం కొంచెం విశ్రాంతి తీసుకొని పోవచ్చు" వర్ధనమ్మ పెదవులమీద దరహాసపు వెన్నెలలు పలుచ పలుచగా విరిశాయి.

ఆమె కంఠంలోని శ్రావ్యత అనుభవించడానికి గాని, ఆమె మాటల్లోని మాధుర్యం చవిచూడటానికి గాని, ఆమె రూపంలోని సౌందర్యం దర్శించడానికి గాని, అతనికి తన ఇంద్రియాలు అశక్తములనిపించాయి ఒక్క క్షణ కాలం ఆమెకంక వెఱ్ఱిచూపు చూచి, గట్టిగా కన్నులు మూసుకొని గటగటా త్రాగాడు చల్లారిన కాఫీ మొత్తం.

"ఇంటికి వెళ్ళాల్లెండి" అంటూ లేచి చకచకా బైటకు వచ్చాడు.

"రాత్రికూడా భోజనం చేయలేదుగదా" అని ఆచారి తల్లి హడావుడిగా వడ్డనచేసి పిలిచింది కొడుకుని. గబగబా నాలుగు మెతుకులు గతికి పోయి కుక్కిమంచంలో వాలాడు.

"ఇవ్వాళ ఆదివారం కాదునాయనా, సాయంత్రమైనా ఇంట్లోకి నచ్చాలు తెచ్చి పడేయ్" వెల్లకిలా పండుకొని పై పూరికప్పు పరీక్షిస్తున్న ఆచారితో చెప్పింది తల్లి.

"ఏమిటో, వెచ్చాలదాకా వెళ్ళింది! మధ్యాహ్నం కాఫీకి గతుంది? వర్ధనమ్మగారి పుణ్యమా అని ఉదయం మ్రొక్కు తీరింది."

వర్ధనమ్మ స్ఫురణకు వచ్చేసరికి ఆచారికి సర్వేంద్రియాలకూ సంతర్పణ జరిగినట్లు తోచింది. ఎంత లోతైన గుండె! మాటలో ఎంత మార్దవం!... "మీ వంటి గురువుల సన్నిధిలో ఉండి చదివే చదువు వేరు" ఎంత ఆకర్షణ!

ఆచారి తన శరీరంవంక చూచుకున్నాడు. చొక్కా చిరుగులోనుంచి ఎఱ్ఱని తన దేహం కనిపించింది. అతనికి అభిమానం ముంచుకొచ్చింది దరదరా లేచిపెట్టె తెఱచి పెళ్ళినాటి పట్టుత్తరీయం తీసి చొక్కామీద కప్పుకున్నాడు. "అట్లా బజారుకైనా వెళ్దాం క్రొత్తహోటల్లో పద్దుపెట్టి కాఫీ పుచ్చుకోవచ్చు... ధోవతి, గూడకట్టువిప్పి గోచిపెటె కట్టుకుంటే ఒంటి పొరమీది చిఱుగులన్నీ బైటపడతాయి; వద్దులెస్తూ".

తెలివిగా కాఫీ పుచ్చుకొని ప్రొద్దుపోయిందాకా కాలం వెళ్ళబుచ్చి రాత్రికి ఇంటికి వచ్చాడు. నెయ్యికూడా లేకుండా పొడి పొడి పచ్చడి మెతుకులు గొంతు దిగలేదాచారికి. పోయి కుక్కిమంచం మీద వాలాడు

"చదవడానికి ఏదైనా పుస్తకమున్నా బాగుండును? వెధవ సోషల్ స్టడీస్! బండలెక్కలు! సమసంబంధ సామ్యం, విలోమ సంబంధ సామ్యం!" విసిరి అవతల పారేశాడు క్లాసు పుస్తకాలు.

ఒక రెక్క బంగలూడిన చెక్కబీరువా తెరిచి చూచాడు. పంచాయతీబోర్డు లైబ్రరీలో ఎప్పుడో తెచ్చిన పుస్తకాలు రెండు కన్పించాయి. ఆచారి కన్నులు మెరిశాయి.

"బ్రాహ్మణీకం"... "కర్మమిట్లా కాలింది"

చిమ్నీవత్తి పైకెత్తి పుస్తకంలో దిగబడ్డాడు.

"సంప్రదాయాలనీ, ఆచారాలనీ ఆదిలో మొంటికేసిందిగానీ పిచ్చిపిల శరీరధర్మం అణచుకోగలిగిందీ? ఉచ్ఛ్వాస నిశ్శ్వాసాలతో ఒంపులు ఒంపులుగా లేచిపడే ఆమెవక్షం, దృఢమైన, విశాలమైన అతని ఉరస్సు క్రిందబడి అణిగి మణిగి వెచ్చనైనాన్ని పొదుగుకోలా?" ఆచారి దేహం వేడెక్కిపోయింది, బ్రాహ్మణీకం పుస్తకం తీసి అవతల పెట్టాడు

"పిచ్చిరెడ్డి రంగమ్మ! కృష్ణునిమీది మోహభక్తితో గోపికలా గంగ వెఱ్ఱులెత్తిపోయింది, వేషం ధరించిన జనార్దనరావు దగ్గరకు; ఆ మహానటుడు నటనాకు నిషా దిగకముందే భక్తితో పరవశించిన రంగమ్మను వెచ్చని కౌగిటిలోకి జీర్ణించుకున్నాడు."

# కొడిగట్టిన దీపం

"కర్మమిట్లా కాలింది"...పుస్తకం అవతల పడేశాడు.

ఒళ్ళంతా కంపరం ఎత్తింది ఆచారికి. మెడల క్రిందికివాలిన మాసికలచొక్కా కాలర్ పైకెత్తి నిలబెట్టాడు.

"మీకభ్యంతరం లేకపోతే...ఇక్కడే విశ్రాంతి తీసుకోవచ్చు' ఒయ్యారాలు ఒలకబోస్తూ వర్ధనమ్మ సుందరస్వరూపం ప్రత్యక్షమై అతని మానసిక క్షోభను ఇనుమడింపజేసింది. పెళ్ళినాటి పట్టుధోవతికూడా తీసి పింజలుపోసి అందంగా కట్టుకొన్నాడు. ఉన్న చొక్కాకు గుండీలు పెట్టుకొని పట్టుఉత్తరీయపు చెరగులు సవరించుకొన్నాడు. వక్కపొడిడబ్బా అడుగు దులిపి ఇంత చప్పరిస్తూ వాకిలితలుపు బైట గొళ్లెంపెట్టి బైలుదేరాడు.

ఆచారి తల్లి దొడ్లో ఒళ్ళుతెలియకుండా నిద్రపోతోంది.

పంచాయతీవారి బజారు లాంతరు దీపాలలో నూనె పదకొండున్నరకే అయిపోతుంది. మనిషి మనిషి కనిపించని గాఢాంధకారం. ఆచారి నడుస్తున్నాడన్న జ్ఞానముకూడా లేకుండా పోతున్నాడు. ఒకటి రెండు కుక్కలు అతనికి దగ్గరగావచ్చి మోరలెత్తి గుర్ గుర్ మని అరుస్తూ మెల్లగా రాగం సాగదీస్తూ అవతలకి పోయాయి. బజారు ప్రక్కన గుబురుగా పెరిగిన గన్నేరుకొమ్మల చాటుగా గలగల గాజులచప్పుడైంది, అమిత వేగంతో ఊర్పులు వినిపించాయి. మెత్తని కంపెర మేదో తన బుజం రాసుకుపోయినట్లయింది ఆచారికి. అతని తల దిమ్మెక్కిపోయింది.

దరదర నడిచి వర్ధనమ్మ రెండంతస్తుల మేడబైట గేటుదగ్గర నిల్చాడు. గేటు ఓరగా వేసి ఉన్నది. మెల్లగా తెరుచుకొని లోపలికి వెళ్లాడు. మేడమీదికి పోయే మెట్ల తలుపుకూడా ఓరగానే వేసిఉన్నై. మసకలాడబోయే జెట్టిపోతులా బుసలుకొడుతూ మోరవంచి గబగబా మెట్లెక్కాడు.

లాంతరువత్తి పెద్దదిగా వెలుగుతోంది దాని ముందు కుర్చీమీద సగంతెరచిన గ్రంథాలు పరచి ఉన్నాయి. గ్రంథాల్లోని లిపి సంస్కృతమో, హిందీయో గమనించగలస్థితిలో లేడాచారి. పరిసరంలో పురుషులెవ్వరూ లేరన్న దృష్టితో యధేచ్ఛగా పడుకుని ఉన్న వర్ధనమ్మ శరీరం ఆపాదమస్తకం చూచాడు.

దీపం క్రీనీడలో తలుపు రెక్కచాటుగా నిలబడ్డాడు. అతనిలో నిద్రాణంగా పడిఉన్న పశుత్వం మోరవంచి కొమ్ములు పైకెత్తి ఖణిల్లున అంకె పెట్టింది. దీపపుకాంతుల్లో మహోజ్వలంగా పెరిగిపోతున్న వర్ధనమ్మ దేహంలోని ఒయ్యారపువంపులు దర్ప-ఆమె చాటుగా గువ్వపిల్లలా ఒదుక్కుపడుకున్న సుశీల కాని, మరే యితర పదార్థంగాని అతనిదృష్టికి కనిపించలేదు.

తలుపుచాటునుంచి గభాలున అడుగు ముందుకు పెట్టాడు పొడవైన అతని నీడ మెట్లమీదగా క్రిందికి ప్రాకింది. అనుకోకుండా హఠాత్తుగా తన చుట్టూ దృఢమైన బాహువులు రెండు పెనవేసుకుని, తన్ను పైకెత్తినట్లనిపించింది. స్పృహతెచ్చుకొని తలవెనక్కి త్రిప్పుకొని చూచేసరికి క్రిందిగదిలో తన ప్రక్కన సుబ్బన్న నిలబడి తన ముఖంమీద లాంతరుపెట్టి తేరపార చూస్తున్నాడు.

"అఁ...మీరనుకోలేదు బాబూ నేను ఇంత అర్ధరాత్రివేళ వచ్చారేం?"

"నిజంగా సుబ్బన్న పీకలుకోసేరకమా?"... అయినా ఆచారికి అతనివాలకం చూస్తుంటే కొంచెం ధైర్యం వచ్చింది. ఒక ఆలోచనకూడా తట్టింది. లేని నవ్వు తెచ్చుకున్నాడు. గొంతు సర్దుకొని ఎక్కడో నూతిలోఉండి చెప్పినట్లు చెప్పాడు.

"కొంపదీసి దొంగ ననుకోలేదుగదా!... విషయం చెప్తా విను సుబ్బన్నా, మా అత్తగారింటి నుంచీ హఠాత్తుగా వచ్చింది టెలిగ్రాం. మా యావిడకు చాలా ప్రమాదంగా ఉంది. నేనిప్పుడే వెళ్ళాలి, వాకిపూరు కొత్త. ఈ చీకట్లో స్టేషన్ దాకా నిన్ను తోడుచేసుకొని వెళ్దామని వచ్చాను. నీవు క్రింద కనపడకపోతే అట్లా పైకి వచ్చాను; అంతే!"

"అట్లాగా.... ఒక్కనిమిషం ఆగండి. వచ్చేస్తున్నా!" అంటూ గబగబా మేడమెట్లెక్కిపోయి పదినిమిషాల్లో క్రిందికి వచ్చాడు "గేటుతలుపు వేసుకు పోమ్మా" అంటూ లాంతరు పట్టుకొని సుబ్బన్న ఆచారిప్రక్కన నడుస్తూ బైటికి వచ్చాడు

"ఇంటికి పోవాలా బాబూ."

"అక్కరలేదు, ప్రయాణమయే వచ్చాను" ఆచారి ఉత్తరీయం సర్దుకుంటూ చెప్పాడు.

ముందు సుబ్బన్న, వెనుక ఆచారి మాట్లాడానికి ఆచారికి విషయమేమీ దొరకలేదు. సుబ్బన్నే అందుకున్నాడు. "నేను వెయ్యికళ్లతో చూస్తూ ఉంటాను. నిజంగా ఇవ్వాళ మీరుగాక మరెవరైనా ఐతేనా...పంబరేగగొట్టిఉందును."

కదులుతున్న నల్లరాతి విగ్రహంలా ఉన్న సుబ్బన్న సమున్నతదేహం లాంతరు వెలుతుర్లో చూచి ఆచారి తన జబ్బలు సవరించుకున్నాడు. "లేచినవేళ మంచిది."

ఊరి పొలిమేర దాటివచ్చారు. చిమ్మచీకటి జుట్టు విరియబోసుకొని ఉన్నది. ఇలకోళ్ల సంగీతంలో మధ్యమధ్య నక్కబావ కూనిరాగం సన్నగా సాగిసాగి

వినిపించింది ఆచారి సుబ్బన్నకు దగ్గరగా జరిగి అడిగాడు.

సుబ్బన్న మళ్లీ అందుకున్నాడు, "అసలు నా అనుమానం ఏటు....వచ్చినవాడు అయ్యగారి రామయ్యగారేమో అనుకున్నా. నా పామిరంగా...రక్తంతాగి ఉండును."

ఆచారి దిగ్భ్రాంతుడైనాడు "అతనెందుకు వస్తాడు?"

"వాడా. దిక్కుమాలిన గాడిదకొడుకు! చిట్టితల్లికి పెళ్ళిచేటు కని కుదిరిస్తే వర్ధనమ్మతల్లికే ఎసరు పెట్టాడు. మా తల్లి సీతామహాలక్ష్మి. ఆ అమ్మకంత అటువంటి పాపపుమాపు మాస్త్రీ పురుషులుపడి చస్తారు. నిజంగా ఆ రోజు రాత్రి సమయానికి నేను లేకపోతే-అసలే చెడివున్న మా వర్ధనమ్మ బ్రతుకు బజారుపాలై పోయేది.

ఆ చేసుకున్న మొగుడు—కాపురం చేసినంత కాలం వేధించుకు తిన్నాడు. వాడికి అస్తమానం అనుమానమే! ఆ పీడ విరగడై ఇంకసుఖంగా చిట్టి తల్లిని చూచుకొని బ్రతుకుతూందిగదా అనుకుంటే, పోయినోడు పోక కోర్టుకీడ్చి నా తల్లి మానమర్యాదలు అల్లరిపాలు చేశాడు. నిజంగా పుట్టింటి తరఫున దేవుడులాంటి ఆ అన్నగారుకూడా లేకపోతే ఈ లోకంలో నా తల్లికి దిక్కెవరు?"

సుబ్బన్న కళ్ళవెంట బొటా బొటా నీళ్లు కారాయి.

"అన్నగారంటే ఎవరు సుబ్బన్నా!" కాలి క్రిందపడ్డ కప్పను దొక్కి ఉలిక్కిపడుతూ అడిగాడు ఆచారి.

"మీ గుండెగానే వచ్చాడుగా ఒకసారి, అం, ఏమిటో, పిచ్చిబాబుని, మీ పనేమిటో మీరు తప్ప తలెత్తిచూడటం చేతగాదు...కోటూ, బూటూ వేసుకొని రాలా, ప్లీడరు. ఆయన లేకపోతే వర్ధనమ్మకీయా స్త్రీ అయినా మిగిలేదా?"

బొమలు ముడివేసి ఆచారి బలవంతంగా క్రిందపెదవి కొరుక్కున్నాడు.

స్టేషన్ వచ్చేసింది. తెల్లవారుజామున నాలుగైంది. బండి ఒకగంట లేటట!

"ఇంటి దగ్గర వర్ధనమ్మ తల్లికి తోడెవ్వరూ లేరు, నే వస్తా బాబూ, పోగానే అమ్మాయిగారి సంగతి ఉత్తరం వ్రాయండి" సుబ్బన్న బయలుదేరబోయాడు.

సుబ్బన్నా, ఈ టెలిగ్రాం సంగతి మా అమ్మకు తెలియదు. ఈ గొడవంతా ఆమెకు చెప్పకు. ఆమెకు మతిపోతుంది" అంటూ జేబులోనుంచి కలం కాగితం తీసి సుబ్బన్న చేతిలాంతరు వెలుగులో సెలవుచీటీ గిలికి "బడికి చేర్చ"మని అతనికిచ్చాడు ఆచారి.

సెలవుచీటీ బొడ్లో పెట్టుకుందామని సుబ్బన్న ధోవతిముడత విప్పాడు. బొడ్లోనుంచి వంద రూపాయల కాగితం ఒకటి క్రిందపడి లాంతరు వెలుగుల్లో మెరిసిపోయింది. సుబ్బన్న దానిని గభాలున చేతితో తీసుకొన్నాడు.

"మాచారా బాబూ! ఎంత పొరపాటైందో?... ఈ మధ్య నాకు మరీ మతిమరుపెక్కువైంది. ఇందాక వచ్చేటప్పుడు మా వర్ధనమ్మ తల్లిని లేపి "పంతులుగారి ఆవిడకు ఇట్లా ప్రమాదమట" అని చెప్పేసరికి, గబుక్కున లేచి ఇనప్పెట్టె తీసి "పాపం ఎంత ఇబ్బంది వచ్చిందో?" అంటూ ఈ నోటు మీ కిమ్మని ఇచ్చింది బాబూ" సుబ్బన్న ఆ నోటు ఆచారి జేబులో పెట్టాడు.

భయంతోనూ, అవమానంతోనూ క్రుంగిపోతున్న ఆచారి కళ్ళల్లో గిఱ్ఱున నీళ్లు తిరిగాయి. అతడు ఏమీ మాట్లాడలేకపోయాడు.

"పిచ్చి బాబయ్యా! గుండె నిబ్బరించుకో కష్టాల్లోనే కష్టాలొస్తయ్, అమ్మగారు సుఖంగా ప్రసవిస్తుందిలే; వస్తా" సుబ్బన్న ఆచార్ని బుజ్జగిస్తూ చెప్పి లాంతరు తీసుకొని బయలుదేరాడు.

నీళ్ళుక్రమ్మిన కంటి రెప్పలెత్తి అట్లా ఆచారి చూచేసరికి సుబ్బన్న పదిగజాల దూరం వెళ్లిపోయాడు.

నిర్భయంగా, నిశ్చలంగా గొల్లసుద్దులు పాడుకుంటూ ఊరివైపుగా పోతున్న సుబ్బన్న చేతిలోని లాంతరు కాంతులు చీకటి పాయల్ని విరియబట్టుతూ వింత వింత రంగుల నీలినీడల్ని ప్రసరింపజేస్తూ బ్రతుకు బాటల్ని వ్యక్తంచేశాయి.

కొడిగాలిన దీపంలాగు ఆచారి గుండె మెల్లగా తేరుకుంది. అతని కళ్లలో పుట్టింటి దగర పురుడు పోసుకోవటానికి పోయిన భార్య అమాయికమైన రూపం కలగా మెరిసింది.

కుప్పిళ్లు మూసుకొని కేరింతలు కొడుతున్న బంగారు పసిపాపను పొత్తిళ్లలో పెట్టుకుని "చూడండి, అంతా మీపోలికే" అంటూ పచ్చిబాలెంతరాలు తనకు దగ్గరగా వచ్చినట్లయింది. ఆచారి మనస్సూరికే ద్రవించి పోయింది.

ఇంతలోకే హఠాత్తుగా పిడుగుపడ్డట్టు పెద్ద అరుపు వినిపించింది. స్టేషన్లో రైలుబండి కదిలిపోతూంది. టిక్కెట్టు కూడా లేకుండా గబగబా పోయి ఆచారి రైలు తలుపుకమ్మి పట్టుకొని వ్రేలబడ్డాడు.

# కాళిదాసు: సానుమతి

శ్రీ చేబ్రోలు సుబ్రహ్మణ్యశర్మ

సాను శబ్దమునకు శ్రోతయని యర్థము—అశ్రోత గలది సానుమతి. నాయికా నాయకుల హృదయైక్యానుసంధానమునకు శ్రోత మాపించగలది శ్రోత వేయుగలది అని తాత్పర్యార్థము.

సహపదార్థమున్నూ, "అను"అనెడి యుపసర్గార్థమున్నూ, గలది మతి గలది "సానుమతి" అని మరియొక విగ్రహవాక్యము. కూడా అనుసరించు బుద్ధి మనస్సు కర్మకలది సానుమతి యని యర్థము ప్రకృతం సానుమతి మేనక, శకుంతల, దుష్యంతుడను అనువారి బుద్ధిమనః కర్మలతో అనుసరించి తన బుద్ధిమనః కర్మల నడిపించు వ్యాపారము కలదని తాత్పర్యము.

"యం కంచిత్ ప్రియం వా యత్ కించిత్ ప్రియం వా యాం కాంచిత్ ప్రియాం వా అనుసృత్య యా మతిః వర్తతే సా, అనుమతిః అనుమత్యా సహ వర్తత ఇతి సానుమతీ" అనే విగ్రహం ఒకటి మనం లాగాలి. ఏదో ఒక కార్యం సాధించాలి అంటే మతి యొక్క సహాయం కావాలి. ఎవరినో ఒక ప్రియుని గాని, ఏదో ఒక ప్రియమును గాని, ఏదో ఒక ప్రియురాలిని గాని అనుసరించే మతికి అనుమతి అనిన్నీ అట్టి అనుమతితో కూడ ప్రవర్తించే ఆమె "సానుమతి" అనిన్నీ పైవిగ్రహ వాక్యానికర్థం తాత్పర్యం అయియుంటుంది.

సానుమతి అనే పదానికి ఏరీతిగా వ్యుత్పత్త్యర్థం చెప్పుకొన్నా పర్యవసితార్థము, పరిణతార్థము, ఫలితార్థము ఒకటే.

ఈ శాకుంతలంలో సానుమతి తన ప్రియురాలైన మేనకతో అనుసరించిన "మతి"తో ప్రవర్తించేదనిన్నీ, సర్వదృశ్య కావ్యాల్లోనూగల నాయికలకన్నా అత్యంతాధిక ప్రియురాలైన శకుంతల "మతితో" అనుసరించే "మతితో" ప్రవర్తించేదనిన్నీ, శకుంతలా దుష్యంతుల ప్రియ సాంగత్యానువ కనుకూలమైన మార్గము ననుసరించే "మతితో" ప్రవర్తించేదనిన్నీ, అర్థం కథాభాగమునుబట్టి మనం నిర్ణయింపవచ్చు.

ఈ మతి ఇక్కడ రెండు గతులతో ఉంది. స్వమతిగతి అన్యమతి గతి లేక మిశ్రమతి గతి అని అనవచ్చు. ఈ గతుల రీతులను వివరించుకొని అంగాంగి ఔచిత్యాన్ని నిర్ణయించాలి. అప్పుడా పాత్రలలోని విలువ మనకు స్పష్టం కాగలదు. లోకమున సాధారణముగా ఒక రాజ్యానికి మరొక రాజ్యానికి గల అంతర్వివాదాదులను పరస్పరం కాని లేక అందేదని ఒక రాజ్యం కాని రాయబారములద్వారా పరిష్కరించుకొనుచుండుట ఆచారము. శకుంతలా దుష్యంతుల ప్రేమ రాజ్యాలకు రాయబారాలు నడిపించింది సానుమతి సామాజికహృదయ కుహరముల ద్వారా.

రాజ సభలోనే తిరస్కృతురాలైన శకుంతలను మేనకాజ్ఞానుసారము ఈ సానుమతి బైలుదేరి వచ్చి అప్సర స్తీర్థమునుండి మారీచాశ్రమానికి తీసికొచ్చి విడిచి మరలి దుష్యంతుని చిత్తవృత్తిని పరిశోధించటానికి దుష్యంతుని ఉద్యానవనంలో ప్రవేశిస్తుంది. అంతలో ఇద్దరు వనపాలికలు, కంచుకి, సంభాషించుకొను వసంతోత్సవ ప్రతిషిద్ధ హేతు సంతతి రంగములో ప్రవేశిస్తున్న మేనకాసఖురాలగు సానుమతికి సంపూర్ణ రససాధన సంపత్తి బాగుగా అతికి వుంది.

లోకంలో ఏకమతులు అనాదు లుంటారు. వారిని అనుకరించే అనుకరణాత్మకమతులు తమ మతిని పరమతితోను, పరమతులను తమ మతితోను అతికింప చేసికొనే శక్తికల వారౌతారు. ఈ లక్షణం కలవారు రాజనీతుల నిర్వహించుటలో "అరితేరిన రాయబారులు" అనే పదంతో వ్యవహరింపబడతారు. భారతంలో సంజయ రాయబారము, శ్రీకృష్ణ రాయబారము, ఈ తెగకు చెందినవే. భాగవతంలో కల రుక్మిణీ కథలోని ప్రేమ సామ్రాజ్యానికి రాయబారి అగ్నిద్యోతనుడు, ఈ

తెగకు చెందిన వారే. నాటకములలోకల విదూషకులు, చెలికత్తెలు, ప్రేమ రాజ్యాలకు చెందిన రాయబారులే.

శకుంతలా దుష్యంత ప్రణయసామ్రాజ్యానికి రాయబారిగా సానుమతి కాళిదాసుచే నియమితురాలైనది. ఈమె ప్రవేశించిన రంగము ప్రణయ జీవస్థానము. సర్వ హృదయరంజకమగు విప్రలంభ శృంగార రసవాహిని సర్వతోముఖముగ ప్రవహించే సాగర సంగమక్షేత్రమున సానుమతి తన పని ప్రారంభించింది. ఇది రసస్థాపనకు, రస విజృంభణకు, "రసో వై సః" అనుపరమానందమయ బ్రహ్మ ప్రకాశకత్వమునకు జీవగఱ్ఱ. అభిజ్ఞానంలభ్యమైంది. ఇక్కడితో శాకుంతలం ముగించవచ్చు. కాని ఆనంద నిష్యంది రూపకమునకు పరిణతత్వం ఇంతటితో సిద్ధించలేదు. ఆ పరిణతత్వం సిద్ధించటానికి విప్రలంభమున వియోగ భారాతిశయము వర్ణితం కావాలి. అది ఈ సానుమతి పాత్ర ధారణంవల్లనే సిద్ధించాలని కవి తన ప్రతిభా మహాత్వంతో సహస్ర ముఖదృష్టి నిగిడించి రవి గానని రమ్యవస్తు ప్రదేశ సంసృష్టిని తాను తిలకించి మనకు కాన్పింప చేస్తున్నాడు. రసాలలో రాజైన శృంగారాన్ని ఈ నాటక పాత్రలలో ఉత్తమోత్తమ పాత్రయైన సానుమతి ద్వారా పెంపొందించే పదవకాశాన్ని ఉపయోగించుకొన్నాడు.

ఆమె ప్రవేశిస్తూ అన్నది గదా "అప్సర స్తీర్థంలో నేను చేయవలసిన పని పూర్తి అయింది. ఇక రాజర్షి వృత్తాంతాన్ని ప్రత్యక్షంగా తెలిసికొంటాను. మేనకాసంబంధంవల్ల శకుంతల నాకు శరీర భూత అయ్యింది. మేనక నన్ను తన కూతురు నిమిత్తం ఆజ్ఞాపించింది" అని. ఈమాటల్లో సానుమతి మేనకా మతిని అనుసరించి వచుటలో కల జాగరూకత స్పష్టంగా సుసంపన్నంగా వుంది. తన మతిని మేనకా మతితో లగింప చేసేందుకు అప్సర స్తీర్థంలో తన విధిని నిర్వర్తించుకొనుట ఎంతయో తెలివిందనమును వ్యక్తీకరిస్తూంది. అన్ని దిక్కులూ చూసింది. అంతలో రాజకులం కనిపించింది. ఋతూత్సవం బుద్ధికి ఆనింది. "అయితే రాజకులం నిరుత్సవంగా ఎందు కుందబ్బా!" అనిపించి తనకే ఆశ్చర్యం వేసింది. రసాధి దేవతతో పాఠకుల్ని ఈ ఆశ్చర్యం ఎంతదూరం తీసుకు పోతుందో చూడండి. ఆ ప్రశ్నకి సమాధానం ముందుకు పోతేనే కాని పాఠకులతో పాటు సానుమతమ్మకే తెలిసేదిగా లేదు, అనిపిస్తూంది. అందుకే సమయ స్ఫూర్తితో తన సామర్థ్య విశేషాన్ని వెలువరిస్తూ ఇతరులకు కనపడ కుండా "సర్వం తెలుసుకొనే శక్తి నాకుంది" అనుకొంది. ఈ అనుకోవడం తనమతిని ఉపయుక్తం చేసికోవడం అన్నమాట. మళ్లీ నా సఖురాలు మేనకయొక్క ఆదరాన్ని గౌరవించాలి కదా! అంది. అంటూ మేనక మతితో తనమతిని అనుసరింప చేస్తూంది, కచ్చ బిగించింది, కార్య రంగలోకి ఉరకటానికి. అంతలో ఉద్యాన వన పాలిక లిద్దరూ కంటపడ్డారు. "తిరస్కరిణీ విద్యతో వారివెంట పడుతున్నా" అంటూ వెంట పడింది. ఉద్యాన వనపాలికలు చేసే కామపూజను తనివి తీరా చూసింది. హఠాత్తుగా మహాకోపంతో ఉగ్రుడై వస్తూన్న కంచుకిని చూసింది. ఆ కంచుకిని చూసి భయపడుతూన్న ఉద్యాన వనపాలికల్ని చూసింది ఆ కంచుకి కోపంతో పలికే పలుకులు సావధానంగా విన్నది. సారం గ్రహించింది. ఏమంటున్నాడా కంచుకి? "వినలేదా మీరు దేవశాసనం" అంటున్నాడు. ఆ దేవ శాసనాన్ని ఆ వాసన్తిక తరువులూ, ఆ వృక్షాల మీది పక్షులూ శిరసా వహిస్తున్నాయట.

మామిడి మొగ్గ, గోరంట, పుప్పొడిని తాల్పక వికసించక దేవ శాసనం శిరసా వహిస్తున్నాయట. శిశిర ఋతువు వెళ్ళిపోయినా కోయిలల పంచమస్వరాలు ప్రేమతంతువుల్ని మీటుతూ ప్రసవింపజాలక తొట్రుపడుతున్నాయట. సగం దాకా ఎక్కుపెట్టిన పూవిల్లులోని బాణాన్ని మారుడు కూడా ఉపసంహరించు కొంటున్నాడట. ఈ మాటలన్నీ విని వీని సారం పిండి జీర్ణింపజేసికొని తన శకుంతలమ్మ భర్త నిజంగానే మహాప్రభావం కలవాడు సుమా! అని ఒక్కమా రనుకొన్నది. అందుకు సందేహమే లేదంది. ఇక్కడ సానుమతి ఈరీతిగా తన మతిని కంచుకి మతితో లగింపచేసి రాజర్షి మహాప్రభావం కలవాడని నిర్ణయింపగల తనమతితో చెయ్యి కలుపుకొంటుంది.

ఉద్యానవనపాలిక మొదటామె ఆ కంచుకితో సవినయంగా తమ కామపూజా విదానాన్ని విదానంగా మనవి చేసుకొంటుంది. ఏమనంటే? "వినండి! మిత్రావసువనే రాష్ట్రాధిపతి రాణీగారి దగ్గర ఒక ఉద్యోగంలో ఉండి వుంటూన్న మమ్మల్ని ఈమధ్య కొన్ని రోజుల క్రితమే ఈ పుద్యాన వనోద్యోగంలోకి

మార్పించినాడు. అప్పటినుంచీ ఈ ప్రమదవనంలో పడ్డాం. హఠాత్తుగా ఋతూత్సవ నిషేధం వచ్చినట్లు మేమిదివరలో వినలేదు. క్షమించండి" అంటూంది. "క్షమించాను" అన్నాడు కంచుకి. "ఈ పైన ఆ పని మానండి" అన్నాడు. ఆ వనపాలిక లిద్దరూ "మా కో కోరిక వుంది" అన్నారు ఆ కంచుకితో. "మాతో చెప్పటానికి, మేము వినడానికి, ఇబ్బంది లేకపోతే ఆ వసంతోత్సవం మా రాజు ఎందుకు అపు చేశాడో చెప్పవయ్యా!" అన్నారు. ఇంతలోనే సానుమతమ్మ అందుకొని "ఉత్సవప్రియులు కదా మానవులు" అని అంటూ "ఏదో ఒక గొప్ప కారణం లేకపోతే ఈ వుత్సవం ఆగి వుండదు" అని దుష్యంతుని మతి కృతిని తన మతితో ఊహించడం ప్రారంభించింది. ఆ వనపాలికలు వేసిన ప్రశ్నతో తన ప్రశ్ననూ అతికించింది సానుమతి. సమాధానం వినడంలో ఆ వనపాలికలతో సరి తూగింది.

ఇంతట్లో కంచుకి "ఇది అందరకూ తెలిసిన విషయమే. మీ కెందుకు చెప్పనూ? తప్పక చెపుతాను. చూశారూ! శకుంతలమ్మ సభలో తిరస్కృతురాలైందన్న అపవాదు ఒకటి బైలుదేరింది కదా!" అన్నాడు. ఆ రాష్ట్రీయునివల్ల అంగుళీయకం దొరికిన వృత్తాంతం దాకా విన్నామన్నారు వనపాలికలు. అయితే నేను మీకు చెప్పవలసింది కొంచమే అన్నాడు కంచుకి. ఇంకా అంటున్నాడు ఏమనంటే వినండి! "ఆ యంగుళీయకాన్ని చూసింది మొదలు రాజుగారు ఆ పూజ్యురాలిని శకుంతలమ్మని రహస్యంగా కలిచి అజ్ఞానంవల్ల విడిచితినని పశ్చాత్తాపాన్ని పొందారు. ప్రసన్నమైన చంద్రపాదాదికాల్ని ద్వేషిస్తున్నారు. మంత్రులతో ఇదివరలో వుండేటట్టు వుండడంలేదు. పడక గదిలో మంచం చుట్టూ ఇటూ అటూ తిరుగుతూ నిద్ర లేకుండగానే రాత్రుళ్లు గడుపుతున్నారు. అంతఃపుర స్త్రీలకు సమాధానం దాక్షిణ్యంతో తగినంత మట్టుకే యిస్తున్నారు. ఒకరిని పిలవడానికి బదులు మరొకర్ని పిలుస్తూ తడబడుతూ సిగ్గుచే మొగం చిన్నబుచ్చుకొంటున్నారు" అని ఆ వనపాలికలకు కంచుకి చెప్పిన వృత్తాంతాన్ని విన్న సానుమతమ్మ ఇట్టే తేలికగా "నాకెంతో ప్రియంగా వుంది" అంది. ఇట్లనడంలో సానుమతి మతి ఎంత మంది మతితో అనుమతిస్తూ వుందో ఊహించుకొనే వారి బుద్ధివైశాల్యాన్ని బట్టి వుంటుంది కదా! ఈసాను మతి మతి పాఠకుల మతితో అభేదాధ్యవసాయం చెందటమే కవికుల తిలకునికి చరితార్థత.

ప్రమదవన పాలికలు దిగబడుతారు. దుష్యంత మహారాజుగారు ప్రవేశిస్తున్నారు. మళ్లీ కంచుకి కవిత్వం ప్రారంభించాడు. "అన్ని అవస్థలయందు అందమైన వాళ్లకు రమణీయత ఎంతో హృదయంగమంగా వుంటుంది. ఈరీతిగా రాజు విరహోత్సుకుడై వున్నా ప్రియదర్శనుడుగానే వున్నాడు. విశేషాలంకారాల్ని విసర్జించినవాడై రాజు ఎడమచేతి బంగారు మురుగును మాటి మాటికి పైపైకి తీసికొంటూ వేడి నిట్టూర్పులచే వాడిన అధరోష్ఠముతో విరాజిల్లుచున్నాడు. రాజు శకుంతలకై చింతిస్తూ వుండటంవల్ల క్షీణించినా మిక్కిలి వాడిపోయిన కందోయిలో తన తేజఃపుంజాన్ని వహించి సంస్కరింపబడ్డ మహామణివలె ప్రకాశిస్తున్నాడు". ఈ కవిత్వంలో కంచుకి మతితో కవిమతి కవిమతితో రాజు రాజుమతితో శకుంతల, శకుంతల మతితో సానుమతి, సానుమతి మతితో పాఠకునిమతి అనుమతినిస్తూ అయ్యో! పాపం! అనిపించే ఆర్ద్రత వల్లి విగుస్తూంది. ఇట్టి అవస్థలో సానుమతి రాజుని తేరిపార చూస్తూ హృదయగ్రంథిని ఊపే ఓమాటను అంది "ప్రేమైకమూర్తియైన ఈదుష్యంతునికొఅకు శకుంతల ప్రత్యాదేశ విమానితురాలై క్లామ్యము నందింపంటే యెంతో తగివుంది" అన్నది.

పరధ్యానంతో నడుస్తూ రాజు "సారంగాక్షియైన ప్రియురాలు శకుంతల మొదట (నిద్రిస్తున్న) మోహాన్ని పొందిన నన్ను మేలుకొల్పింది" అన్నాడు. ఈమాటలను సానుమతి తన మతికి తెచ్చుకొని శకుంతలా మతితో కలిపి సమన్వయంచేస్తూ "తపస్వినియైన శకుంతల అదృష్టం ఇట్లా వుంది" అని అంటుంది. అనిర్వాచ్యములైన అతి మధురములైన భాగధేయాలు శకుంతలవి అనిన్నీ, ఆ శకుంతల అనుభవించేవిగా లేవే అనిన్నీ, అయ్యో! దైవం అమాయకురాలయిన తపస్వినికి అదృష్టం అదృష్టంగానే వుంచాడేఅనిన్నీ, అన్య మతులతో తన మతిని అతికించి అందరి బాధను తన బాధగా చేసికొని సానుమతమ్మయే పడుచున్నది.

విదూషకుడు రాజును గురించి విచారిస్తున్నాడు. ఆ విచారం సానుమతమ్మకు కూడా విచారాన్ని కలి

గించే రీతిగానే వుంది "మళ్ళీ ఈ శకుంతలా వ్యాధిలో పడ్డావయ్యా! బాబూ! ఈ వ్యాధికి మందేమిటో? నాకు తెలియదే ఖర్మం" అంటున్నాడు. ఈ విదూషకుడికంటే తెలివిగల కంచుకి "జయం జయం మహారాజు గారికి" అంటూ "ప్రమద వన భూములు మీ కోసం ఎదురు చూస్తున్నాయి. మీకు ఈ ప్రమద వనంలో ఎక్కడ ఇష్టంవుంటే అక్కడ వినోదించండిబాబూ!" అని రాజు గారి రోగానికి మందు కనిపెట్టిచెప్పాడు.

ఇంకా శకుంతలా వ్యాధిలో మునిగిపోయిన రాజు గారు కూడా జాగ్రదవస్థలోనుండి వేత్రవతిని పిలిచి ప్రధానమంత్రి గారికి కబురుపెడుతున్నాడు. ఆ కబురు ఎంత గంభీరంగా వుందో చూడండి. "నాకు రాత్రి నిద్రలేదు. నేనీ వేళ ధర్మాసనంలో కూర్చోలేను. అంత మునిగిపోయే రాచకార్యం ఏదైనా వుంటే ఆ కాగితాలు నా దగ్గరకు పంపుమని చెప్పు" అంటున్నాడు. ప్రతీహారి "సరేనండి" అని వెళ్లడం అవుతుంది. కంచుకిని పిల్చి "నీవు ఇక్కడుండర్లే పంపించేసి నీవు నీ పనిలోకి పో" అంటున్నాడు. కంచుకి ఆ పనిచేసి పోతున్నాడు.

ఇంతలో విదూషకుడు అందుకొన్నాడు. "ఒక ఈగనికూడా లేకుండా చేశావయ్యా! రాజా!" అంటూ "శిశిరఋతువులో నీడచెట్లక్రింద అందమైన ప్రదేశమందు నిన్ను నీవు సంతోషపెట్టుకోవయ్యా!" అన్నాడు.

రాజామాట విన్నా విననట్టు తన మనస్సులోని ఆందోళనను చెప్పడం ప్రారంభించాడు. "వయస్యా" అన్నాడు "చూశావా? లోకంలో సాధారణంగా కష్టాల మీదనే కష్టాలు కలుగుతుంటాయన్నమాట నిజం సుమా" అని అంటున్నాడు. "శకుంతలా ప్రణయం గుర్తుకురావడంవల్ల మోహం అధికమై నా మనస్సు మనస్సులో లేకుండాపోయింది. ఇంతలో మనసిజుడు విల్లు ఎక్కుపెట్టాడు. ఆ వింటియందు చూతశరం ఇమిడ్చాడు. ఆ బాధా, ఈ బాధా, సహించడం ఎట్లాగయ్యా!" అంటున్నాడు. విదూషకుడు కందర్ప వ్యాధిని ఈ దండకాష్ఠంతో నాశనం చేస్తానంటూ ఆ మామిడిచిగురును కొట్టడానికి కఱ్ఱ ఎత్తాడు. రాజు నవ్వి "నీ బ్రహ్మవర్చసం బాగుందోయి" సరే కాని ప్రియురాలిని పోలియున్న లతలు ఎక్కడున్నాయో చూపు. అక్కడ కొంత మనస్సు సంతోష పెట్టుకుంటాను అన్నాడు. బాబయ్యా! మాధవీ మండపంలో వుంటాం అని చతురికతో చెప్పి అక్కడికి శకుంతలమ్మగారి చిత్రపటం తీసికొని రావలసిందిగా ఆజ్ఞాపించారుగా తాము అన్నాడు విదూషకుడు. "అవును హృదయ వినోదస్థానము ఇట్టిదేనోయి" అయితే "అట్టా పోదాం పదు" అన్నాడు రాజు. "ఇటు రండి బాబయ్యా!" అని దారి చూపిస్తున్నాడు మాణవకయ్య. ఇద్దరూ నడుస్తారు. వీరివెంట నడుస్తూంది సానుమతమ్మ. ఇంత వరకూ ఈ సానుమతమ్మకు వినడంతోటే సరిపోయింది. వినడం పూర్తి అయ్యింది. చేయవలసిన పనికి ప్రారంభించి వారిద్దర్నీ అనుసరించింది. రాజ విదూషకుల గమనానుకూల వ్యాపారానికి వారి మతితో తన మతిని శకుంతలామతికి అనుకూలం కొలిపి సానుమతమ్మ వెంటాడుతుంది.

'బాబయ్యా! మణిశిలా పట్టకాలంకృతమైన ఈ మాధవీ మండపం పుష్పపహారంతో రమణీయంగా మనకు స్వాగతం ఇస్తూంది. ఇక్కడ కూర్చుందాం రండి' అన్నాడు మాణవకయ్య. రాజుగారు అలంకరించారు వేదికను. విదూషకుడు తోడు పెళ్లికొడుకల్లా కూర్చున్నాడు. ఈ సందులో సానుమతికూడా లతల్లో దాక్కొని చూస్తానంటుంది శకుంతలమ్మ చిత్రాన్ని శకుంతలమ్మపై రాజు చూపే అనురాగ విశేషాల్ని ఆమెకు తెల్పుతానంటూంది తన మతికి శకుంతలమ్మ మతికి రాజుమతికీ గల సమన్వయం చిత్రం చూడ్డంలో కనపడుతూంది.

మాణవకయ్యతో "ఏమోయ్ ఇప్పుడు శకుంతలా ప్రథమ వృత్తాంతం అంతా గుర్తుకి వస్తూంది" అన్నాడు రాజు. "ఈ వృత్తాంతాన్ని నీకూ ఇదివరలో చెప్పానుగా. కాని శకుంతలని తిరస్కరించినపుడు నీవు నా దగ్గర లేకపోతివయ్యా! ఈ శకుంతలా తిరస్కృతికి పూర్వం ఆమె పేరైనా నీవు నాతో ముచ్చటించలేదుకదా! నీవూ నా మోస్తరుగానే ఆ వృత్తాంతాన్ని మరచిపోయావా యేమి ఖర్మం?" అన్నాడు రాజు. "నేనేమీ మరిచిపోలేదు. ఆ కథంతా చెప్పి ఆఖర్ని ఇదంతా వేళాకోళంగా సరదాగా తమాషాగా చెప్పాను సుమా? ఇది యథార్థమని గ్రహించేవు సుమా! కొంపముంచి" అని అన్నావు గదయ్యా! నా రాజా! నా

మట్టిబుట్ట అదే నిజం అనుకుంది. ఇంతకీ కానున్నది బలవత్తరమైంది కాక మానదు కదా బాబూ!" అన్నాడు మాణవకయ్య! సానుమతి అంగుళీయకం అని అనుకొని ఆరాజు వాని మిత్రుడు అనుకొనే మతితో తన మతిని కలిపి "అదంతే అదంతే" అంది. ఈ అవసరంలో సానుమతి మతి గతిని జాగరూకతతో పరిశీలిస్తూ లోక మతి గతిని కూడా కలుపు కొంటూంది.

రాజుగారు శకుంతల్ని గట్టిగా ధ్యానం చేసి "మిత్రమా! రక్షించవయ్యా నన్ను" అన్నాడు, "ఏమోయ్, ఇదేమి అవస్థోయ్ ధీరుడవైన నీకు ఈ విచారం తగదోయ్ సత్పురుషులు గంభీరం వచ్చినప్పుడు ఎప్పుడూ ఇతరుల చేత చెప్పించుకోరోయ్ పెద్దగాలి దుమారం వస్తేమాత్రం పర్వతాలు కంపిస్తాయోయ్" అన్నాడు మాణవకయ్య "ఏ కారణం వల్ల వియోగాన్ని పొందిన ప్రియురాలు నేపదే అవస్థ పడుతుంది కదా అని ఓ సారి స్మరించి మిక్కిలి విషణ్ణుడయిపోతున్నానయ్యా! అదెల్లా? అంటావా? విను "అంటున్నాడు రాజు." ఆ శకుంతలను నేనే ఇక్కడ నుంచి తిరస్కరించినప్పుడు ఆమె స్వజనాన్ని అనుసరించి పోవడం కోసం సిద్ధమైంది. గురుసముడైన గురు శిష్యుడు "నిలు నిలు" అని గట్టిగా హుంకరించేడు. వెంటనే కన్నీళ్ళు కారుస్తూండడం వల్ల కలుషితమైన చూపుతో మళ్ళీ నన్ను ఓ చూపు చూసింది ఆ చూపు నా హృదయంలో దూరి విషంతో కూడిన శల్యమై క్రూరాత్ముణ్ణి నన్ను తగలబెట్టేస్తుంది బాబూ!" అని రాజు నిజ హృదయాన్ని మిత్రుని కప్పగించాడు.

ఇంతలో అందుకొంది సానుమతమ్మ. "సెబాస్" అని తన లోపల అనుకొని, తన ఆత్మ పటుత్వాన్ని సమర్థించి లోకం అంతా ఇంతే అంది. స్వకార్య తత్పరత ఇల్లాగే నాలో స్థిరంగానే వుంటుంది కాబోలు అంది. లోకమతిలోకి దిగి తనమతికి అమతికి సాదృశ్యం సంపాదించు కొంది వహ్వా అనుకొంది. మనస్సుని సమాధాన పరచుకొంది శకుంతల కోసం ఈ రాజు ఏడుస్తూ వుంటే నాకు ఎంతో సంతోషంగా వుంటోంది ఇక్కడ సానుమతమ్మ సంతోషం శకుంతలామతిని అనుసరించి, లోకంలో మగనిచే విడువబడ్డ అపవిద్ధ శాలూకు బంధువుల మతితో అనుసరించి పాఠకుల మతి వికాసానికి సాయపడుతూంది సంతాప సమయంలో సంతోషించే సానుమతమ్మమతి లోక మతిని విషయంగా చేయడం వల్లనే ఆమెకు అన్వర్థ సంజ్ఞా ప్రాప్తి సుసంగతంగా వుంది

"ఆ కాలంలో తిరిగే వాడెవడైనా శకుంతలమ్మని తీసుకపోయ్యేడా? ఏం చెప్మా"—అని నా కో సందేహం సుమా రాజా!" అన్నాడు మాణవకయ్య.

"పతిదేవతైన శకుంతల్ని ఇతరుడెవడూ తాకలేడు. శకుంతల తల్లి మేనక అని అందరికీ తెలిసినదే. నేనూ విన్నాను ఆ మేనక చెలికత్తెలు శకుంతలను తీసుకుపోయి ఉంటారన్నమాట అని నా హృదయం నాకు చెబుతూ వుంది" అన్నాడు రాజు. ఈ యిద్దరి మాటలూ విని రాజుగారి మాటమీదికి తనమతిని నిలిపింది సానుమతి. రాజుకి కల ఓ గొప్పతనాన్ని తనమతితో నిర్ణయిస్తూ "ఇటువంటి ప్రేమైకమూర్తికి ఆ సభలో ఈ శకుంతలా విషయం మరపురావటం ఆశ్చర్యంగా వుంది ఇప్పుడు జ్ఞాపకానికి రావడంమాత్రం నాకు ఆశ్చర్యంగా లేదు. సుమా" అంది సానుమతి "రాజా!" ఇది నీవు చెప్పినట్టే మేనక చెలికత్తెలే శకుంతల్ని తీసుకొని పోయివుంటే కొద్దిరోజుల్లో నే మీ రిద్దరూ కలియగలరయ్యా!" అన్నాడు మాణవకయ్య. అదెల్లా చెప్పగలవయ్యా! అన్నాడు రాజు. లోకంలో తల్లిదండ్రులు భర్తృవియోగ దుఃఖితురాలైన అమ్మాయిని చూస్తూ చూస్తూ వూరుకొని ఉండలేరయ్యా! రాజా! అన్నాడు విదూషకుడు.

"శకుంతల్ని మళ్ళీ నేను చూడ్డం అనే సంగతి ఇక లేనే లేదు. అది కల్ల శుద్ధ మాయ. వట్టి పిచ్చి మాట. నేను చేసుకున్న పుణ్యం అత్యల్పం కనుక అంతమాత్రమే ఫలం అనుభవించాలి. ఒడ్డు లేకుండా వుంటే ప్రవహించే నదులమాదిరి మనోరథాలు ఓదాని తరువాత ఒకటి పుడుతూ వుండటం నశిస్తూ వుండటం, మళ్ళా పుడుతూ వుండటం, మళ్ళా నశిస్తూ వుండటం, నా వంటి దురదృష్టవంతులకు సహజం గదయ్యా! మాణవకయ్యా!" అన్నాడు రాజు ఓ మహా ధీరుడు వలె. "అట్లా తలంపకు మీ కిద్దరికీ తప్పక నిస్సందేహంగా సమాగమం అవుతుందని ఈ యంగుళీయకమే నిదర్శనంగా వుందిగదయ్యా!" అన్నాడు మాణవకయ్య. ఓ అంగుళీయకమా! అరుణ నఖ మనోహరాలైన శకుంతల వ్రేళ్లలో ఓ స్థానాన్ని సంపాదించి మళ్ళీ స్థాన భ్రంశ మయ్యావంటే నా వలెనే నీవునూ చేసిన పుణ్యం

అత్యల్పఫలాన్నే ఇచ్చేది అయిందన్నమాట. అన్నాడు రాజు. అంతలోనే ఆ మాట నందుకుంది సానుమతమ్మ. వెంటనే కుందిపోతూన్న మనస్సుతో "ఈ వుంగరం ఇంకొకరి చేతిలోపడితే తప్పకుండా ఏడ్వవలసివచ్చే అయ్యేది" అని ఎంతో వాపోతూ నాయికా నాయకుల మతితో ముడిపెట్టి అంగిరసమునకు మృతసంజీవనిని ఉపయోగించింది. "ఓ రాజా! ఈ వుంగరం ఎట్టి ఉపక్రమంతో శకుంతలమ్మ చేతి వేళ్లను అలంకరించిందో కాస్త చెబుదూ" అన్నాడు విదూషకుడు. నాకూ వినాలనే వుంది ఈ వృత్తాంతం ఇంతట్లో ఈ విదూషకుడు అడిగేశాడు కదా! అంది సానుమతమ్మ.

మాణవకయ్య మతితో తన మతిని సమన్వయించుకొంటూను. అయితే చెబుతాను వినమన్నాడు రాజు. నేను ఆశ్రమంనుండి నగరానికి వస్తూండగా కన్నీళ్లతో శకుంతల "మళ్ళీ ఎన్నాళ్లకు ఆర్యపుత్రులు నన్ను పిల్చుకుపోవడానికి కబురంపుతారు" అంది. అప్పుడు ఈ వుంగరాన్ని ఆమె వ్రేలున పెట్టి ఇట్లా చెప్పాను. ప్రియురాలా! ఈ వుంగరంమీద వున్న నా నామాక్షరాల్ని రోజుకి ఒక్కొక్కటి లెక్కపెట్టుతూ వుండు చివరికి వచ్చేసరికి నిన్ను అంతఃపురంలోకి తీసికొని రావటానికి నా దగ్గరనుండి మనిషి నీ దగ్గరకు వస్తాడు" అని. కాని దారుణ చిత్తుడైన నేను మోహంవల్ల ఆ మనిషిని పంపలేదు" అన్నాడు రాజు.

సానుమతమ్మ "ఈ అవధి రమణీయంగా నే వుందే! విధి ఇదంతా తల్లక్రిందులు చేసినాడే" అని తన మతి కూడా తల్లక్రిందులుగా తిరుగుతున్నట్టు కంపించిపోతుంది. అంతలో ఈ వుంగరం రోహిత మత్స్యం కడుపులోంచి తీశాం అన్న జాలరిమాటకు సందర్భం ఏమయ్యుంటుందయ్యా! రాజా! అన్నాడు మాణవకయ్య మీ చెలి శచీతీర్థానికి నమస్కరిస్తూండగా ఆమె చేతినుండి వుంగరం నీళ్లలో జారిపోయిందన్నాడు రాజు. బాగానే వూహించావయ్యా! అన్నాడు విదూషకుడు.

అందుకే అనుకంపార్హురాలైన శకుంతల్ని పెండ్లాడి వుండటం విషయంలో అధర్మభీరువైన రాజుకి సందేహం కలిగి వుండవచ్చు. లేకపోతే ఈ దృఢానురాగం అభిజ్ఞానాన్ని అపేక్షిస్తుందా మరి? అంతే అయివుంటుంది. లేకపోతే అదెట్లు జరుగును? అని సానుమతమ్మ మతి ధర్మజ్ఞుల మతితోను దూర్వాసుని శాపవృత్తాంతాభిజ్ఞులతోనూ, సహృదయ పాఠకుల మతితోనూ, అనుమతిని సంపాదించుకోవడం ఎంతయు రమణీయంగా వుంది. ఉంగరాన్ని తిడతానంటున్నాడు రాజు. ఉన్మత్తుల మార్గం పట్టాడే రాజు అని లోపల కంగారుపడుతున్నాడు, విదూషకుడు.

ఓ ఉంగరమా! నీవు ఆ సుందరకోమలాంగుళియైన కరాన్ని విడిచిపెట్టి నీళ్లల్లో ఎందుకు మునిగిపోయావే? ఆహా! పొరపాటు అటుగాదు చేతన పదార్థమైన నేనే ఆ రీతిగా ప్రియురాల్ని త్రోసిపుచ్చితినే పాపం! నీవు అచేతన పదార్థానివి. గుణం ఎట్లా తెలుసుకోగలవు? అంటున్నాడు రాజు. "అయ్యయ్యో! ఆకలి నన్ను తినేస్తుంటే" అని లోలోపల అనుకొంటున్నాడు విదూషకుడు కారణం లేకుండా విడిచిపెట్టడంవల్ల పశ్చాత్తాప సంతప్త హృదయుడైన నాకు దర్శన మిచ్చి దయచూపెట్టితే బాగుంటుందని అంటాడు రాజు. శకుంతలమ్మ చిత్రపటాన్ని పట్టుకొని చతురిక హఠాత్తుగా వచ్చి "ఇదిగో శకుంతలమ్మ చిత్రపటం" అంది.

సెబాస్! మిత్రమా! సుందరాకృతితో మిక్కిలి రమ్యంగా చూడ చూడ కింపు గొల్పుతుందయ్యా! భావానుప్రవేశము. నా చూపు నిమ్నోన్నత ప్రదేశాలలో తొట్రుపడుతూందయ్యా! వయస్యా! అన్నాడు విదూషకుడు. సానుమతమ్మ అనుకొని "అహో! రాజుగారి నైపుణ్యం బలే బలే" అంది. నా చెలి శకుంతలమ్మ నా యెదుట వుందనే తలుస్తాను. అని రాజుగారి ప్రకృతి మతి గతి కనుకూలంగా పాఠకమతిని జరిపిస్తూంది.

అసలుకన్న చిత్రపటంలో అందంగా దిద్ది చమత్కరింపవచ్చు. అలాగైనప్పటికీ ఆమె యీ లావణ్యం రేఖచేత కొంచెమే సరిదిద్దడం అయింది. పశ్చాత్తాపంవల్ల అధికమైన స్నేహానికి ఈ రాజు నిర్దోషమునకు ఎంతో తగివుంది. అని సానుమతమ్మ రాజునకుగల ఉత్తమోత్తమ మతితో పాఠకుల్ని దగ్గరకు తీసికొంటూంది తన మతితో.

ఏమయ్యా! ఆ చిత్రపటంలో ముగ్గురు పూజ్యురాండ్రున్నారుకదా! అందులో శకుంతలమ్మ ఎవరూ?

అందరూ అందంగానే వున్నారుగామరి! అంటున్నాడు విదూషకుడు.

ఏమిమూఢదృష్టిరా! బాబూ! పిడిది. ఇటువంటి అందచందాల తేడాలు నీవిదివరలో ఎప్పుడూ ఎరుగవు కాబోలు. అంటూ సానుమతమ్మ విదూషకుని తెలివితక్కువతనాన్ని పాఠకులనుకునేదాన్ని రసికులమతిని మించిన మతితో హేళన చేస్తుంది. అందులో ఎవర్ని నీవు నా ప్రియురాలినిగా తలుస్తున్నావు చెప్పు చూస్తాను. నీ తెలివి. అంటున్నాడు రాజు విదూషకునితో. విదూషకుడు కవిత్వం ప్రారంభించాడు. ఆఁ చెప్తాను వినవయ్యా! అంటూ 'జుట్టుముడి విడిపోవడంవల్ల కొప్పులోంచి పూలు రాలిపోతూంటగా శ్రమవల్ల మొగమంతా చెమట బిందువులు తొణికిసలాడుతుండగా, నీళ్లు బాగా నిమ్మకోవటం వల్ల అతి మనోహరంగా అప్పుడప్పుడే చిగుర్చుతూ వున్న మామిడిచెట్టుని రెండు బాహువులతో గట్టిగా ఆనుకొని కొంచెం విశ్రాంతి తీసుకొంటున్నదా? ఏం చెప్మా అన్నట్లు చిత్రింపబడ్డ ఆమె శకుంతలమ్మ అని నేనూహిస్తున్నాను. మిగిలిన ఇద్దరూ ఆమె చెలికత్తెలనుకొంటాను' అన్నాడు విదూషకుడు. ఈ మాటలు సానుమతమ్మ చెవిలో పడినట్లు కన్పించదు. ఇదివరలో ఈ విదూషకుడు ఈ ముగ్గుర్లో శకుంతలమ్మ ఎవరన్నప్పుడు విదూషకుని దృష్టికి మూఢత్వం అతికించిన సానుమతి ఈ విదూషకుని కవిత్వం వింటేతా నిదివరకిచ్చిన మూఢత్వాన్ని మళ్లీ వుపసంహరించుకొని ఓ గొప్ప బిరుదుకూడా మాణవకయ్యకిచ్చివుండేది కాని సానుమతమ్మ ఇక్కడ తన్మయురాలై రాజునకు శకుంతలకుగల ప్రేమమత్తుతో తన మతిని లగింపచేసి వుండవచ్చు. అయితే కవి సానుమతమ్మచే ఇంత తెలివైన విదూషకుణ్ణి ఎందుకు తిట్టించాల్సి వచ్చింది? అనే ప్రశ్న కలక్కమానదు ఆ ప్రశ్నకు రాజు స్వయముగా పూనుకొని సమాధానం చెబుతున్నాడు ఏమంటే మంచి నిపుణుడట విదూషకుడు సాత్వికభావంచేత వ్యక్తమైన చిహ్నం విదూషకుని కవిత్వంలో వున్నది రాజు హృదయాన్ని హత్తుకుంటట. రేఖాప్రాంతాలయందు చెమర్చు వ్రేళ్ల తాకుడువలని మలినం బాగా కుంచెతో దిద్దడం వల్ల చెక్కిళ్ళమీది కన్నీరుగా కనబడుతూనే వుండట.

ఇంత కవిత్వాన్ని కట్టగల విదూషకుని పొంగిత్యాదులను పాఠకుల మతితో పతికించు సానుమతి విదూషకుని కవిగాచేసి అతని కవిత్వమునకు దుష్యంతుణ్ణి వ్యాఖ్యాతగా నటింపించుట తన మతి ప్రభావం వల్లనేనని తెలియంగవలె. రాజు చతురికను తూలిక తీసుకొని రావలసిందిగా ఆజ్ఞాపించాడు. విదూషకుణ్ణి పటం పట్టుకోమంది చతురిక. నేనే పట్టుకొంటా అని రాజే పట్టుకొని వయస్యా! నేను దారిలో ప్రవహించు నదిని విడిచి ఎండమావుల దప్పి తీర్చుకో దలచిన మూఢునివలె ఎదుటికి వచ్చిన ప్రియురాల్ని త్రోసిపుచ్చి చిత్ర పటంలో ఉన్న దానిని చూచి మిక్కిలి గౌరవించుచున్నానుకదా! అని తన తప్పును చెంపలు వాయించుకొంటూ ఒప్పుకొంటున్నాడు. ఆ విషయం నిజమే అన్నాడు విదూషకుడు. అయితే ఇక చిత్ర పటంలో చక్కదిద్దవలసిందేమయ్యా! నా రాజా! అన్నాడు మాణవకయ్య. ఈ సందులో సానుమతి అందుకొంది. "సఖురాలైన శకుంతలకు ఏయే ప్రదేశములు మిక్కిలి కాంతి మంతములో ఆయా ప్రదేశములను రాజు చిత్రించుటలో మిక్కిలి ఆసక్తి కలవాడవుతాడు సుమా! నిస్సంశయముగా" అని అంటూ శకుంతలా సౌందర్య విభవాతిశయావలోకన కార్య నిమగ్నురాలై దుష్యంతునకు శకుంతలమీదగల ప్రేమామృతాంభోధి తరంగ లీలా నృత్య మంజుల మనోహరోజ్జ్వల పవిత్ర భావాను భావానుభవ తత్పరురాలై తన మతిని దుష్యంతుని మతితో జత పరచుచున్నది. రాజు వినవయ్యా! మాణకయ్యా! అని అంటున్నాడు. ఈ చిత్రములో మాలినీ నదిని చక్కదిద్ది ఆ నది యొడ్డున ఇసుక దిబ్బలు చిత్రించి అందు క్రీడా వినోదార్థ మణగియున్న హంస మిథునములను చిత్రించవలెనని అంటున్నాడు. హిమవత్పర్వతమును దాని చరియలను చిత్రించి అందు పండుకొనియున్న లేళ్లను చిత్రించవలెనంటున్నాడు. కొన్ని చెట్లు చిత్రించి వాని కొమ్మలకు బట్టలుకట్టి ఆ చెట్ల క్రింద మగలేడి యొక్క వామ నయనమును కొమ్ముతో గోకుచున్న ఆడలేడిని చిత్రించవలెనని ఉన్నదని చెబుతున్నాడు ఇది విన్న మాణవకయ్య ప్రేలాడుదాఢులతో మునిబృందమిందు పొందుపరుపవలెనని ఉందని లోలోన అనుకొన్నాడు.

రాజు 'మాణవకా! శకుంతల కైదైనా అలంకారం ఇష్టమైంది ఇందు మరచిపోయానా!' అంటే 'ఆఁ ఏవిఁ!' అన్నాడు విదూషకుడు.

ఇంతలో సానుమతికి మతి తికమక పెట్టి "వనవాసమునకు, సౌకుమార్యమునకు, ఏది తగివుందో అసలే కదా!" అనుకొంది.

రాజు ఇంకా చిత్రించ వలసింది చిత్రించ లేదని విదూషకునితో ఈ రీతిగా చెప్తున్నాడు. చెవులకు పెట్టి ముడివేసినది కపోలముల వరకు వ్రేలాడు కింజల్కములు గలది అయిన శిరీష పుష్పమును చిత్రించ లేదనిన్నీ శరచ్చంద్రమరీచి కోమలమగు మృణాల సూత్రాన్ని చిత్రించలేదనీ వివరించాడు. ఈ భావం సానుమతికి ఎంతో తృప్తి నిచ్చింది.

కాని విదూషకుడు తృప్తి చెందక "ఏమయ్యోయి! రాజా! ఆ పూజ్యురాలైన శకుంతల రక్షకురాలయైన అగ్రహస్తంతో మోము త్రిప్పి చకితురాలై ఉంది. ఆహా! దాస్యాఃపుత్రుడు కుసుమాసవ పాటచ్చరుడు మధుకరుడు ఈ పూజ్యురాలైన శకుంతల ముఖముపై ఝుముకుతున్నాడు." అని కవిత్వం ప్రారంభించే సరికి దుష్యంతుడు "ఈ దుష్టుని నివారింపు" మని యంటాడు. విదూషకుడు "అవినీతుల శాసించు నీవే ఆ దుష్టుని వారించుట కర్హుడవు" అంటున్నాడు. "బాగా చెప్పావయ్యా!" అంటున్నాడు రాజు. ఓయీ! ఓ కుసుమలతా ప్రియాతిథీ! ఎందుకిక్కడ పరిపతన ఖేదం అనుభవిస్తున్నావు. "ఈ మధుకరీ సతి కుసుమ నిషణ్ణయై తృషితురాలయ్యూ నీయందనురక్తురాలై నిన్ను విడిచి తేనె తాగుట మాని నీ రాకకై నిరీక్షిస్తూంది." అంటున్నాడు రాజు.

సానుమతి ఈ మాట విని సారం గ్రహించింది. నాయికా నాయక గత ప్రస్తుత వృత్తాంతాన్ని సమన్వయించుకొని "ఇప్పుడు న్యాయంగానే మధుకరము వారింపబడింది" అని దుష్యంతుని కృత్యంలో గల గొప్పతనాన్ని ధర్మబుద్ధిని గుర్తించి పాఠకుల్ని గుర్తింపచెయ్యటం ఎంతో హృద్యం

మధుకరాన్నుద్దేశించి, "వారించినా ఈ జాతి వామగామిగా ఉందే" అని విదూషకుడంటూన్నాడు.

"అవునయ్యోయ్, ఓ భ్రమరమా! నా శాసనంలో ఉండవూ? అయితే ఇప్పుడు విను. అనుపహత బాల తరు పల్లవాల లాగ లోభనీయమైన ప్రియురాలి బింబాధరాన్ని రతోత్సవాలో నేను సదయంగా ఆస్వాదించాను. నీవు ఆ బింబాధరాన్ని తాకినావా, నిన్ను కమలోదరంలో బంధిస్తాను" అంటూన్నాడు రాజు.

ఇంతలో విదూషకుడు నవ్వి తనలో "ఇంత కఠినదండనకైనా బెదరదేమిటి?—ఇతడైతే ఉన్మత్తుడు. నేనుకూడా ఇతని సాంగత్యం వల్ల అట్టివాడినే అయ్యాను." అనుకొని పైకి "ఏమయ్యోయ్ రాజా! ఇది చిత్రఫలకమయ్యా!" అన్నాడు.

"ఆహాఁ! ఇది చిత్రమా?" అన్నాడు రాజు.

ఈ మాటలు విన్న సానుమతి ఈ రాజు చిత్రితమైన శకుంతలనే ధ్యానిస్తూ ఉన్నాడనీ అనుభవిస్తూ ఉన్నాడనీ తెలుసుకొంటూ ఉన్నాడనీ నేనుకూడా ఇప్పుడే తెలుసుకొన్నాను.

"ఓ వయస్యా! దోష దర్శిత్వం ఈరీతిగా ఎందుకు అయినవయ్యా? తన్మయమైన హృదయంతో సాక్షాత్తుగా దర్శన సుఖాన్ని అనుభవిస్తున్న నన్ను స్మృతికి తెచ్చిన నువ్వు మళ్లీ ప్రియురాల్ని చిత్రంలో ఉంచేశావయ్యా!" అని రాజు కన్నీళ్లు కారుస్తాడు.

ఈ విరహమార్గం పూర్వాపరవిరోధిగా ఉండి అపూర్వంగా ఉందే అని అంటుంది సానుమతి

విప్రలంభశృంగార రస వర్ణన అపూర్వంగా ఉందనే మాట సానుమతిని వివరణకర్త్రిగా ఉంచుకొని కవి, ఇక్కడ తన అపూర్వ రస నిర్వహణ చాతురిని వ్యంగ్యీకరిస్తున్నాడు.

శకుంతలయొక్క సమాగమ స్వప్నం ప్రజాగరంవల్ల విరుద్ధమైంది.

ఇక కన్నీరు చిత్రఫలకంలో ఉన్న శకుంతలనైనా చూడ్డానికి అవకాశం ఇవ్వటంలేదని రాజు విలపిస్తున్నాడు.

ఈ మాట విన్న సానుమతి "శకుంతలను తిరస్కరించి విడవటంవల్ల వచ్చిన దుఃఖాన్ని అన్నివిధాలా తుడిచి వేసుకొన్నావయ్యా, రాజా!" అంది. ఈ మాటతో సానుమతి దుష్యంతుడి పాపాన్ని తన హృదయంలో చక్కగా తుడిచి వేసుకొంది.

ఇంతలో చతురిక, "జయం జయం మహాప్రభువుకు. మీ ఆజ్ఞానుసారంగా నేను వర్తికాకరండకాన్ని తీసుకొని యిటు వస్తున్నాను" అంది.

"అప్పుడేమయిందేమిటి?" అన్నాడు రాజు.

తరళిక—"మహాదేవి, వసుమతి నా కడ్డంగా వచ్చి ఆ వర్తికా కరండకాన్ని నేనే మహారాజు గారికి ఇస్తాను అని బలవంతంగా నా చేతినుంచి లాక్కున్నారు"

"అమ్మగారు అంతటితో నిన్ను విడిచి పెట్టేరూ? అదృష్టవంతురాలి వన్నాడు విదూషకుడు.

ఇంతలో వసుమతి దేవిగారి పైటకొంగు కొమ్మకు తగులుకొంది. ఆ పైటకొంగు తరళ విడదీసే లోపుగా నన్ను నేను రక్షించుకొని పరుగు పరుగున ఇక్కడకు వచ్చేశానన్నది చతురిక.

"వయస్యా! బహుమాన గర్వితురాలైన దేవి మనల్ని సమీపిస్తున్నది. నీవు ఈ చిత్రపటాన్ని రక్షించవయ్యా!" అంటున్నాడు రాజు.

చిత్రపటాన్ని తీసుకొని లేచి "చిత్రపటాన్ని రక్షించు అంటావేమిటి? నన్నే అని చెప్పు. ఏమయ్యోయ్ రాజా! నీవు అంతఃపుర కాలకూటాన్నుంచి విడివడ్డ వెంటనే నన్ను పిలు. నేను మేఘప్రతిచ్ఛందమైన ప్రాసాదం మీద ఉంటాను" అన్నాడు విదూషకుడు.

"ఇప్పుడు అన్యసంక్రాంతహృదయుడయినా ప్రథమ సంభావనను కోరుతున్నాడు, శిథిల సౌహార్దుడైన యీ రాజు, అని సానుమతి దుష్యంత హృదయపరిశోధనను పుటపాక ప్రతీకాశంగా చేసి లోకాని కంతటికీ అందిస్తుంది.

"ఇంతలో ప్రతీహారి ప్రవేశించి, "జయం జయం దేవర వారికి" అంది. "ప్రతీహారీ!నీవు త్రోవలో దేవిగారి కంటపడలేదు కదా?" అన్నాడు రాజు.

"రాజా! ఆమె కంటబడ్డాను. కాని, ఆమె పత్రహస్తురాలినైన నన్ను చూసి వెనక్కి వెళ్లిపోయింది" అంది ప్రతీహారి.

కార్యజ్ఞురాలు నాకు కార్యావరోధాన్ని పరిహరించిందని తన దేవేరి గొప్పతనాన్ని కొనియాడు కొంటున్నాడు రాజు.

"దేవా! ఇలా అమాత్యులవారు విన్నవించు కొంటున్నారు. 'ద్రవ్యజాలం గణనా బహుళం కావడంచేత ఈ ఒక్క పౌరకార్యాన్ని తామే పత్రారూఢమైనదాన్ని పరిశీలింతురుగాక !' అని—" ప్రతీహారి పత్రికను రాజుకు చూపించింది.

"ఆఁ! సముద్ర వ్యాపారి సార్థవాహుడు ధనమిత్రుడనేవాడు నావలయొక్క నాశనంవల్ల ఆపత్తు పొందినాడు. అనపత్యుడట, పాపం! ఎంత దౌర్భాగ్యుడో కదా! వాడి ధనరాశి రాజుకే చెందవలసివుంది" అని మంత్రి వ్రాసిన లేఖను చదివి రాజు, "సంతానం లేకపోవటం ఎంతో కష్టంకదా" అని అనుకొని, చాలా ధనం కలవాడవడంవల్ల చాలామంది భార్యలు వాడికి ఉండవచ్చు. వాడిభార్యల్లో ఏఒక్కర్తయినా గర్భవతియై ఉండవచ్చు; ఈ విషయం విచారించ వలసింది" అన్నాడు.

"దేవ! సాకేత పట్టణంలోని సెట్టిగారి కుమార్తె ధనమిత్రుని భార్యల్లో ఒకతె గర్భవతి అని ఇప్పుడే తెలిసింది." అని ప్రతీహారి చెప్పింది.

"ఏయ్! పిత్ర్యమైన ధనం గర్భంలో ఉన్నవాడికి చెందుతుంది. వెళ్లు. మంత్రిగారితో ఇలా చెప్పు" అన్నాడు రాజు. విని వినడంతోనే "దేవర వారి ఆజ్ఞ" అంటూ ప్రతీహారి తొందరగా పోతూ ఉంటే రాజు ఆమెను ఆపి, 'ఇలారా!' అన్నాడు. 'వచ్చానండి' అది ప్రతీహారి. 'ఇదుగో! విను, సంతతి ఉన్నా సరే, లేకపోయినాసరే దాంతో ఏమీపన్లేదు. ఏ ఏ ప్రజలు ఏ ఏ ఇష్టమైన బంధువుల వియోగాన్ని పొంది ఉన్నారో ఆయా ప్రజలకు పాపవృత్తి విడిచి ఆయా ఇష్టమైన బంధువు దుష్యంతుడే అని రాజ్యంలో చాటించవలసిందని మంత్రికి కబురు అందించన్నాడు రాజు. అల్లాగే చాటించవలసిందిగా చెబుతానని చెప్పేసివెళ్ళి, మళ్ళా తిరిగివచ్చి "దేవర వారి శాసనాన్ని సకాలంలో కురిసిన వర్షంలాగ మిక్కిలిగా అందరూ కొనియాడారండీ!" అంది ప్రతీహారి.

పెద్దపెట్టి నిట్టూర్పు విడిచి, "ప్రతీహారీ! ఈ రీతిగానే సంతతి చ్ఛేదంవల్ల ఆలంబనం లేని కులాల్లో మూల పురుషావసానంతో సంపదలు పరుని పొందుతుంటాయి. నా తర్వాతకూడ పురువంశశ్రీ నాటబడ్డ విత్తులుగల భూమిఅయ్యా, ఈ రీతిగానే అయిందని వాపోతూ ఉండగా "అమంగళం ప్రతిహతమౌగాక!" అని ప్రతీహారి పలుకుతుంది. ఈ పలుకులు విన్నరాజు, "సంప్రాప్తించిన శ్రేయస్సును అవమానించిన నాకు అమంగళం ఉపశమిస్తుందా? ఛీ!" ఉపశ

మించదని తన పూర్వ చేష్టితాన్ని నిందించుకొంటున్నాడు.

సానుమతి ఈ మాటలన్నీ విన్నా వినక పోయ్యినా కడపట రాజు పలికిన పలుకులివి, "నిస్సందేహంగా సఖురాలినే హృదయంలో ఉంచుకొని తన్ను తానే నిందించుకొంటున్నాడు రాజు" అని ఓ పరిశిష్టితార్థాన్ని పిండి దాని సారంలో కావ్యసారాన్ని భావుకుల కందిస్తుంది రస సంజీవనిగా తానయి.

నేనే సంగోపితుడనైకూడా, సకాలంలో నాటబడ్డ బీజాలుగల వసుంధరలాగ గొప్పఫలం నిమిత్తమై ఏర్పాటు చెయ్యబడినది, కులప్రతిష్ఠన యౌవనదియగు ధర్మపత్నిని విడిచానని పరితాపాన్ని పశ్చాత్తాపాన్ని పొందుతూన్న రాజుమాటలు విన్న సానుమతి సంసార సారంలోకల అమృతిప్రవంతిని ప్రవింప చేస్తూ "ఇప్పుడు నీసంతతి అపరిచ్ఛిన్నమై ఉంటుం" దంటుంది. ఈ మాటల్లోని భావంతో ఏకీభవించేవారి మతితో సాను మతి మతి అనుమతిస్తూ యీకావ్యానికి చరితార్థతను సిద్ధింపచేస్తూ ఉంది.

వేటూరి—

సుందరశాస్త్రిగారి

సువర్ణ సుందర రసము

సర్వమేహములకుసంజీవి.

గుణము ప్రత్యేకము

అనుభవసిద్ధము. ఇంజెక్షన్లు అవసరం లేదు. ఎటువంటి సవామేహాలనైనా కుదుర్చును.

50 మాత్రలు రు. 5.

ఆర్షరసాయనశాల, ముక్త్యాల.

చతురికఅనేఅమ్మాయి ప్రతీహారితో అంటూంది, ఏమనంటే. "విన్నావా! అమ్మాయీ? ఈ పార్థివాహ వృత్తాంతంవల్ల ద్విగుణీకృతోద్వేగుడయ్యాడు రాజు అనిన్నీ, ఈ రాజుని ఊరడించడానికి మేఘప్రతిచ్ఛంద సౌధంనుంచి మాణవ్యకని తీసుకొని తిరిగివస్తావని అంటుంది. ఈ మాట విన్న ప్రతీహారి చతురికను "చాలా బాగా చెప్పావే" అని ఆ సమయస్ఫూర్తికీ సద్యస్ఫూర్తికీ చాలా పొగడుతుంది. ఈ పొగడ్త కవి మతిని సానుమతి మతికి చదువరులమతికీ పొత్తు కలుపుతూ ఉంది.

"దుష్యంతునియొక్క పితృదేవతలు సంశయాన్ని పొందినారుగదా, ఎంత ఆశ్చర్యం? ఎందుచేత నంటే నాతర్వాత వేదోక్తంగా అనేకోపకరణాల్తో కూడుకొన్న తిలోదకాల్ని మాకులంలో ఈపైన ఎవడైనా ఒకడు ఇస్తాడు అనేమాట లేదుకదా అని తలంచి ప్రసూతి వికలుడనైన నేను సమర్పించు నివాపోదకాన్ని పితృదేవతలుచూచి ఈపైన నివాపజలం మనకు లేదేఅని శోకించి కన్నీరుగార్చి నే నిచ్చిన నివాప జలంలో కొంత తీసుకొని ముఖమూ కన్నులూ కడుక్కొని మిగిలిన నివాపజలాన్ని పుచ్చుకొంటారు ఇది నిశ్చయం!" అని విలపిస్తూ రాజు మోహాన్ని పొందుతాడు.

ఈమోహం దుష్యంతుడికేగాక అక్కడున్న చతురిక ఆవేశానికి, చాటునున్న సానుమతికికూడ కలిగింది. ఈముగ్గురిమోహంలోను అవస్థాభేదాలున్నాయి. దుష్యంతుడి మోహం లౌకిక రసానుభూతికి సమన్వితమూ సముచితమూ అయివుంది చతురిక మోహం విష్వంశసంభూతుడైన రాజు మోహంపొందటం దేశక్షేమానికే బాధ కలుగుతుందనే భీతిచేత, ప్రభుభక్తిచేత హృదయస్పందీకరణ యోగ్యమైంది. సానుమతి మోహం కరుణ విప్రలంభ శృంగార రసానుభూతుల చేత సరససహృదయ భావుకామృతానంద పాథోధులుబుకచేస్తూ నాయికానాయకులను ఏకైకతరంగ డోలికల్లో ఉర్రూతలూగింపజేస్తోంది. ఈ ఉర్రూతలూగింపజేసే సానుమతీ మోహం సానుమతిని యుక్తాయుక్త వివేకశూన్య హృదయురాలినిగా చేసింది.

అలా అన్న సానుమతి, "ఎంత కష్టం, ఎంత కష్టం!' అని దీపముండిన్నీ అద్దుండనమనే దోషంవల్ల అంధకారాన్ని అనుభవిస్తున్నాడు. నేను ఇప్పుడే యీ వృత్తాంతాన్ని చెప్పి రాజుని సుఖపెడతానని తలపోసుకుంది. కాని మళ్లా వెంటనే ఆలోచించి అహాఁ! వద్దని అనుకొంది. ఇంతలోనే సానుమతికి శకుంతలను ఊరడించే మహేంద్రజనని ఐన అదితి జ్ఞానదృష్టికి అందింది.

ఆ అదితి చెప్పిన మాటలు స్ఫురణకు వచ్చాయి. తన అంతరాన్ని ఆ అదితి అంతరాన్ని పోల్చి తూచి చూచి ఆచి నిలిచి తన సానుమతీ నామానికి సార్థక్యాన్ని పోషించుకుంది. ఆ పోషణ, కావ్యపోషణ-రసపోషణ. నాయికానాయక హృదయ పవిత్ర చరిత్ర పోషణగా పరిణమించింది. ఆహా! అనిపించింది! సెబాసనిపించింది. వహ్వా అనిపించింది!!

ఈ నాయికా నాయక హృదయ విశ్రాంతి సౌఖ్య సామ్రాజ్య సంసృష్టి సంస్థాపన చేయవలసింది నేను కాదు. అని ఒక నిశ్చయానికి వచ్చింది సానుమతి. ఈ మహా కార్యం-ఈ బృహత్కథాభ్యుత రససన్నివేశ సౌందర్య శిల్ప సంసృష్టి, మహేంద్ర జననియే చేయవలసిందని నిర్ణయించుకొని ఆ పని తనది కాదని తెలివితేటలు కల్గి సానుమతి తప్పుకొంది. తాను ఏ పని మీద బయల్దేరి వచ్చిందో గుర్తుకు తెచ్చుకొని ఆ పని ముందు వెంటనే తొందరగా చెయ్యటానికి ఉపక్రమిస్తోంది సానుమతి. ఉపక్రమించి ఏమంటూ ఉందో వినండి.

యజ్ఞ భాగోత్సుకులైన దేవతలే ఈ పనిని నెరవేరుస్తారు. ఈ లోపుగానే ధర్మపత్ని అయిన శకుంతలను భర్త ఐన దుష్యంతుడు గౌరవించగలడని మహేంద్ర జనని ఐన అదితి చెప్పిన మాటలను నేను ఇదివరలోనే విన్నానని సానుమతి దేవతల త్రోవ కల్గి అదితి త్రోవ కల్గి తన త్రోవను తాను పోతూ ఉంది. పోతూ పోతూ తిన్నగా శకుంతల ఉన్న తావుకి త్రోవ చూసుకుంది. ఆ త్రోవ పట్టింది. శకుంతల మనస్సులో ఉన్న త్రోవల్లో శకుంతలను అలిసిపోయిన దాన్నిగా చూచి ఆ శకుంతలకు అలుపు సొలుపులు అణచడానికి పరుగు పరుగున పోతోంది.

సానుమతి అంత తొందర తొందరగా పోతూ పోతూ కూడా "ఈ విషయంలో దైవప్రవృత్తి సమయం కలుగా ఎదురు చూస్తుండడమే యుక్తమూ ధర్మమూ మంచిదిన్నీ" అని నాయికా నాయక పునస్సమాగమ సుముహూర్తానికి దేవతాయోగం మీద ఆధారపడుతోంది. ఈ దేవతా యోగానికి మానవులైన నాయికానాయకులు వేచి ఉండడంలో రసోత్కర్ష ఊహించిన సానుమతి కాళిదాసమహాకవి సార్వభౌముని సరస్వతిగా ఈరీతిగా సాక్షాత్కరించింది.

ప్రకృతి హితానికై రాజు నడవడంలో రెండు పనులు ముఖ్యాలు : ఒకటి, రాజు వితతయజ్ఞుడై దేవతలను తృప్తి పరచడం. రెండు, దేవేంద్రుడు దానికి సంతృప్తినొంది వర్షాలు కురిపించడం. ఉభయ లోకానుగ్రహ శ్లాఘనీయాలైన అన్యోన్య కృత్యాల చేత భూలోక స్వర్గలోకాలు శ్రుతి మహాన్మహీయత్వాపాదకురాలైన సరస్వతీదేవిపై ఆధారపడుతుంటుందనే భావి భావ పరిసూచనను సూచించే సానుమతి దృశ్యాదృశ్యాద్వైత సరస్వతి అయి, కాళిదాస మహాకవికి ఉపాస్యదేవత అయిందని ఈ మహేంద్ర జననికి ఇక్కడ సానుమతి ఇచ్చిన గౌరవ స్థానమే వేనోళ్ల చాటుతూ వుంది.

"జయన్తి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః"

# సమర్పణ

'కావ్యశ్రీ'

* * పాత్రలు—అనంతం, పుండరీకం, భగవంతుడు, తిరపతి, చలమయ్య.

[సుందర ప్రకృతి. అందమైన పర్ణశాల. ప్రశాంత వాతావరణం. పరిశుభ్రమైన చావడి. చావడిలో ఒక మూల కూర్చుని పుండరీకం తనలో తాను పాడుకొంటూ వుంటాడు. మీసాలు గడ్డం తెల్లగా పొడవుగా వుంటాయి. మాసిపోయి చిరిగిపోతూ వున్న కాకీచొక్కా, నిక్కరు కట్టుకొని—తలకు గుడ్డచుట్టుకొని వుంటాడు. ప్రక్కను చేతికర్రవుంటుంది. పుండరీకం గ్రుడ్డిగా వుంటాడు.]

పుండ : నరజన్మ మిక దురభిమురా!
పాజన్మ పాకార సద్గురుని గనరా!
నరజన్మ మిక దుర్లభిమురా!

[సుర్వా-షేర్వాణీ-కుచ్చు తలపాగ-మెరసిన కోరమీసంతో-బూటు టక్ టక్ మంటూ భగవంతుడు వస్తాడు]

భగ : (కటువుగా) ఎవర్రా అక్కడ?

పుండ : బాబయ్యా! (కంగారుగా కర్ర తడుము కొంటూ వుంటాడు)

భగ : (కోపంగా) ఎవరు నువ్వు?

పుండ : బాబయ్యా! (కర్రతో తడుముకొంటూ వస్తూ వుంటాడు)

భగ : ఎవరి దీయిల్లు?

పుండ : అనంతంగారిది బాబూ!

భగ : ఎవడా అనంతం!

పుండ : ఎవరో ధర్మాత్ముడు; నాకూ తెలియదు నాయనా!

భగ : చుట్టుపట్ల మనుష్యులులేని యీ నిర్జనప్రాంతంలో — యీ కొండమీద పెట్టాడేం కాపురం?

పుండ : ఏమో బాబూ! అదీ ఆయనకే తెలియాలి?

భగ : సరే! ఏంచేస్తుంటాడీ అనంతం?

పుండ : బాటసారులకు అన్నం పెడుతుంటారు బాబూ!

భగ : ఉహూ! మంచినీళ్లుకూడా దొరకని యీ అరణ్యంలో హోటలుపెట్టి బస్సు ప్రయాణీకులకు భోజనాలుపెట్టి బాగా సంపాదిస్తున్నాడన్నమాట!

పుండ : (వెటకారంగా నవ్వి) ఎంతమాటబాబయ్యా! ఎవ్వరిదగ్గరా ఒక్క కానీకూడా పుచ్చుకోరు బాబూ! గడపలో కాలుపెట్టినవాళ్ళు కడుపునిండా భోజనం చేస్తేగాని కదలనివ్వరుగదా! పుణ్యాత్ములు!

భగ : అయితే ఉట్టినే—అన్నదానం చేస్తున్నాడా?

పుండ : అవును బాబూ!

భగ : ఆలాగనే విన్నాను! అనంతం చేసే దానధర్మాలకు అంతంలేదనే విన్నాను. రోజూ వందలాది బాటసారులు భోజనం చేసిపోతుంటారటగా! అవునా?

పుండ : అవును బాబూ! అక్షరాలా నిజం!

భగ : అయితే—డబ్బు బాగా వున్నట్టుంది!

పుండ : ఏమో బాబూ! ఆ సంగతి ఆ భగవంతునికే తెలియాలి.

భగ : (కంగారుపడి సర్దుకొని) ఏమిటన్నావు?

పుండ : అవునండీ! ఆయన సంగతీ—ఆయన డబ్బు సంగతీ ఆ పరమేశ్వరుని కొక్కరికే తెలియాలి!

ధగ : ఏం? మరెవ్వరికీ తెలియదా యీయన సంగతి?

పుండ : తెలియదు బాబూ!

ధగ : నీ వ్యవహారమ్ ?

పుండ : నేనో దిక్కు లేని గ్రుడ్డివాడిని నాయనా!

ధగ : ఇక్కడెందు కుంటున్నావు?

పుండ : ఇంతకుముందు అలా అలా తిరిగి పల్లె గ్రామాల్లో బిచ్చమెత్తుకొని బ్రతికేవాడిని! నే నిక్కడకు వచ్చిన యీ వారం పదిరోజుల నుంచీ యెక్కడకూ కదలనీయకుండా నన్నీయనే పోషిస్తున్నారు బాబూ!

ధగ : ఎందుకు కలిగిందో నీ మీద అంతదయ!

పుండ : ఈ అనంతంగారికి కొంచెం వేదాంతం పిచ్చి వుందిలెండి!

ధగ : అందుకని వేదాంతం చెప్పి ఆయన్ని వల్లో వేసుకొన్నావా?

పుండ : వేదాంతం - నేను కాదు బాబూ ఆయనే చెపుతారు నేను విసుగులేకుండా వింటూ వుంటాను! అంతే!

ధగ : ఈయన యిక్కడకు వచ్చి యెంతకాలమయ్యింది?

పుండ : అయిదారు మాసాలు అవుతుందేమోనండి!

ధగ : అంతకుముందు ఎక్కడుండేవాడు?

పుండ : నాకు తెలియదయ్యా!

ధగ : ఈయనకాక యింట్లో మరెవరున్నారు:

పుండ : అమృతం అనే వంటాయన తప్ప మరెవరూ లేరండి!

ధగ : అనంతానికి సంసారం లేదా?

పుండ : సంసారమా (నవ్వి) ఆయన సన్యాసి బాబూ! రాజయోగి.

ధగ : ఉహూ! (నిట్టూర్చి) బాగానే వుంది! (ఆలోచిస్తుంటాడు)

పుండ : బాబూ!

ధగ : ఊఁ!

పుండ : ఒక కానీ పడేయ్ బాబూ!

ధగ : ఇటువంటి లక్షాధికారి యింట్లో వుండి కూడా యింకా అడుక్కోవడ మేమిటిరా?

పుండ : (నవ్వి) అలవాటు నాయనా!

ధగ : ఇంద! (అయిదు రూపాయల నోటు చేతిలో పెడతాడు)

పుండ : (రహస్యంగా కళ్లు తెరచిచూచి—మరలా మూసికొని) ఇదేమిటి బాబయ్యా కానీ అడిగితే కాగితం ముక్క చేతిలో పెట్టారు?

ధగ : (అతనివంక దీక్షగా చూచి) కాగితం! దాని విలువ అయిదు రూపాయలు!

పుండ : (ఆ కాగితాన్ని అసహ్యంగా నలుపుతూ వుంటాడు)

ధగ : (పరీక్షగా చూచి—గుర్తించి—నవ్వి—వీపు తట్టి) జాగ్రత్త!......వెళతాను! (వెళుతూ వుంటాడు)

పుండ : బాబయ్యా!

ధగ : (ఆగి) ఎందుకు?

పుండ : భోజనం చేయరా బాబూ!

ధగ : మళ్లా వస్తాను!

పుండ : ఎప్పుడయ్యా?

ధగ : రాత్రికి!

పుండ : ప్రొద్దెక్కినట్టుంది! వంటలయి పోతాయి, ఈపూట కూడా భోజనం చేయండి బాబూ!

ధగ అక్కరలేదు!

పుండ తమరు భోజనం చేయకుండా వెళితే అనంతంగారు దిగులుపడతా రండి!

ధగ ఫరవాలేదు! (వెళుతూ వుంటాడు)

పుండ బాబూ!

ధగ ఊఁ!

పుండ . మీ పేరేమిటి నాయనా?

ధగ : మరలా వచ్చి చెపుతాను! విందువుగాని సిద్ధంగా వుండు! (చరచరా వెళ్లిపోతాడు)

పుండ : బాబూ! (ముందుకు నడచి దటుక్కున తిన్నగా నిలబడి—కళ్లు తెరచి చూస్తూ—చేతిలోని అయిదు రూపాయల కాగితాన్ని నలిపి జేబులో పెట్టి—జేబులోనుంచి ఫిస్టలు తీసి చూస్తూ తనలో తాను నవ్వుతాడు)

తెరలో : పుండరీకం!

పుండ : (దటుక్కున ఫిస్టలు దాచి—యెప్పటిలా గ్రుడ్డిగా నటిస్తూ) బాబయ్యా!

[బాగా పెరిగి రింగులు తిరిగి వెనుకకు విరిగి వున్న తెల్లని జుట్టు—తెల్లని—బుంగ మీసం—పొడవు గడ్డం—పాదాల వరకూ వేలాడే బెంగాలీ లాంగ్ కోటు వేసుకొని—అనంతం వస్తాడు.]

అనం : పుండరీకం!

పుండ : బాబయ్యా!

అనం : ఎవరు వచ్చారట?

పుండ : ఎవరో బాబూ! నా కేం తెలుసు? పోనీ కన్నులున్నాయి గనుక నా యిలా ఉన్నారని చెప్పటానికి! పేరు అడిగినా చెప్పకుండా వెళ్ళిపోయారు!

అనం : ఊరు, పేరూ మన కెందుకు గానీ—భోజనం చేయకుండా యెందుకు వెళ్లనిచ్చావు?

పుండ : ఏం చేయను బాబూ—ఎంత చెప్పినా నామాట వింటేగదా! మిమ్మల్ని పిలుద్దామనుకొంటూ వుండగానే వెళ్లిపోయారు!

అనం : (నిట్టూర్చి) పుండరీకం! యీ నాటికి నా వ్రతం భంగమయ్యిందోయ్!

పుండ : (వింతగా) అదేమిటి బాబూ!

అనం : నా గుమ్మమెక్కినవాడు నాయింట భోజనం చేయకుండా వెళ్ళటానికి వీల్లేదు. ఆరు నెలల నుంచి సాగుతూవున్న యీ నా వ్రతానికీనాడు విఘ్నం కలిగింది!

పుండ : తమరు పెట్టకపోలేదు కదా బాబూ వ్రతభంగం కావటానికి! అతని కక్కర లేకపోయింది! వెళ్లిపోయాడు! అందుకు మనమేం చేస్తాం నాయనా! అయినా మరలా వస్తానని చెప్పారు లేవయ్యా!

అనం : మరలా వస్తానన్నారా?

పుండ : అవును బాబూ.

అనం : ఎప్పుడు?

పుండ : రాత్రికి.

అనం : (నిట్టూర్చి) రానివ్వు. కానీ యీపూట భోజనం రాత్రికి తినగలడా? యీపూట ఆకలిబాధ లేకుండా మనగలడా? పుండరీకం!

పుండ : బాబయ్యా!

అనం : పాత పాపాన్ని పుణ్యంచేసి పోగొట్టుకోగలమంటావా? పాపపుణ్యాలు రెండూ కూడా—దేనికది విడివిడిగా—విధిగా—అనుభవించాలేమో అనుకొంటానయ్యా!

పుండ : అంతే నంటారా?

అనం : లేకపోతే—ఒక వ్యక్తి తాను చేసుకొన్న దానిలో మిగిలిన పాపమో పుణ్యమో—యేదో ఒకటి కాకుండా—సుఖదుఃఖాల రూపంలో రెండూ యెందుకు అనుభవించాలి చెప్పు! మాసినబట్టను ఉతికి మాలిన్యాన్ని పోగొట్టగలం గాని తెగిన దారాలను తిరిగి అతికించలేం కదా!

పుండ : అవును బాబూ!

అనం : ఎంత వెలుతురున్నా ఆ వెలుగు ప్రక్కనే నీడ కూడా వుంటుంది.

పుండ : అవును బాబూ! నీడ లేకుండా వెలుగుంటుందా?

అనం : ఆ నీడను—ఆ చీకటిని లేకుండా చేయగలమా?

పుండ : ఎలా వీలుపడుతుంది నాయనా?

అనం : వీలవుతుంది. కానీ నీడను లేకుండా చేయటానికి ఆ వెలుగునుకూడా లేకుండా చేయాలి

పుండ : అప్పుడేముంటుందండీ?

అనం : అది తెలిస్తే బ్రతుకే సమర్పణమవుతుంది! దానికోసమే యీ తపనంతా!

పుండ : అయ్యా! ఇలా అడుగుతున్నానని మరేం అనుకోకండి! మీ రెవరో - యెక్కడినుంచి వచ్చారో - యెందుకిలా చేస్తున్నారో యెవరికీ తెలియదు కదా! నేను వచ్చిన యీ పది రోజులలోనూ మీ దానాలు పదివేలుంటాయేమో; రోజూ వందమంది తక్కువ భోజనం చేయటం లేదు కదా! ఏమిటి బాబూ యీ వ్రతం?

అనం : (బాధగా) ఏం చెప్పమంటావు పుండరీకం! గొంగళీ పురుగు సీతాకోకచిలుక అవుతుంది! కాని తన రెక్కల అందాన్ని చూసుకొని,

యెంత ప్రయత్నిస్తేమాత్రం - తన పూర్వ జన్మను మరిచిపోగలదంటావా?

పుండ : అబ్బే! యెలా మరిచిపోతుంది బాబూ! అంత అసహ్యమైన బ్రతుకు మరిచిపోవాలన్నా మరుపు రావద్దూ!

అనం : అలాగే - యెండి - వాడి - రేకలు రాలిపోతూ వున్న గులాబి పువ్వు - ఒకనాటి తన నవయౌవన వసంత సౌభాగ్యాన్ని మరిచిపోలేదు.

పుండ : అవును బాబూ! మరిచిపోలేదు!

అనం : అదే! ఆమరిచిపోలేకపోవట మనేదే సంస్కారం! ఏ పూర్వజన్మల సంస్కారమో నా జీవితాన్ని నరక స్వర్గాలు రెండింటిలోనూ నడిపిస్తూవుంది.

పుండ : ఏమిటి బాబూ!

అనం : మానవుడుగా పుట్టి మానవత్వాన్ని మరిచి పశుప్రవృత్తితో పరమ నికృష్టస్థితిలో వున్న నాకు ఒక మహనీయుడు ఆత్మప్రబోధము చేసి నా జీవనమార్గాన్ని చక్కదిద్దాడు. దారి మారాను. అంధకారంనుంచి బయటపడి వెలుగులోకి వచ్చాను.

పుండ : మీరు మారిపోయారా? ఎలాగ నాయనా?

అనం : ఆమహనీయుని హృదయంలోని నిష్కల్మషమైన ప్రేమ, నిర్వ్యాజమైన ప్రేమ గంగా ప్రవాహంలాగ నన్ను ముంచి యెత్తింది! అగ్నిజ్వాలలులాగ దహించి వేసింది! పుండరీకం—

పుండ : బాబూ!

అనం : నిర్మలమైన ప్రేమతో—ప్రతిఫలం కోరని త్యాగంతో ఎంతటి కఠిన కర్కశ హృదయాన్నయినా నవనీతంగా మార్చవచ్చు కదూ!

పుండ : ఏమో బాబూ!

అనం : అవును. నాకు తెలుసు. నిర్మల ప్రేమ త్యాగాలు ప్రజ్వలించే ఆమహాకాంతిముందు చీకట్లు మసలలేవు. ఆ మహనీయుని కన్నులలో వెలిగే ఆ మహాతేజాన్ని-నాహృదయ తమస్సును తొలగించిన ఆదిత్యతేజాన్ని- నేనెన్నటికీ మరువలేనయ్యా!

పుండ : ఇంతకూ యెవరుబాబూ ఆ మహనీయుడు?

అనం : అందుకే విచారం పుండరీకం! ఆయన్ని కలుసుకోవటంకోసమే యీ నా తపస్సంతా! ఒక విపరీత విషమపరిస్థితిలో ఆయన నా కన్ను తెరపించాడు - ఈ నా నూతన జీవితాన్ని ప్రసాదించాడు! అంతే! మళ్లా కనుపించలేదయ్యా!

పుండ : పేరైనా తెలుసా?

అనం : తెలియదు! ఆ విచిత్ర సంఘటనలో ఆయన ముందు దోషిగా నిలబడ్డ నేను ఆయనమాట వినటంతప్ప పెదవి కదపలేకపోయాను. ఏ వ్యక్తికైతే తీరని మహాద్రోహం చేసి ఆ వ్యక్తి నుంచి తప్పించుకొని పారిపోదామని ప్రయత్నించానో ఆ వ్యక్తినే-ఆ వ్యక్తి అని తెలియకుండా శరణు వేడాను!

పుండ : ఏమిటి బాబూ మీరంటున్నది!

అనం : అవును పుండరీకం! ఒకనికి అపకారం చేసి అతడని తెలియక అతని మరుగుకే పరుగెత్తాను,

పుండ : ఏమిటి బాబూ మీరు చేసిన అపకారం?

అనం : అదొక భయంకర సంఘటన లేవయ్యా!

పుండ : ఆయ నేమన్నాడు మరి?

అనం : మనకు కలిగే సుఖదుఃఖాలకు పూర్తిగా మన మనసే కారణం! ఎవరో పైవాళ్లవల్ల కలిగాయనుకోవటం పొరపాటు" అన్నాడు.

పుండ : మిమ్మల్నేమీ చేయలేదా?

అనం : చేయకేం చేశాడు!

పుండ : ఏంచేశాడు?

అనం : అపకారికి ఉపకారం చేశాడు. నన్ను క్షమించి సన్మానించి కడుపునిండా భోజనం పెట్టి పంపించాడు. నరకంనుంచి తప్పించి స్వర్గానికి దారిచూపించాడు. ఆయన ప్రసాదించిన యీ నూతన జీవితాన్ని ఆయనకే అంకితం చేశాను! నా సర్వస్వాన్నీ ఆయన పాదాలమీద సమర్పణ చేదామని నిరీక్షిస్తున్నాను. ఇంతవరకూ ఆయన దర్శనం కానే లేదు! పుండరీకం!

పుండ : (ఆలోచిస్తూ వుంటాడు)

అనం : (కొంచెం గట్టిగా) పుండరీకం!

పుండ : (త్రుళ్లిపడి) బాబూ—!

అనం : ఏమిటి ఆలోచిస్తున్నావు?

పుండ : ఎంత విచిత్రంగావుంది బాబూ!

అనం : అవును! ఇట్టి విచిత్రాలద్వారానే దేవుడనే ఒక మానవాతీతమైన మహాశక్తి వుందని ఋజువవుతూవుంది. నా జీవితంలో దైవాన్ని తలచిన ప్రథమక్షణం అదే! పుట్టిన ప్రతి ప్రాణీ యేదో ఒక సమయంలో—చనిపోయే లోపుగా—ఒక్కసారైనా ఆ భగవంతుని గురించి విధిగా ఆలోచించితీరుతుంది అందుకనే భగవంతుడనే శక్తి వుందని మనం నమ్ముతున్నాం!

పుండ : (బరువుగా నిట్టూర్చి) అయ్యా! తమరు భగవంతుని యెరుగుదురా?

అనం : (నవ్వి) పిచ్చివాడవయ్యా వేమిటి పుండరీకం!

పుండ : (అర్థం కానట్లు) ఏం బాబయ్యా?

అనం : భగవంతుణ్ణి పూర్తిగా యెరిగినవాళ్లూ లేరు—అసలు యెరుగనివాళ్ళూ లేరు! నన్నేమని చెప్పమంటావు?

పుండ : (నవ్వి) అదికాదు బాబయ్యా! నేననేది మీ రనుకొనే భగవంతునిగురించి కాదు ఈ ప్రాంతంలో గజదొంగ అని పేరు మోసి ప్రభుత్వానికి పట్టుబడకుండా తప్పించుకొని తిరుగుతూవున్న ఒక రాక్షసుడున్నాడు. వాడి పేరు కూడా భగవంతుడే!

అనం : అంతే లేవయ్యా పేరులో ఏముంది!

పుండ : అతని పేరు వింటేనే చాలు ప్రజలకే కాదు ప్రభుత్వానికి కూడా హడలే! ఎన్ని దొంగతనాలు—ఎన్ని హత్యలు—ఎన్ని లూటీలు! అబ్బ! వినటానికికూడా భయమేస్తుంది! బ్రతికివుండగానే కాల్చి చంపించేవాడట! ఒక కాలు ఒక చేయి తెగనరికి పొమ్మనేవాడట. పసిపాపలను చంపి పచ్చినెత్తురు త్రాగేవాడట!

అనం : అవును! మానవుడు చేయలేనిదేముంది! పానకం త్రాగేవాళ్లు కొందరు-పచ్చినెత్తురు త్రాగేవాళ్లు కొందరు! అది వారి మానసిక ప్రవృత్తిమీద నాధారపడివుంటుంది. మేఘం నుంచి చల్లని నీరూ వస్తుంది—దహించే పిడుగులూ వస్తాయి! అది పరిస్థితుల ప్రభావం!

పుండ : ఎంత దుర్మార్గుడైనా అతనిదగ్గర ఒక్క సుగుణం మాత్రం ఉండేనట బాబూ!

అనం : ఏమిటది?

పుండ : ప్రాణం పోయినా ఆడినమాట తప్పేవాడు కాదట! మంచి అయినా చెడ్డయినా అతనొకసారి అంటేచాలు అలా జరిగితీరవలసిందేనట! పెడతానంటే పెట్టటం కొడతానంటే కొట్టటమేనట!

అనం : అంతే! ఒక్కొక్కమాట ప్రాణాలు తీస్తుంది-ఒక్కొక్కమాట ప్రాణాలిస్తుంది!

పుండ : ఆడినమాట అంత ఖచ్చితముగా జరుపుకొనే వాడు మరొకడు లేడంటారు బాబూ!

అనం : ఈ సుగుణం ఒక్కటి చాలయ్యా అతని జీవితాన్ని పునీతం చేయటానికి!

పుండ : పైగా అతనికి సైన్సు బాగా తెలుసట! రకరకాల రసాయనిక ద్రావకాలుచేసి తలుపూ యినుపపెట్టెలూ చప్పుడుకాకుండా బద్దలు కొట్టేవాడట! ఎరుగుదురా ఆ భగవంతుణ్ణి!

అనం : పేరు విన్నాను! ఎప్పుడూ చూడలేదు.

పుండ : అంతే బాబూ! మన కెలా కనుపిస్తాడు! కానీ నేనొకసారి చూశానండి! అప్పటికి నేనింకా కానిస్టేబిలుగా పనిచేస్తున్నాను!

అనం : ఏమిటి—నువ్వు పోలీసు డిపార్టుమెంటులో పనిచేశావా?

పుండ : అవును బాబూ! మా వాళ్లు ఎలాపట్టుకొన్నారో తీసుకువచ్చారు. చూడటానికి మహారాజులా వుంటాడు. ఎంత గంభీరంగా మాట్లాడుతాడు బాబూ!

అనం : మానవుడు సహజంగా మంచివాడు. ఉన్నతుడు. కాని పరిస్థితుల ప్రభావంవల్ల కాలంమార్పువల్ల మరోలా మారుతూ వుంటాడు! ఎంతమారినప్పటికి అతనికి పుట్టుకతోవచ్చిన సంస్కారంమాత్రం చావదు. సామాజిక వాతావరణం అనుకూలించి

నప్పుడు—ఎప్పుడో ఒకప్పుడా సంస్కారం విజృంభించి బయటపడుతుంది.

**పుండ** : సంస్కార మేమోగాని భగవంతుడుమాత్రం బయటపడ్డాడు! వెళ్ళిపోతాను అన్నాడు. వెళ్ళిపోయాడు. ఎంతసులువుగా పట్టుబడ్డాడో అంతసులువుగానూ తప్పించుకుపోయాడు.

**అనం** : పట్టుబడి తప్పించుకోవటం మూలంగానే అతని గొప్పతనం మరింత పెరుగుతుంది! మంచిగానీ — చెడుగానీ— ఏకాగ్రతవల్ల మానవాతీత మవుతుంది!

**పుండ** : అతనిని విడిచిపెట్టాననే ప్రభుత్వం నన్ను ఉద్యోగంనుంచి తొలగించింది! తర్వాత ఒక ఇనపకార్ఖానాలో పనిచేస్తూవుండగా కళ్లుపోయాయి. దానితో యీ అవతారం యెత్తవలసివచ్చింది నాయనా!

**అనం** : అంతేనయ్యా! జీవితంలో వసంతాలూ వుంటాయి ముసురుదినాలూవుంటాయి.

**పుండ** : బాబూ! నాకేదో అనుమానంగా వుంది బాబూ!

**అనం** : ఏమిటది పుండరీకం?

**పుండ** : ఇందాకవచ్చి భోజనం చేయకుండా వెళ్ళిపోయినాయన కంఠం — ఆ భగవంతుని కంఠంలా వున్నట్లు గుర్తుబాబూ!

**అనం:** : (నవ్వి) దొంగ మనయింటికి పట్టపగలు వచ్చాడా

**పుండ** : ఎందుకు రాకూడదు బాబూ! ఆ గజదొంగకు రాత్రేమిటి? పగలేమిటి? ఆయనయొక్కడ దొంగతనం చేసినా యిన్నిగంటలకు చేస్తాను అని ముందుగానే చెప్పి ఖచ్చితంగా అన్నిగంటలకే చేసేవాడట. అటువంటివాడు పగలైతేమాత్రం యెందుకు రాకూడదు బాబూ!

**అనం** : అవును. రావచ్చు. అంతకంటే మహాభాగ్య మేముంది. రానియ్. పరమేశ్వరుడు అనేక రూపాల్లో రావచ్చు! ఒక గ్రుడ్డివాడి రూపంలో వచ్చినట్లుగానే ఒక గజదొంగ రూపంలోకూడా రావచ్చు. వచ్చేవాడు మాత్రం భగవంతుడే!

**పుండ** : అలాగని భగవంతుడువచ్చి అంతా దోచుకుపోతూవుంటే చూస్తూ వూరుకొంటారా?

**అనం** : భగవంతుడు దోచుకోవటానికికాదు ఇవ్వటానికి వస్తాడు. అతనికి యివ్వటమేకాని పుచ్చుకోవటం తెలియదు? అందుకనే భగవంతుడయ్యాడు. ఆ త్యాగమే, ఆ దానమే, ఆ ఔదార్యమే మానవుని భగవంతుని చేస్తుంది!

**పుండ** : ఏమో బాబూ మీ వేదాంతం నాకెలా తెలుస్తుంది బాబూ! అలా బయటకువెళ్లివస్తాను నాయనా! (వెళ్లబోతాడు)

**అనం** : పుండరీకం!

**పుండ** (ఆగి) బాబూ!

**అనం** ముందు భోజనం కానియ్! తరువాత నీ యిష్టం వచ్చినచోటుకు వెళుదువుగాని.

**పుండ** (నవ్వి) అలాగేబాబూ!

**అనం** రా! భోజనం చేదువుగాని. (ఇద్దరూ లోనికి వెళతారు)

**తెరలో** అయ్యా!.........ఎవరయ్యా లోపల?

**అనం** (వచ్చి) ఎవరు నాయనా? లోపలికి దయచేయండి!

[పంచ - లాల్చీ - కండువా-కళ్లజోడు- అడు చెప్పులతో తిరపతి వస్తాడు. చెంపలు నెరస్తూవున్న చిన్నజుట్టు వుంటుంది]

**అనం** : నమస్కారం! రండి!

**తిర** నమస్కారం!

**అనం** (నిదానించి) ఓ! మీరా! క్షేమంగా వున్నారా? దైవానుగ్రహం!

**తిర** (ఆశ్చర్యంగా) నన్నెరుగుదురా?

**అనం** ఎండలో వచ్చారు—మంచినీళ్లు కావాలా?

**తిర** అక్కరలేదు! కానీ—నన్నెలా యెరుగుదురు

**అనం** మీది వారపేట కదూ!

**తిర** అవును.

**అనం** అప్పట్లో మీరు కిళ్లీకొట్టు నడిపేవారు.

**తిర** అవును.

**అనం** మీ పేరు తిరపతికదూ!

**తిర** : అవును. తమనామం—?

అనం : తర్వాత మాట్లాడుదాం! ముందు లోపలికి వెళ్లి భోజనంచేసి విశ్రాంతి తీసికోండి! (గట్టిగా) పుండరీకం!

పుండ : (లోపలనుంచి) బాబూ!

అనం : చూడు! వీరికిభోజనం వడ్డించమని అమ్మ తంతో చెప్పు! (తిరపతితో) పదండి భోజనం చేదురుగాని (లోనికి పంపించి ఆలోచిస్తూ తిరిగివస్తాడు)

పుండ : (వెనకాలే వస్తాడు)

అనం : పుండరీకం!

పుండ : అయ్యా!

అనం : చాలా ఆనందంగా వుందోయ్!

పుండ : ఎందుకు బాబూ!

అనం : చిన్ననాటి స్నేహితుని కలుసుకొన్నానోయ్!

పుండ : అవును బాబూ స్నేహితుని మించిన బంధు వెవరుంటారు ?

అనం : పుండరీకం!

పుండ : బాబూ!

అనం : సముద్రపు కెరటాలు పెరుగుతాయి—విరుగుతాయి. మరలా పెరుగుతాయి విరుగుతాయి! ఈ చర్విత చర్వణమైన నిత్య భ్రమణమే కదా ఆకెరటాల బ్రతుకు!

పుండ : అవునుబాబూ!

అనం : మానవ జీవితంకూడా అంతే!

పుండ : అంతేబాబూ!

అనం : ఒక్కొక్కప్పుడు ఓపలనుమ్ముంచి వేలాది నిండుప్రాణాలను పొట్టను బెట్టుకొనగలిగిన అభయంకర కెరటం—మరొకప్పుడు రత్నాకరగర్భంలోని నవరత్నాలుతెచ్చి మానవుని పాదాలకు నీరాజనాలిచ్చే అబల సౌజన్య స్నేహార్ద్రమైన కెరటం—నీటి ముద్ద! వట్టి నీటిముద్ద! మరుక్షణంలో కరిగి తిరిగి జలరాశిజలంలో కలసిపోయే నీటిముద్ద!

పుండ : ఎంతెంతపనిచేసినా కెరటం అణగిపోకుండా నిలబడ లేదులెండి!

అనం : ఈ శరీరంకూడా అటువంటిదే! ఉన్నన్నాళ్లు మంచివో — చెడ్డవో—యెంతలేసి కార్యాలుచేసినా ఒకనాడు నశించిపోవలసిందే!

పుండ : యథార్థమే బాబూ!

అనం : అందుకనే యీ శరీరం వున్నన్నినాళ్ళు - యిది వున్నందుకు - ఇతరులకు ఉపకారం చేయాలి.

పుండ : (చిన్నగా నవ్వుతాడు)

అనం : బయటను వంటెద్దు బళ్ళవాళ్లున్నట్టున్నారు ఒకబండి కట్టించు! మా స్నేహితుని కారు దగ్గరకు పంపించాలి!

పుండ : అలాగే బాబూ! (బయటకు వెళతాడు)

అనం : (లోపలకు వెళ్లి తిరపతితోకలసి తిరిగివచ్చి ఎన్నాళ్ళకు ఎన్నాళ్లకు కనుపించారు. నాకు చాలా సంతోషంగా వుంది.

తిర : నాకంతా అయోమయంగా వుంది.

అనం : ఎందుకని?

తిర : మీ ప్రసన్నమైన భోజనమే ఉక్కిరిబిక్కిరి చేస్తూవుంటే - పైగా యీ ప్రేమాదరణలు కూడా యెలా భరించటం!

అనం : మీ పూర్వస్నేహితునివల్ల కలిగిన యీ మాత్రం శ్రమను సహించలేరా?

తిర : బాగుంది. (నవ్వి) ఇంతకూ నన్నెలా యెరుగుదురో చెప్పారు కాదు.

అనం : ఇలా మరిచిపోతా రనుకోలేదండి తిరపతి గారూ!

తిర : మిమ్మల్ని మరిచిపోవటమనేది నిజమే అయితే అలా జరిగినందుకు మన్నించండి!

అనం : (నిట్టూర్చి) నన్ను మొట్టమొదటిసారిగా పాని గుమ్మ మెక్కించింది మీరే కదూ!

తిర : (తెల్లబోయి) నా కర్థం కావటంలేదు.

అనం : నాదగ్గర నాలుగుడబ్బులు మసలే ఆ నాజీవితపు తొలిరోజులలో మొదట సరదాగా అంటూ తాయారుఇంటికి తీసుకొని వెళ్ళి ఆ పొరపాటును అలవాటుగా మార్చింది తమరే కదూ!

తిర : (అదోలా చూచి) నేనుకాదు.

అనం : ఇప్పుడేమోగాని పాతిక సంవత్సరాల క్రితం తమరు కల్లీకొట్టు వ్యాపారంతో

బాటు కమీషన్ బిజినెస్ కూడా చేసేవారు కదూ!

తిర : ఏం కమీషన్!

అనం : విటులను తెచ్చినందుకు సానిదగ్గర పుచ్చుకొనే కమీషన్!

తిర : (కోపంగా) అదంతా మీ కనవసరం! నేను మాత్రం మిమ్మల్ని యెరుగను.

అనం : (నవ్వి) యెరుగననకండి మరచిపోయా ననండి

తిర : చెప్పండి మీ రెవరో!

అనం : ఫ్రెంచి వస్తువుల దొంగవ్యాపారి-అనంతం-మరిచిపోయారా?

తిర : (చింతగా) అనంతమా?

అనం : అవును. యానాంలో మకాంపెట్టి - రహస్యంగా ఫ్రెంచి వస్తువులు తెప్పించి - దొంగ వ్యాపారం చేసే అనంతం!

తిర : (ఆలోచించి) అవునవును! జ్ఞాపకం వచ్చింది.

అనం నేనే ఆ అనంతాన్ని!

తిర (నమ్మనట్లు) ఏమిటి - మీరా?

అనం అవును నేనే!

తిర సానికొంపలు మరిగి తప్పత్రాగి తందనాలాడే అనంతం మీరా?

అనం నేనే! తమరు త్రాగుడు మానేసినట్లున్నారు.

తిర (మూస్తూ వూరుకొంటాడు)

అనం అవునులే పాతికేళ్ళ పచ్చియౌవనంలో వున్న అలవాటులన్నీ యీ ముసలితనంలో యెలా వుంటాయి! వేషం బాగా మారిపోయింది! బతుకు తెరువు కూడా మార్చుకొన్నారా?

తిర : (ముఖం మరో ప్రక్కకు త్రిప్పుకొంటాడు)

అనం : అయినా అదంతా పాతికసంవత్సరాల క్రితం మాట.

తిర : అయినా మీరే ఆ అనంతం అని నమ్మలేకపోతున్నాను!

అనం : మీరు నమ్మినా నమ్మకపోయినా సత్యం సత్యంగానే వుంటుంది. అసత్యం కాలేదు.

తిర : అటువంటి వ్యభిచారి - త్రాగుబోతు - దొంగ వ్యాపారి అయిన అనంతం - యింత ధర్మాత్ముడు — శాంతమూర్తి — సత్యవంతుడు అయిన అనంతంగా మారటం యెలా జరుగుతుందీ అని!

అనం : ఏం? ఎందుకు జరగదు? కిరాతుడు వాల్మీకి మహర్షి కాలేదా?

తిర : ఆయాన్ను దైవం మార్చాడు.

అనం : అలాగే ఒకనాటి దొంగవ్యాపారి అనంతాన్ని మీరు త్రాగుబోతు—వ్యభిచారిగా మార్చారు! అవునా! త్రాగుబోతు - వ్యభిచారి అయిన అనంతాన్ని ఒక మహనీయుడు తిరిగి మానవునిగా మార్చాడు.

తిర : ఎవరతను?

అనం : భగవంతుడు!

తిర : (కంగారుగా - భయంగా) భగవంతుడా?

అనం : ఏమిటాభయం!

తిర : భగవంతు డంటుంటేను—

అనం : అవును—

తిర : వాడు గజదొంగ - పచ్చిరౌడీ - హంతకుడు—

అనం : నా ఉద్దేశ్యం - ప్రేమించటమే గాని ద్వేషించట మెరుగని, యివ్వటమే గాని తీసికోవట మెరుగని, క్షమించటమే గాని శిక్షించట మెరుగని దైవం అని. అంతేగాని మీ రనుకొనే దొంగ అనికాదు.

తిర : (నిట్టూర్చి) అంతేకదా!

అనం : దేన్నయినా ముందుగానే చెడ్డగా యెందుకనుకోవాలి!

తిర : అయితే మీకు భగవంతుడు కనుపించాడా?

అనం : ఆ! కనుపించాడు!

తిర : ఎప్పుడు?

అనం : పది సంవత్సరాలక్రితం!

తిర : ఎక్కడ?

అనం : ఒక మానవుని హృదయంలో!

తిర : అంటే?

అనం : దేవుడంటే యెవరు? ఎక్కడనుంచి దిగి వస్తాడు? విషం పెట్టినవాడికి అమృతం యిచ్చినవాడే భగవంతుడు. అపకారం చేసినవానికి ఉపకారం చేసినవాడే భగవం

తుడు. మానవుని హృదయంలోగల క్షమ-ప్రేమ-త్యాగమే భగవంతుడు.

తిర : బావుంది మీ వేదాంతం !

అనం : వేదాంతం కావచ్చు కాకపోవచ్చు. కాని నగ్నసత్యం !

తిర : మానవుడే భగవంతుడైతే యిక లేనిదేముంది!

అనం : కాదంటారా ? రాక్షసులు-దేవతలు మనలో కాక మరెక్కడున్నారు ? ఇలా అంటున్నానని మరోలా అనుకోకండి ! మనిషిని పశువుగా మార్చే మీలాంటి రాక్షసులున్నప్పుడు-పశువును మనిషిగా మార్చే భగవంతులు మాత్రం యెందుకుండరు ?

తిర : (ముఖం చిట్లించుకొని) ఇక నే వెళతాను. బస్సుకు టయిముయ్యేటట్లుంది.

అనం : ఇంతకూ తమ రిప్పుడేం చేస్తున్నారు ?

తిర : (ఇష్టం లేనట్లుగా) యేదో లెండి !

అనం : చెప్పండి ఫరవాలేదు ! నా దగ్గర దాపరిక మెందుకు !

తిర : (అదోలా చూచి) సారా వ్యాపారం !

అనం : (బాధగా నిట్టూర్చి) హు ! దొంగసారా వ్యాపారం! విచక్షణలేని అమాయికులకు నరకానికి దారి చూపిస్తున్నారా ?

తిర : (మాట్లాడడు)

అనం : బ్రతకటానికి డబ్బుకావాలి కాబట్టి యిలా చేస్తున్నా నంటారు !

తిర : అవును.

అనం : దానికిమాత్రం మంచి మార్గాలు లేవంటారా ?

తిర : సరేలెండి ! ఇక నే వెళతాను.

అనం : ఉండండి వెళుదురుగాని బండి వస్తుంది !

తిర : ఏమిటి యీ ఆదరణ !

అనం : ఒక్క క్షణం ఆగండి ! ఇప్పుడే వస్తాను (లోనికి వెళ్ళును)

పుండ : (వచ్చి) బాబయ్యా !

తిర : ఎందుకురా ?

పుండ : బండి తయారుగా వుంది బాబూ !

తిర : సరే వుండనీయ్ ! (దగ్గరకు వచ్చి) ఒరే అబ్బీ !

పుండ : ఏం బాబూ ?

తిర : ఈయన కీడబ్బంతా యెలా వచ్చిందిరా ?

పుండ : ఆయనకే బాబూ !

తిర : నీ ముఖం ! వీడిసంగతి వాడు తెలియదేమిటి !

పుండ : ఈయన్ని మీ రెరుగుదురేమిటి బాబూ !

తిర : అనంతా నీ కెందుకుగానీ-యీ డబ్బంతా యెలా వచ్చిందో నీకేమైనా తెలిస్తే చెప్పు !

పుండ : గుర్రపు పందాల్లో వచ్చిందేమోనండి !

తిర : కరన్సీ గాని ప్రింటు చేస్తున్నాడేమో !

పుండ : ఆయన అటువంటివారు కాదండి! వేదాంతి!

తిర : కబుర్లకేం లే! నేనూ చెపుతాను సవాలక్ష!

పుండ : ఈ అనంతంగారికి చుట్టాలు పక్కాలు యెవరు లేరేమిటండీ ?

తిర : ఎవరూ లేరు - ఏకాకి (ఆలోచించి చటుక్కున జ్ఞాపకము వచ్చినట్లుగా) ఆఁ ! ఒరేయ్ అబ్బీ—!

పుండ : ఏమిటి బాబూ ?

తిర : యీయన దగ్గర - ఒకావిడ - రాజమ్మ అని-వుండాలి యిప్పుడుందా ?

పుండ : ఎవరండావిడ ? అనంతంగారి భార్యా ?

తిర : భార్యకాదురా ఒక లక్షాధికారిణి ! వెనుకా ముందూ యెవరూ లేని ఒక బాలవితంతువు! మావూరే! ఇరవై సంవత్సరాలక్రితం లేవదీసుకొని యెక్కడికో వెళ్ళిపోయాడు ! నాటికి నేటికి యిప్పుడు కనుపించాడు ! ఇప్పుడిక్కడుందా ఆవిడ ?

పుండ : ఇక్కడెవరూ ఆడవారు లేరు బాబూ !

తిర : అవున్లే యీ కాటాకు కొంపలో యెలా వుంటుంది ! యెక్కడో దూరంగా యే మేడలోనో పెట్టివుంటాడు !

పుండ : మనదేవుడు బాబూ !

తిర : మాట్లాడకు ! ఆయన వస్తున్నాడు !

[అనంతం వస్తాడు]

అనం : (నోట్లుకట్ట తిరపతి చేతిలో పెట్టి) ఇది ఉంచండి !

తిర : (ఆశ్చర్యంగా) యేమిటిది ?

అనం : మంచి చెడ్డలను రెండింటినీ చేయగల సాధనం—ధనం !

# సమర్పణ

తిర : అయితే ? యెందుకిది ?

అనం : దీనికోసమే కదా నన్ను మొట్టమొదట యీ వర్తకంలో ప్రవేశపెట్టారు! ఈ డబ్బుకోసమే కదా నేటికీ అమాయక జనాన్ని తప్పుడు దారి పట్టిస్తున్నారు!

తిర : (అర్థం కానట్లుగా) అందుకని—?

అనం : అందుకనే మీ కానవాన్ని పుష్కలంగా యిస్తున్నాను. ఏ డబ్బువల్ల నేనా కాలంలో అంత నీచకార్యాలు చేశానో ఆ డబ్బువల్లనే యీనాడంత మంచికార్యాలు చేయగలుగుతున్నాను. ధనం చెడ్డగానే కాదు — మంచిగాకూడా ఉపయోగపడుతుంది! మంచిచెడ్డల ఉపయోగానికి కారణం మన మనస్సు! అంతేగాని ధనంకాదు; ఈ పదివేలు పెట్టి న్యాయమైన వ్యాపారం చేసి బ్రతకండి! ధనాన్నీ—విజ్ఞానాన్నీ—మంచిగా—సవ్యంగా వినియోగించటానికి ప్రయత్నించండి! ప్రజలను తప్పుడు మార్గాలకు త్రిప్పకండి! వెళ్లిరండి! (లోనికి వెళ్ళిపోతాడు.)

తిర : (అతనివైపు అలాగే దీక్షగా చూస్తూ వుంటాడు.)

పుండ : (దగ్గరకువచ్చి) బాబూ!

తిర : (ఇటుతిరిగి) ఎందుకురా ?

పుండ : డబ్బు శాశ్వతం కాదు బాబూ!

తిర : జీవితమే శాశ్వతంకానప్పుడిక డబ్బుమాట వేరే చెప్పాలా నాయనా ?

పుండ : ఒక్క కానీ యిప్పించు బాబూ!

తిర : ఏడిశావులే! (గబగబా బయటకు వెళ్లిపోతాడు.)

పుండ : (గట్టిగా నవ్వుతాడు)

[అనంతం వస్తాడు]

అనం : పుండరీకం!

పుండ : బాబూ!

అనం : ఎందుకు నవ్వుతున్నావు ?

పుండ : ఏంలేదు బాబూ!

అనం : ఆ 'యేం లేదు" లోనే "యేదో" వుంది!

పుండ : ఏముంది బాబూ ?

అనం : అది తెలిస్తే యింతరభస యెందుకు ?

పుండ : నిజమే బాబూ!

అనం : ఏమిటా నిజం!

పుండ : తెలియక బాబూ యీ అవస్థ అంతాను!

అనం : పుండరీకం!

పుండ : బాబయ్యా!

అనం : ఆవు గడ్డితిని పాలిస్తుంది—పాము పాలు త్రాగి విషం కక్కుతుంది!

పుండ : అది పుట్టుకతో వచ్చిన గుణం బాబూ!

అనం : అందుకనే ఆ పామును ద్వేషించకూడదు! పాలిచ్చినందుకు ఆవును ప్రేమించవద్దు! కాని విషం కక్కుతుందికదా అని పామును ద్వేషించకూడదు! పాము పాలివ్వలేదు నిజమే! ఆవు విషాన్ని యివ్వగలదా ?

పుండ : విషం మనకెందుకు బాబూ ?

అనం : నీకూ నాకూ అక్కరలేకపోవచ్చు! కానీ కొన్నికొన్ని రోగాలకు కొన్నికొన్ని మందుల్లో విషంకూడా అవసరముంటుంది! ఇంతకూ చెప్పేదేమిటంటే వస్తువుయొక్క మంచిచెడ్డలు వస్తువుయొక్క స్వరూప స్వభావాలనుబట్టి కాకుండా వాటిని ఉపయోగించే మానవుని మానసిక—నైతిక—విలువలను బట్టి వుంటుంది!

పుండ : బాబూ! ప్రొద్దు తిరిగిపట్టుంది. భోజనాలకు వచ్చేవారెవరూ లేరనుకొంటాను; ప్రొద్దుటి పూట బస్సులన్నీ వెళ్ళిపోయాయి; ఇక మీరు భోజనం చేయండి బాబూ!

అనం : ఆయన తిరిగివచ్చి భోజనం చేసేవరకూ నేను భోజనం చేయలేనయ్యా!

పుండ : ఎవరు బాబూ ?

అనం : ప్రొద్దుటవచ్చి భోజనం చేయకుండా వెళ్ళిపోయినాయన.

పుండ : అదేమిటి బాబూ! ఆయన రాత్రికిగాని రారు కదా!

అనం : అయినా సరే! అసలు రాకపోయినా సరే! ఆయన వచ్చేవరకూ నేనిలా యెదురుచూడవలసిందే!

పుండ : అయితే కాస్సేపు లోపల కూర్చోండి బాబూ! నేనలా బయటకు వెళ్ళివస్తాను!

అనం : (ఆలోచించి) సరే వెళ్ళిరా! (లోనికి వెళతాడు)

పుండ : (దీనిగా నిలుచుని—ఆలోచించి—గబగబా బయటకు వెళ్ళిపోతాడు)

[రెండుక్షణాలు తర్వాత — సైకిలుకట్టు పంచ —చొక్కా—కోటు— కంఠువా- కళ్ళజోడు — బూటుతో — దిక్కులు చూస్తూ—మెల్లగా చలమయ్య వస్తాడు నెరుస్తూ నెరుస్తూవున్న వెనుకకు దువ్విన పెద్దజుట్టు—ఫ్రెంచికట్ మీసం వుంటాయి]

చల : (లోనికి చూచి) ఎవరండీ లోపల? (కొంచెం గొంతెంగట్టిగా) ఎవరండీలోపల?

అనం : (వచ్చి—చూచి — గుర్తించి—నవ్వుతూ) ఓహో! మీరా! దయచేయండి! చిరకాల దర్శనం!

చల : (ఆశ్చర్యంగా) యేమిటిది?

అనం ఏది?

చల నన్ను మీరెరుగుదురా?

అనం నన్ను మీరు మరచిపోయారా?

చల హాస్యాలాడకండి!

అనం తమరు అబద్ధాలాడకండి!

చల విచిత్రంగా మాట్లాడుతున్నారు

అనం గతచరిత్రను దాస్తున్నారు!

చల ఏమిటది?

అనం : తర్వాత మాట్లాడుదాం! ముందు భోజనం చేదురుగాని రండి! (లోనికి తీసికొనివెళ్ళి తిరిగి ఒంటరిగావచ్చి ఆలోచిస్తూ పచార్లు చేసి—చేసి) పుండరీకం!

పుండ : (బయటనుంచి) బాబయ్యా! (వచ్చి) ఏం బాబూ?

చూశావా పుండరీకం! బస్సు ప్రయాణీకు లెవరో - యెక్కడనుంచి వస్తున్నారో - యెక్కడకు వెళతారో_వారెవరో మనమెవరమో వారికీ తెలియదు మనకూ తెలియదు; అవునా?

పుండ : అవును బాబూ!

అనం: : అయినా మనమంతా యిక్కడ కలసివున్న యీ కొద్దిక్షణాలు ఆప్త బంధువుల్లా వుంటాం!

పుండ : అంతే బాబూ!

అనం : అంతే! మానవ జీవితంకూడా అంతే! ఎక్కడ నుంచి వస్తామో యెక్కడకు వెళతామో! ఇక్కడున్నన్నివాళ్లుమాత్రం మనమంతా ఒకరి కొకరం కావాలి.

పుండ : అందరిమాటా యేమోగాని—నాకుమాత్రం మీరు కావాలి బాబూ!

అనం : (నవ్వి) యెందుకు?

పుండ : బ్రతకటానికి బాబూ!

అనం : నీకింక యెవరూ లేరా పుండరీకం?

పుండ : లేరు బాబూ!

అనం : ఉంటే చెప్పు! కావలసిన డబ్బిస్తాను! పట్టుకు వెళ్ళి మీవాళ్ళతో కలసి సుఖపడుదువుగాని!

పుండ : లేరుబాబూ! నాకు మీకంటే కావలసిన వాళ్లెవరూ లేరు. ఉన్నన్నివాళ్లు మీదగ్గర వుంటాను!

అనం : అలాగేనయ్యా!......పుండరీకం! మరొక మిత్రుడు వచ్చాడు! భోజనం చేస్తున్నాడు. అతనితో మాట్లాడి వస్తాను!

పుండ : మంచిది బాబూ! యీలోగా నేనలా కొట్టు దగ్గరకు వెళ్లి పొగాకుముక్క తెచ్చుకొని వస్తాను (వెళ్లిపోతాడు)

అనం : సరే! వెళ్లి రా! (లోనికివెళ్ళి కొద్దిక్షణాలనంతరం చలమయ్యతో కలిసి తిరిగివస్తాడు)

చల ఇక చెప్పండి! నన్ను మీరెలా యెరుగుదురు?

అనం మీ రింకా జేబులుకొడుతున్నారా?

చల ఏమిటా మాటలు? నన్నెవరనుకొంటున్నారు!

అనం ఇప్పుడు పెద్దమనుషు లయ్యారేమో! అప్పుడు జేబులు కొడుతూవుండేవారు!

చల (మాట్లాడడు)

అనం మీది రంగాపురం కదూ!

చల అవును!

అనం మీపేరు చలమయ్యకదూ!

చల అవును!

అనం అవును. నేను పొరపడలేదు. మిమ్మల్ని సరిగానే గుర్తించగలిగాను! ఇరవై సంవత్సరాల క్రితం ఒక అమ్మాయితో నేను మీవూరు స్టేషనులో దిగీ దిగటంతోనే మీరు నాదగ్గ

కొట్టేశారు. నేను పట్టుకొన్నాను. దానితో మనిద్దరకూ తొలిసారిగా స్నేహం కలిసింది!

చల : (పరీక్షగా చూస్తూ ఆలోచిస్తూ వుంటాడు)

అనం : ఊరి వెలుపల పూరిపాక క్షేమంగా వుందా?

చల : ఏపాక?

అనం : మానవుల కళ్ళుగూని సంసారాలు గుల్లజేసే జూదశాల! ఇంకా నడుపుతున్నారా దాన్ని?

చల : ఇవన్నీ మీకెలా తెలుసు?

అనం : మీ దయవల్ల!

చల : అంటే!

అనం : వాటన్నీ తమ వద్దవల్లనే తెలిశాయని!

చల : ఎలాగ?

అనం : మీతోపాటు నేనూ కొంతకాలం ఆ సంఘ సభ్యుడనే!

చల : (వింతగా) మీరా? జూదగాళ్లా! నేను నమ్మను. మీలాంటి సత్పురుషులు—దాన ధర్మపరాయణులు జూదగాళ్ళంటే ఎవరు నమ్ముతారు—ఎలా నమ్ముతారు?

అనం : మీరు నమ్మినా నమ్మకపోయినా నాకు వచ్చిన నష్టంలేదు! కాని యెరిగినవారు కాబట్టి నా గతజీవితంలోని కుళ్లును-మాలిన్యాన్ని దాచుకోకుండా చెపుతున్నాను! ఈ జీవితంలో ఈ తెరవెనకాల-ఈ బురఖాలోనున్న కల్మషాన్ని తలుచుకొంటూ వుంటే నా గుండెలు పగిలిపోతున్నాయి! నేను జూదరినిమాత్రమే కాదు-వ్యభిచారిని త్రాగుబోతుని-దొంగను - దొంగవ్యాపారిని కూడాను.

చల : నాకంతా అయోమయంగా వుంది. మీ పేరేమిటి?

అనం : అనంతం!

చల : (భయంగా) ఆఁ!

అనం : (సాఫీగా) అవును. అనంతం!

చల : ఏమిటి? అనంతం!

అనం : అవును!

చల : వారపేటనుంచి ఒక భాగ్యవంతుని పిల్లను లేవతీసుకువచ్చిన అనంతం!

అనం : అవును!

చల : తప్పత్రాగి తెలివితప్పి రోడ్లమీద దొర్లే అనంతం!

అనం : అవును!

చల : జూదగాళ్లలో మాయలమాంత్రికుడని పేరు మోసిన-అఖండ హస్తలాఘవంగల జూదరి అనంతం!

అనం : అవును.

చల : తన డబ్బంతా జూదంలో గెలుచుకొన్నాడన్న కోపంతో ఒక కుర్రవాడిని మర్డర్ చేసిన అనంతం!

అనం : అవును! ఆ అనంతాన్నే!

చల : అయితే వెళుతున్నా! (వెళ్లబోతాడు)

అనం : (చేయి పట్టుకొని) యేం?

చల : నీదగ్గరుండటం క్షేమంగాదు!

అనం : (నవ్వి) భయంలేదులే! యీ అనంతం ఆ అనంతంకాదు. ఈ అనంతానికి ప్రాణాలైనా సరే యిచ్చేగుణమేగాని పుచ్చుకొనే గుణంలేదు. ఇది మరొకజన్మ.

చల : అటువంటివాడవిలా యెలా మారేవయ్యా?

అనం : అదంతా ఆభగవంతుని కృప.

చల : (కంగారుగా) ఆఁ!

అనం : కంగారుపడకండి చలమయ్యగారూ!

చల : గజదొంగ దయవల్లా నీకీఅవతారం?

అనం : (నిట్టూర్చి) దొంగకుమాత్రం హృదయం లేదంటారా? ఒక్క దొంగతనమనే గుణమున్నంతమాత్రాన యితర మంచిగుణాలేవీ వుండకూడదని—వుండవని సిద్ధాంతమా? మానవుడు సహజంగా మంచివాడు. పరిస్థితుల ప్రభావంవల్ల మారిపోతాడు. చుట్టూ వున్న సంఘవాతావరణం అతన్ని మారుస్తుంది: మనలోని స్వార్థము—నిర్దయ—అవినీతి యెదటవాడిని రాక్షసునిగా మార్చినట్లే—మనలో త్యాగము—ప్రేమ—సహనము—వుంటే యెదుటవాడిని భగవంతుని చేస్తుంది. శిక్షించటంవల్ల దుఃఖాన్ని—క్షమించటంవల్ల ఆనందాన్ని అనుభవించగలం.

చల : అయితే నిన్ను మార్చింది ఆ దొంగేనన్న మాట!

అనం : ఆ బ్రహ్మాణ్యుడెవరో నాకు తెలియదు! గజ దొంగ కావచ్చు—జగద్గురువు కావచ్చు.

చల : ఎలా జరిగిందంతా ?

అనం : అదొక విచిత్ర సంఘటన !

చల : ఏమిటది ?

అనం : పదిసంవత్సరాల క్రితం! ఆనాడు నువ్వు జూదానికి రాలేదు. ఎక్కడనుంచి వస్తున్నాడో—యెవడా అని ఒకకుర్రవాడిని గురించి మనం ప్రతిరోజూ ఆలోచించే వాళ్ళం—యెన్నిసార్లడిగినా వాడు తన సంగతి చెప్పలేదు! జ్ఞాపకంవచ్చిందా ?

చల : (ఆలోచిస్తూ వుంటాడు)

అనం : ప్రతిరోజూ వేలకు వేలు తెచ్చి ఓడిపోయి వెళ్ళిపోయేవాడు !

చల : ఆఁ! ఆఁ! అవును! వాడి నేకదూ నువ్వు మర్డర్ చేసింది.

అనం : అవును! ఆతనే! ఆనాడు వాడేకాదు మనవాళ్ళందరి డబ్బూకూడా ఆ కుర్రాడే గెలుచుకున్నాడు! అది సహించలేక మనవాళ్ళంతా తిట్టారు! నన్ను రెచ్చగొట్టారు! ఆ పురుషు మోహావేశంలో—ఆ డబ్బుపోయిన కోపంలో ఆ కుర్రాడి ముక్కుమీద గుద్దాను. అంతే! తక్షణం రక్తం కక్కు చనిపోయాడు! (బాధగా నిట్టూర్చి — దుఃఖాన్ని మింగుతూ) ఆనాడు నా హృదయంలో యెంతటి రాక్షసత్వం కరడుకట్టివుందో — యెంతటి భయంకర నీచస్వార్థం ఉక్కుదారాలతో గూడుకట్టుకొని వుందో యిప్పుడర్థమవుతూ వుంటుంది చలమయ్యగారూ!

చల : (నిట్టూర్చి) సరే! తరువాత ?

అనం : తర్వాత—మన వాళ్ళందరూ నన్ను పట్టి పోలీసులకు ఒప్పగించి తమమీద కేగొడవా రాకుండా తప్పించుకోవా లనుకొన్నారు! అది తెలిసి నేను పారిపోయాను.

చల : ఎక్కడికి ?

అనం : ఎక్కడికో నాకూ తెలియదు. రైలెక్కాను. రైల్లో తెలిసింది నన్ను పట్టుకోవటానికి ఒక నూతనవ్యక్తి వెంటాడుతున్నాడు. బహుశా ఆ కుర్రవాడి చుట్టమేమో! అతనినుండి తప్పించుకోవటానికి కొండల మధ్య రైలు దూకి పరుగెత్తి-పరుగెత్తి తెరచి వున్న ఒక ఇంట్లో జొరబడ్డాను.

చల : కొండలమధ్యలోనా ?

అనం : అవును. అదెక్కడో నాకు తెలియదు. అక్కడా యిల్లు తప్ప మరేయిల్లూ లేదు. చుట్టూ అరణ్యం !

చల : ఎవరిదా యిల్లు ?

అనం : ఆ యింటి యజమానే నన్నీ స్థితికి తెచ్చిన మహానుభావుడు. నేను వెళ్ళి అడిగిందే తడవుగా అభయమిచ్చాడు. "నేనొక హత్య చేసి పారిపోయి వచ్చాను" అని చెప్పాను.

చల : నిజం చెప్పేశావా! ఏమన్నాడాయన?

అనం : "అభయ మిచ్చాను — యముడు వచ్చినా నిన్ను ముట్టుకోనివ్వను!" అన్నాడు.

చల : తర్వాత ?

అనం : ఇంతలో నన్ను వెంటాడిన వ్యక్తి కూడా అక్కడకే వచ్చాడు! యజమాని ప్రక్కను కూర్చుని విందారగిస్తున్న నన్ను చూచి విస్తుపోయాడు! యజమానితో చెప్పాడు నేనే అతనికి కావలసిన వ్యక్తినని! అప్పుడు తెలిసిపోయింది నాకు—నేను చంపిన ఆ కుర్రాడు యీ యజమాని కొడుకేనని?

చల : ఏమిటి? కొడుకును చంపి తండ్రిని శరణు వేడావా?

అనం : అవును! అది అనుకోకుండా జరిగిన సంఘటన.

చల : నువ్వే తన కొడుకును చంపినవాడవని తెలిశాక యేమన్నాడాయన ?

అనం : నవ్వుతూ క్షమించి పంపించివేశాడు! ఆడిన మాట నిలుపుకోవటంకోసం కొడుకుగురించే కాదు—తన ప్రాణం పోయినా విచారించవన్నాడు!

చల : తర్వాత యేం జరిగింది ?

అనం : నా కళ్ళకు గంతలుకట్టి ఇక్కడకు తీసికొనివచ్చి యిక్కడే యీ కొండమీదే విడిచిపెట్టి వెళ్ళి

పోయారు. దానితో నా జీవితం తలక్రిందులయ్యింది అప్పటినుంచీ ఆ మహానుభావుని మళ్లా చూడాలని యిప్పటికీ యింకా వెదుకుతూనే వున్నాను.

చల : అయితే డబ్బంతా యెలా వచ్చింది?

అనం : నాకే యెవరూ లేరనుకొంటే—తనకు తానైనామిగలని మా బంధువొకాయన వారసత్వం కలిసింది. అనుకోకుండా వచ్చిన యీ ఆస్తిని సద్వినియోగం చేదామని యీ యేర్పాటు చేశాను.

చల : మంచిపని చేస్తున్నావు! మంచినీళ్ళుకూడా దొరకనిచోట ఉచితంగా భోజనం పెడుతున్నావంటే బ్రహ్మాండమైన కార్యం చేస్తున్నావన్నమాట!

అనం : ఎంత చేస్తే యేం? ఇంతవరకూ ఆ ధర్మాత్ముని దర్శనం కోసం యెదురుచూస్తూనే వున్నాను.

చల : ఎందుకు?

అనం : నా జీవితసర్వస్వాన్ని ఆయన పాదాల ముందు సమర్పణ చేదామని! నా హృదయాన్ని విప్పి ఆయన పాదాలమీద పెట్టి స్వీకరింపుమని నివేదించాలని!

చల : (నిట్టూర్చి) ఎంతమార్పు జరిగింది!

అనం ఇందుకు మిమ్మల్ని అభినందిస్తున్నాను!

చల నన్నా? ఎందుకు!

అనం నాకు చేసిన ఉపకారానికి!

చల నన్నెందుకు సిగ్గుపరుస్తావు అనంతం!

అనం నిజంగానే అభినందిస్తున్నాను! మీరు నేర్పిన జ్ఞానంవల్ల యెంత నికృష్టుడనయ్యానో—ఆ జ్ఞానం మూలంగానే అంత ఉత్కృష్టుడను కూడా కాగలిగాను.

చల : ఎంత సహృదయుడవయ్యావయ్యా! కీడును కూడా మేలుగా భావించగల విశాల హృదయం యెవరికుంటుంది?

అనం : కీడు—మేలు అనేది మనహృదయాన్ని బట్టి వుంటుంది. ఒకరికి కీడయింది మరొకరికి మేలుగావచ్చు! అంతేకాదు ఒకే వ్యక్తికి ఒకప్పుడు కీడయింది—అదేవ్యక్తికి—అదే-మరొకప్పుడు మేలు కావచ్చు.

చల : నీ హృదయమెంతటి బాధను సహిస్తువుందో అర్థమవుతుందయ్యా!

అనం : చలమయ్యగారూ! బాధలో నిజంగా బాధ లేదు! దాన్నిగురించి చేసే ఆలోచనలోనే వుంది అసలు బాధంతా! బాధనుకూడా తీయగా అనుభవించటం నేర్చుకొన్నవాడికిక దుఃఖమనేదే వుండదు!

చల : (నిట్టూర్చి-నవ్వి) అనంతం! నీ హృదయాన్ని అర్థం చేసికోలేకపోతున్నాను.... సరే? ఇక వెళతాను మరి!

అనం : వెళుదురుగాని—కొంచెం ఫలహారం తీసుకోండి! రాత్రి బస్సుదిగేటప్పటికి చాల ప్రొద్దుపోతుంది. (గుమ్మందగ్గరకు వెళ్ళి) అమృతం! వీరికి ఫలహారం ఏర్పాటు చేయి! నడవండి చలమయ్యగారూ! (లోనికి పంపించి తిరిగి వస్తాడు.)

(పుండరీకం వస్తాడు)

అనం : పుండరీకం!

పుండ : బాబయ్యా!

అనం : చీమలు పెట్టిన పుట్టలను పాములు ఆక్రమించుకొంటాయి.

పుండ : అవును బాబూ!

అనం : ఆ పుట్టను పాములపుట్ట అనే అంటారు.

పుండ : అంతే బాబూ!

అనం : ఈ సంపదఅంతా నాదంటున్నారు మీరు! కానీ యిందులో ఒక్క కానీ కూడా నా సంపాదన లేదు.

పుండ : ఉండనక్కరలేదండి!

అనం : వేసవిలో యెండిన నదికి వర్షకాలంలో వరదలు వస్తాయి!

పుండ : నిజం బాబూ! యెప్పుడూ చీకటిరాత్రులే వుండవు!

అనం : పుండరీకం!

పుండ : బాబయ్యా!

అనం : "మానవుడు తప్పుచేయటం సహజం" అనే మాట యెంత సత్యమో "తాచేసిన తప్పుయొక్క ఫలితాన్ని విధిగా అనుభవిస్తాడు" అనేది కూడా అంతే సత్యం!

పుండ : అంతేనంటారా?

అనం : ముమ్మాటికీ! తెలిసి చేసినా తెలియక చేసినా—ఆ చేసిన తప్పు తన ప్రభావాన్ని మానవుని మీద చూపించక మానదు. చేసినవాడు అనుభవించవలసిందే!

పుండ : చేసుకొన్నది తప్పౌతుందా బాబూ!

అనం : అబ్బా! ఆజీవితాన్ని—ఆ బాధను—తలచుకొంటే నే చాలు హృదయం చెదరిపోతుంది!

పుండ జైలుబాధ యేమన్నా అనుభవించా రేమిటి బాబూ!

అనం : (బరువుగా నిట్టూర్చి) జైలుకు వెళ్ళటమే బాధ అనుకొంటున్నావా? పుండరీకం! నిజానికి మనసు క్షోభపడటంకంటే యెక్కువైన బాధ మరొకటి వుంటుందంటావా? యీ వర్జితం జైలు జీవితాన్నయినా నవ్వుతూ అనుభవించవచ్చును గానీ—గాయపడ్డ హృదయం యేడ్చే యేడుపు ఒక్క క్షణమైనా వినలేమయ్యా! పది సంవత్సరాలనుంచి ఆనందంగా అనుభవిస్తున్న యీ అర్థంకాని బాధకు మించిన శిక్ష మరేమీ వుండదయ్యా!

[చలమయ్య వస్తాడు]

చల : అనంతం! జన్మజన్మాలకీ నీ ఋణము తీర్చుకోలేను. మరి సెలవా? బస్సుకు టయిమయ్యింది

అనం : అంతా భగవంతుని దయ! (నోట్లకట్ట ఇస్తూ) యిదిగో యీ డబ్బు తీసికోండి!

చల : నాకెందుకు?

అనం : ఫరవాలేదు. పట్టుకువెళ్లండి! కానీ ఒక్కటే నామనవి. ఇందులోని ప్రతి పైసా—సత్యంగా—ఉదాత్తంగా ఖర్చు కావాలి! ఏవాడూ ఒక్క కానీ కూడా సత్యంగా ఖర్చుపెట్టని నీచేతిమీదుగా యీ డబ్బంతా సత్యంగా ఖర్చు కావాలని నా ఆశ!

చల : అయితే సరే! తప్పక తీసుకొంటాను (కోటు జేబులో పెట్టుకొని) మరొక విషయం!

అనం : ఏమిటది?

చల : (అనుమానిస్తూ) మరేం అనుకోకు! నువ్వు పారిపోయి వచ్చేసిన యీ పదేళ్లనుంచీ రాజమ్మ నాదగ్గరే వుంటూవుంది.

అనం : అలాగా! మంచిది! దైవం ఆమెను రక్షించుగాక! వెళ్లిరండి! (లోపలకు వెళ్ళిపోతాడు)

పుండ : బాబూ

చల : ఎందుకురా?

పుండ : అప్పనంగా వచ్చిన డబ్బు! కాస్త దానం ధర్మం చేస్తూ వుండండి బాబూ!

చల : అందుకేరా యిది పుచ్చుకొంట! ఇందులోని ప్రతిపైసా దానం చేయబడాలి! లేకపోతే ఆయనకిచ్చిన మాట మారిపోదూ!

పుండ : సత్యం చెప్పారు బాబూ! ఒక్క అణా యిప్పించండి!

చల : నీ ముఖం! అణాకేనా యిస్తే యేం లాభం! ఆయన్ని పట్టుకో వెయ్యో రెండువేలో పడేసాడు! (గబగబా బయటకు వెళ్లిపోతాడు)

పుండ : (గట్టిగా నవ్వుతాడు) (అనంతం వస్తాడు)

అనం పుండరీకం!

పుండ బాబయ్యా!

అనం భగవంతుడు కూడా ఒక మానవుడే!

పుండ రాక్షసులు కూడా మానవులే బాబూ!

అనం ఇంతరాత్రి పడినా ఆయన రాలేదు చూశావా?

పుండ అవును బాబూ తమకు భోజనంలేదు.

అనం చెప్పానుగా ఆయన తినందే నేను తినలేనని!

పుండ పట్టుదల ప్రమాదం బాబూ! ఆయన రాకపోవచ్చు!

అనం నా ప్రాణాలు పోవచ్చు! కాని ఆడినమాట తప్పటం అధర్మం! ఒకనాడు సత్యంవల్ల రక్షింపబడిన యీ ప్రాణం యీనాడు సత్యంకొరకు ధారపోయగలగటం అదృష్టం కదూ!

పుండ : (నిట్టూర్చి) ఏమో బాబూ!

అనం : నువ్వెళ్లి యిక భోజనంచేసి పడుకో పుండరీకం!

పుంజ : అలాగే బాబూ! (ఇద్దరూ వెళ్ళిపోతారు)

(భగవంతుడు వస్తాడు)

భగ : (గంభీరంగా) ఎవరు లోపల?

ఆనం : ఎవరు వారు? (అంటూ వస్తాడు)

భగ : (తీక్షణంగా) ఎవరు నువ్వు?

ఆనం : (నిదానంగా చూస్తూవుంటాడు)

భగ : ఏమిటలా చూస్తున్నావు?

ఆనం : (పరీక్షగా చూస్తూ ఆనందంగా చిరునవ్వు నవ్వుతుంటాడు)

భగ : (చికాకుగా) మాట్లాడవేం?

ఆనం : (ఆనందంగా — ఉద్వేగంగా — చూస్తూ వుంటాడు.)

భగ : (కోపంగా) ఏమిటా చిరునవ్వు అంత వెటకారంగా వుందేం?

ఆనం : (బరువుగా వేగంగా సంతోషంగా నిట్టూర్పులు పుచ్చుతుంటాడు)

భగ : నీ చిరునవ్వుతో నా ఒళ్లు మండి పోతూ వుంది!

ఆనం : (ఇంకొంచెం నవ్వుతాడు)

భగ : (చాచి చెంపమీద కొడతాడు)

ఆనం : (ఆనందో(ద్రేకముతో) స్వామీ (అంటూ అతని పాదాలమీద వాలిపోతాడు) స్వామీ! వచ్చారా! వచ్చారా స్వామీ!

భగ : (వింతగా) ఏమిటిది?

ఆనం : (పాదాలు పట్టుకొని) అయ్యా యిన్నాళ్ళకు దయ కలిగిందా?

భగ : ఎవరు నువ్వు?

ఆనం : మరిచారా స్వామీ! మీ చేత సంస్కరింపబడి—నరకంలోనుంచి ఉద్ధరింపబడిన మానవుణ్ణి.

భగ : ఎలాగ ?

ఆనం : (లేచి) ఆనాడు మీరు చెప్పారు "అభయమిచ్చాను! అనిన మాట తప్పటం అధర్మం" అని! ఆనాటి మీ సత్యమే నాకు ప్రాణప్రదానం చేసింది.

భగ : ఎప్పుడు?

ఆనం : పది సంవత్సరాల క్రితం! మీ కుమారుడు చనిపోయినప్పుడు! నేను తెలియక మిమ్మల్ని శరణు వేడినప్పుడు నా కభయ మిచ్చి తర్వాత నేనే మీ కుమారుని చంపినవాడనని తెలిసీ కూడా అన్నమాట నిలుపుకోవటానికి నన్ను క్షమించి విడిచిపెట్టారు! మరిచారా స్వామీ?

భగ : అవన్నీ త్రాగుడు మైకంలో అన్నమాటలు! ఆ మత్తులో నేనేంచేశానో నాకే తెలియదు!

ఆనం : అంత మైమరచినస్థితిలో కూడా సత్యాన్ని మరువని మహనీయులు మీరు. ఆ మీ సత్య సంపతియే నాకు నూతన జీవితాన్ని ప్రసాదించింది. మీ అమృతవాక్కు నా హృదయంలో నందనవనాన్ని పుష్పింపజేసింది.

భగ : అదంతా నా కనవసరం! నా కిప్పుడు డబ్బు కావాలి ఎక్కడుంది చెప్పు!

ఆనం : స్వామీ యిదంతా మీదే! డబ్బే కాదు నా జీవితసర్వస్వం మీదే! మీ దర్శనం మెప్పుడవుతుందా యెప్పుడు మీరిచ్చిన యీ జీవితాన్ని మీ పాదాలకు అంకితం చేదామా అని ఆనాటినుంచీ యెదురుచూస్తున్నాను. స్వామీ—'

భగ : (చటుక్కున) నీ దొంగనటన చాలించు! (జేబులోనుంచి పిస్టలుతీసి గుండెలకు గురి పెట్టి) ఏవి? నీ డబ్బుపెట్టె తాళాలు ఇలా యియ్యి!

ఆనం : (నవ్వుతూ) ఇక్కడ మీకే యడ్డూ లేదు స్వామీ! డబ్బే కాదు ప్రాణాలు కూడా పట్టుకు వెళ్ళండి! (తాళాలు పాదాల దగ్గర పెట్టి) స్వీకరించండి! అదిగో డబ్బు! (గుండెలు చూపించి) యిదిగో ప్రాణం! స్వీకరించండి!

భగ : (కలవరపాటుతో వెర్రిగా చూస్తూవుంటాడు)

ఆనం : ఆనాడే నా ప్రాణాలు మీకు సమర్పించాను! స్వీకరించేముందు ఒక్క కోరిక మన్నించండి!

భగ : (ఆలోచిస్తూ) ఏమిటది?

ఆనం : ఆనాడు — నా జీవిత గాఢాంధకారాన్ని పటాపంచలు చేసి నూతనోషస్సులు ప్రసరింపజేసిన ఆనాడు మీ దగ్గర కూర్చోబెట్టుకొని నాకు మృష్టాన్న భోజనం

పెట్టారు! మీరిచ్చిన యీ ప్రాణాలు పోయే ముందు మీకు భోజనం పెట్టాలని నా చిర కాల వాంఛ! నా యీ ఒక్క కడసారి—స్వల్పకోరికనూ తీర్చి నా ప్రాణాలు తీసుకు వెళ్ళండి!

భగ : (తీక్ష్ణంగా అతనివంక చూస్తూ వుంటాడు. ఆనందంతో కళ్ళవెంట నీళ్లు కారుతూ వుంటాయి.)

అనం : (అతని కాళ్ళదగ్గర మోకాళ్ళ మీద కూర్చుని) స్వామీ! స్వీకరించరా స్వామీ! సమర్పణ స్వీకరించరా?

భగ : (పిస్తలు జేబులో పెట్టకొని కళ్లు తుడుచుకొని—గంభీరంగా) ముందు నీ దగ్గరనున్న డబ్బంతా మూటగట్టు!

అనం : (లేచి) సంతోషం! అలాగే స్వామీ!

భగ : (ఇక సహించనట్లు) మాట్లాడకు! వెళ్లు!

అనం : (మెల్లిగా లోపలకు వెళతాడు)

భగ : (అతనివైపు చూస్తూ—నిట్టూర్చి) పిచ్చివాడా! నేనే సమర్పణ చెయబోతున్నాను! నీ సమర్పణ స్వీకరించే అధికారం నాకెక్కడిది? (అటుతిరిగి—పైకి చూస్తూ—చేతులు జోడించి) భగవాన్! నా జీవితంలో నీ మాట తలపెట్టటం యిదే తొలిసారి! ఇన్నాళ్ళకు నువ్వొకడవున్నావని జ్ఞాపకం చేశావా భగవాన్!

[పుండరీకం వస్తాడు]

పుండ : ఎవరు బాబూ వారు?

భగ : రా! నీ నాటకం పూర్తి కావచ్చిందిలే!

పుండ : (నవ్వి) మీరా! వచ్చారా బాబూ!

భగ : (తీక్ష్ణంగా చూచి—చేతిలోని కర్రను దూరంగా తన్నేస్తాడు)

పుండ : బాబూ! (కూర్చుని కర్రకోసం తడుము కొంటూ వుంటాడు.)

భగ : (చొక్కా పట్టుకొని పైకి లేవదీస్తాడు)

పుండ : బాబయ్యా!

భగ : (వీపు తట్టి) బ్రదర్! యింకా యెందుకు నటన! నిజరూపంలో బయటపడు!

పుండ : (ఏమీ యెరుగనట్లు) ఏమిటి బాబూ!

భగ : (చటుక్కున అతని గెడ్డం లాగేస్తాడు-జుట్టు మీసంకూడా వూడిపోతాయి)

పుండ : (తీరిగా నిలుచుని చూస్తూ పిస్తలుకోసం జేబులో చేయి పెడతాడు)

భగ : (ఆ చేయి అలాగే పట్టుకుని) ఎందుకులే నీకా శ్రమ! పిస్తలు తీయకు! నన్ను అరెస్టు చేయటానికే కదా పిస్తలు! ఇదిగో నేనే అరెస్టు అవుతున్నాను!

పుండ : (వింతగా చూస్తుంటాడు)

భగ : నమ్మకంలేదా? (తన పిస్తలు తీసి) ఇదిగో! (అతని గుండెలకు గురిపెట్టి) మరుక్షణంలో నువ్వే మవుతావో ఆలోచించు! నిన్ను చంపాలంటే నువ్వీపాటికి చచ్చేవాడివి! కానీ అలా చేయటంలేదు! (పిస్తలు క్రింద పారేస్తాడు) పొద్దుట వచ్చినప్పుడే తెలుసుకొన్నాను నువ్వు సి. ఐ. డి. ఇన్‌స్పెక్టర్ పుండరీకాక్షుడవని! నిన్నూ అనంతాన్ని-అవసరమైతే యింకెవరినైనా చంపి అనంతం దగ్గరనున్న డబ్బంతా పట్టుకుపోదామని వచ్చాను కానీ మనసు మార్చుకొన్నాను! నేనే స్వయంగా స్వాధీనమవుతున్నాను! నడు వెళదాం!

పుండ : (వింతగా) చాలా అసందర్భంగా మాట్లాడుతున్నారే!

భగ : జీవితమే అసందర్భాల కలయిక!

పుండ : మీ రింత అకస్మాత్తుగా యెలా మారిపోయారు?

భగ : ఈ అనంతం మార్చేశాడు!

పుండ : ఏం జరిగింది?

భగ : నేను వచ్చినపని తెలియకుండానే తన సర్వస్వాన్నీ నా పాదాలు దగ్గర పెట్టి స్వీకరించుమని నివేదించాడు. ఎవరినైతే చంపుదామని వచ్చానో అతనే తనంతట తాను తన ప్రాణాలతో సహా సర్వం నాకు కానుక పెట్టాడు! అతని త్యాగాన్ని చూచి నా మనసు మారిపోయింది.

పుండ : అతనలా యెందుకు చేయవలసి వచ్చింది?

భగ : ఎప్పుడో యేదో సందర్భంలో-నన్ను నేనే తెలిసికోలేని మత్తులో-యేదో . చేశానట!

యేమో అన్నాడట. అప్పుడు వేసుకో కుండా అన్న ఆ ఒక్క మాటతోను మనకు మార్చుకొన్నాడట! మహాత్యాగి అయి నాడు! (నిట్టూర్చి) ఒక్కొక్క మాటకు ఎంత విలువ వుంటుందో జీవితాలమీద యెటువంటి ప్రభావం చూపిస్తుందో చూశా వయ్యా!

పుండ : (బరువుగా నిట్టూర్చి) ఆనందం నిజంగా ధన్యాత్ముడు! అతన్ని నేనుకూడా క్షమా పణ వేడుకోవాలి!

భగ : ఎందుకు?

పుండ : అసలు నేను వచ్చింది అతని కోసమే! అనంతం చేసే యీ అంతులేని దాన ధర్మాలు చూచి——యీ నిర్జనప్రదేశములోని కొండ మీద యిల్లుచూచి—కరెన్సీ ప్రింటు చేస్తున్నాడేమోనన్న జనాపవాదాన్ని ఆధారం చేసికొని నన్నిక్కడకు ప్రభుత్వం పరిశోధనకోసం పంపించింది. తలవనితలం పుగా మీరు తారసిల్లారు అసలు యథార్థం బయటపడింది.

భగ : నీ పుణ్యం పండింది!

పుండ : ...

భగ : ప్రమోషను వస్తుందిగ!

పుండ : దేనికి?

భగ : నన్ను పట్టుకొన్నందుకు!

పుండ : (నవ్వి) నేను మిమ్మల్ని పట్టుకోవటం లేదు!

భగ : (ఆశ్చర్యంగా) అదేమిటి?

పుండ : తనంతటతాను సమర్పణ చేసికొన్న ఒక మహావ్యక్తిని నేనే పట్టుకొన్నానని చెప్పు కోవటానికి నాకు సిగ్గుగా వుంటుంది! నా కిష్టం లేదు!

భగ : ఎందుకని?

పుండ : మిమ్మల్ని బంధిస్తే మీకు ఉరిశిక్ష తప్పదు!

భగ : ఆ సంగతి నాకేనాడో తెలుసును!

పుండ : అలా జరగటం నా కిష్టంలేదు.

భగ : ఎందుచేత?

పుండ : నేను నా కారణాలన్నీ వివరించలేను. నా మనసు ఘోషిస్తూ వుంది! నేను మిమ్మల్ని బంధించటంలేదు!

భగ : (నవ్వి) ప్రమోషను వద్దా?

పుండ : అక్కరలేదు!

భగ : ఈ సంగతి ప్రభుత్వానికి తెలిస్తే నీ ఉద్యోగముండదు!

పుండ : అయినా సరే! నాకురించి ఒక అమూల్య మైన ప్రాణాన్ని బలిచేయటం నా కిష్టం లేదు! మీరిలా మారకుండా యెప్పటిలాగే వుంటే నా ప్రాణాలు పోయినా మిమ్మల్ని విడిచిపెట్టేవాడిని కాదు. ఇప్పుడు మిమ్మల్ని పట్టుకోలేను.

భగ : (కాస్సేపాగి—చిన్నగా నవ్వి) మరొక మాట!

పుండ : ఏమిటి?

భగ : నువ్వు తీసుకొని వెళ్ళకపోయినా — నా అంతట నేను వెళ్ళి పోలీసులకు వశమై పోతాను. అది తథ్యం! అప్పుడు నా కెలాగా


ప్రమాద రక్షణకు
ప్రశస్తమైనది
భీమా

ఎప్పుడే ప్రమాదం వచ్చేదీ, ఏ క్షణం ఎలా
ఉండేదీ తెలియని ఈ దినాలలో
* అగ్ని * మోటార్‌కారు * కార్మిక నష్టపరిహారం
*నౌక *ఫయిడిలిటీ గ్యారంటీ *మొదలైన భీమాలకు
మాతో సంప్రతించండి;

యునైటెడ్ ఇండియా ఫైర్ అండ్
జనరల్ ఇన్సురెన్సు కంపెనీ
లిమిటెడ్,

"యునైటెడ్ ఇండియా లైఫ్ బిల్డింగ్స్"
ఎస్ప్లనేడ్ - మద్రాసు.
Telephone: 4241. Telegram : "UNIGEN"
బ్రాంచీలు:
బొంబాయి-కలకత్తా-కొలంబో-సింగపూరు-విజయవాడ-
ఢిల్లీ-పాట్నా-లక్నో-బెంగుళూరు కోయంబత్తూరు.

ఉరిశిక్ష తప్పదు! అది నువ్వు తప్పించగలిగేదీ కాదు! అటువంటప్పుడిక నన్ను పట్టుకోవటంలో అర్థంలేదు. పదు వెళదాం!

పుండ : ఎక్కడికి?

భగ : పోలీసు స్టేషనుకి!

పుండ : నేను రాలేను.

భగ : బాగా ఆలోచించు. పెళ్లాం బిడ్డలు కలవాడవు మూర్ఖంగా ఉద్యోగం పోగొట్టుకొని నువ్వు బాధపడి వాళ్ళను బాధపెట్టకు! ఈ విషయంలో నీ త్యాగం నిరర్థకం! ఎలాగా తప్పని నా ఉరిశిక్షకోసం అనవసరంగా మన్యను భార్యాబిడ్డల వేడిపించకు! పదు

పుండ : (మాట్లాడకుండా చూస్తూవుంటాడు)

భగ : ఇప్పుడు నాకెంత ఆనందంగా వుందనుకొన్నావు!

పుండ : ఎందుకు?

భగ : నా వల్ల ప్రాణాలు పోవలసినవాడికి ప్రమోషను వస్తుందని.

పుండ : చాలా విచిత్రవ్యక్తిలా వున్నారే! ఇంత మంచివారు సత్యసంధులు యీ దొంగతనానికి యెలా అలవాటుపడ్డారండి?

భగ : ఇంతకూ కారణం సంఘం! చెప్పమంటావా నా కథ! నేను బి.యస్‌సి. చదువుతూ వుండగా ఒక అమ్మాయిని ప్రేమించాను. వర్ణాంతర వివాహం చేసుకొందామనుకొన్నాం! సంఘం అడ్డువచ్చింది. వెలివేస్తానంది. బలిగొంటానంది. మా ప్రేమకోసం యిద్దరం కలసి పారిపోయాం! దొరికితే నిజంగా చంపేస్తామన్నారామె పెద్దలు. దాగున్నాం. సంసారానికి డబ్బు కావలసివచ్చింది. బయటకు రావటానికి భయపడ్డాం! అంతలో ఒక దొంగతో పరిచయమయ్యింది. పట్టుబడింది విద్య! ప్రావీణ్యం సిద్ధించింది! అందుకే యీనాడిలా నేరస్థునిగా యీ సంఘం ముందు నిలబడవలసివచ్చింది! కానీ నన్నిలా మార్చింది యీ సంఘమే! ఆనాడు మా వర్ణాంతర వివాహానికి సంఘం అడ్డుతగలకుండా వుంటే యీనాడు నేనూ ఒక ప్రభుత్వోద్యోగినై గౌరవనీయుడుగానే వుందును!... సరే! ఇక ఆలస్యం చేయకు! త్వరగా పదు!

పుండ : అనంతంగారితో చెప్పి వెళదాం!

భగ : వద్దు వద్దు అతను రాకుండానే వెళ్ళిపోవాలి.

పుండ : అదేం?

భగ : నీకు తెలుసుగా-అనంతం నన్ను దైవం అనుకొంటున్నాడు! నేనిటువంటి రాక్షసుడని తెలిస్తే అతని హృదయం గాయపడుతుంది. మానవునిపై అతనికి కలిగిన సంపూర్ణ విశ్వాసాన్ని నా నిజస్వరూపం చూపించి నాశనం చేయటం మంచిదికాదు. అంతేకాదు ఇప్పుడు వచ్చి తన డబ్బంతా పట్టుకువెళ్ళే వరకూ విడిచిపెట్టడు! నాకిక డబ్బుతో యేంపని! ఆ డబ్బుతో బాటసారులకు యథాప్రకారంగా నిరంతాన్నదానం జరగాలని నా అభిలాష! అనంతం వచ్చేస్తాడు! త్వరగా రా! (అతని చేయిపట్టుకొని పోతాడు.)

[అనంతం వస్తాడు]

అనం : స్వామీ....స్వామీ... (నలువైపులా చూచి నిరాశగా) పుండరీకం! పుండరీకం! (కాస్సేపాగి బాధగా నిట్టూర్చి చేతులుమోడ్చి పైకి చూస్తూ) ఓయి భగవంతుడా యేమిటి నాకీ పరీక్ష! కనుపించికూడా కరుణించకుండా వెళ్ళిపోయారా స్వామీ? భగవాన్! (మోకాళ్ళమీద కూర్చుని-అలాగే నమస్కరిస్తూ) స్వీకరించు భగవాన్! నా సమర్పణ స్వీకరించు భగవాన్! (అలాగే వుండిపోతాడు.)

[తెర]

# వ్యాకరణశాస్త్రము

శ్రీ తటవర్తి సూర్యనారాయణమూర్తి

భారతీయ సంస్కృతికి మూలాధారము దాని ప్రాచీన వాఙ్మయము. ఆ ప్రాచీనవాఙ్మయము సంస్కృత ప్రాకృత, పాలీ, అపభ్రంశ, దేశకాది పెక్కు భాషలలో పల్లవితమైనది. అన్నిటికంటె నతి ప్రాచీన వాఙ్మయము వైదిక సంస్కృతభాషలో విరాజిల్లినది. అది వేదము, దానిశాఖలు. బ్రాహ్మణాది గ్రంథసముదాయమున్ను. సమ్యగ్వేదాధ్యయనమునకై జ్ఞానమునకై ప్రయోగమునకై ప్రాచీనఋషులు శిక్ష, కల్ప వ్యాకరణ నిరుక్త, ఛందజ్జ్యోతిషములను వేదాంగము లారింటిని సమామ్నాత మొనర్చియుండిరి. వేదార్థ జ్ఞానమునకై నిరుక్తశాస్త్ర స్వతంత్రప్రవృత్తియున్నను గూడ వ్యాకరణము లేనిదే నిరుక్తజ్ఞానము లభించ జాలదు. కాన వేదాంగములందు వ్యాకరణమునకు తృతీయస్థానము లభించుననునది వేదార్థజ్ఞానమునందు ప్రధానస్థానముగలది వ్యాకరణములేనిదే వేదార్థ జ్ఞానము దుష్కరమే గాక అసంభవము గూడ. వ్యాకరణజ్ఞాన శూన్యునికి నిరుక్తమంగును ప్రవృత్తి గలుగ జాలదు. కనుక భారతీయ సంస్కృతికి దానికాధారమైన వైదిక వాఙ్మయరత్నములలో వైయాకరణులకు విశిష్టస్థానముగలదు. వారిగ్రంథములు జదివియే మనము వేదార్థజ్ఞానమున కర్హులమగుచున్నాము.

భారతీయైతిహాసికుల ప్రధాన సర్వమతసిద్ధాంతము—వైదిక సంస్కృతితో సంబద్ధిత ప్రత్యేక శాస్త్రమున కాదిస్రోతము వేదమనునది సత్యము. వ్యాకరణశాస్త్రముయొక్క పుట్టుక వేదమునుండియే నని పతంజలి యభిప్రాయము పతంజలి తన సిద్ధాంతమును "చత్వారిశృంగా, చత్వారివాక్, ఉతత్వః సత్తమిత్ర, సుదేవోఽసి" యను నీ మంత్రములలో ఋషీకరించియున్నాడు. పతంజలికి ప్రాచీనుడైన యాస్కుడుగూడ నిరుక్తము 13.2 లో 'చత్వారివాక్ మంత్రమును వ్యాకరణశాస్త్ర పరముగనే వ్యాఖ్యానించియున్నాడు. వైదికమంత్రములలో అనేక ప్రత్యయములకు ధాతుమూలకమైన వ్యుత్పత్తులు నిర్దేశించబడి కన్పించుచున్నవి. యథా:—

'స్తోతృభ్యో మంహతే మఘం' (ఋ 1.11-3).

'యే సహాంసి సహసా సహన్తే' (ఋ 6.66-9)

'ధాన్యమసి ధినుహి దేవాన్' (యజు 1-20)

కేతపూః కేతం నఃపునాతు (యజు 11-7).

'యేన దేవాః పవిత్రేణాత్మానం పునతేసదా' (సామ, ఉ, 5.2-8.5).

"తీర్థై స్తరంతి' (అథర్వ 18.4 7)

ఈ యుద్ధరణలవలన వ్యాకరణమునకు మూలభూతమైన సిద్ధాంతముయొక్క ఆదిస్రోతము వేదమని వ్యక్తమగుచున్నది.

## వ్యాకరణశాస్త్రము—ఉత్పత్తి.

వ్యాకరణ శాస్త్రోత్పత్తి యెప్పుడు జరిగినదని నిర్ణయించుట చాలకష్టము. భారతీయేతిహాసమునుబట్టి సర్వవిద్యల కాదిప్రవక్త ఆదివిద్వాంసుడగు బ్రహ్మ. వ్యాకరణవిషయమున ఋక్తంత్ర — వ్యాకరణము 1 4 లో వ్రాయబడియున్నది—

'బ్రహ్మ బృహస్పతయే ప్రోవాచ, బృహస్పతిరింద్రాయ, ఇంద్రో భరద్వాజాయ, భరద్వాజ ఋషిభ్యః, ఋషయో బ్రాహ్మణేభ్యః'

## ఆదితంత్ర ప్రణేత

ఋక్తంత్రములోని ఉపర్యుక్త వచనములో వ్యాకరణమునకు క్రమశః బ్రహ్మ, బృహస్పతి, ఇంద్రుడు భరద్వాజుడు ప్రవక్తలని చెప్పబడిరి. బృహస్పతి యింద్రునకు ప్రతిపద పాదముద్వారా శబ్దోపదేశము గావించియుండెనని మహాభాష్యమువలన దెలియవచ్చుచున్నది ఆ సమయమువరకు లక్షణాత్మక శాస్త్రప్రవృత్తి జరిగియుండలేదు. ఇంద్రుడు ప్రతి

పద పాఠముద్వారా వ్యాకరణోపదేశ ప్రక్రియ యొక్క దురూహ్యత ననుభవమున నెఱింగి ఆకాలము నాటి గొప్ప శాబ్దికాచార్యుడైన వాయువు సహాయము చేత నొక ప్రక్రియను గావించెను అదే నేటివఱకు న్యూనాధిక్య రూపమున వ్యవహృతమైయున్నది. ఈ విషయము తైత్తిరీయ సంహితలోని యీ క్రింది పాఠముచే వ్యక్తమగుచున్నది.

'వాగ్వై పరాచ్యవ్యాకృతావదత్, తే దేవా ఇంద్రమబ్రువన్, ఇమాం నో వాచం వ్యాకుర్వితి, సో౽బ్రవీద్వరం వృణై మహ్యం చైవైష వాయవే చ సహ గృహ్యాతా ఇతి; తామింద్రో మధ్యతో౽వక్రమ్య వ్యాకరోత్ !'

దీనిని వ్యాఖ్యానించుచు సాయణుడు ఋగ్వేద భాష్యముయొక్క ఉపోద్ఘాతములో (పేజి 26 పూనా సంస్కరణము) వ్రాసియున్నాడు—

తామఖండాం వాచంమధ్యే విచ్ఛిద్య ప్రకృతి ప్రత్యయ విభాగం సర్వత్రాకరోత్.

తైత్తిరీయ సంహితలో నుల్లిఖితులగు ఇంద్రుడు-వాయువును ఐతిహాసిక వ్యక్తులుగాని ఆలంకారికులు గాదని యెఱుంగవలెను.

## వ్యాకరణశాస్త్ర రచనా కాలము

ఈ శాస్త్రోత్పత్తియొక్క వాస్తవికమైన కాలమును నిర్ణయించుట కఠినమైనను తైత్తిరీయ సంహితలోని ఉపర్యుక్త వచనమునుబట్టి దీని ఆదితంత్రప్రణేత ఇంద్రుడని మాత్రము స్పష్టము. ఇక ఈ యింద్రుడెప్పటివాడో విచారణీయము. ఋక్తంత్రముయొక్క పూర్వోక్తవచనానుసారముగ వ్యాకరణ ప్రవక్తలగు ఆచార్యపరంపరలో ఇంద్రుని స్థానము మూడవది గనుక ఇక యీ ఇంద్రుడెంతో ప్రాచీన వ్యక్తియనుటలో నేమియు సందేహము లేదు

ప్రపంచములోని అన్ని ధర్మగ్రంథములలో మనువుయొక్క జలప్లావనమునుగూర్చి యుల్లేఖించబడి యున్నది. ఆ జలప్లావనానంతరమే వరుసగా బ్రహ్మ బృహస్పతి, ఇంద్రుడు బుట్టియుండిరి. ఈ జలప్లావన మెప్పుడు జరిగెనో అదియు విచారణీయాంశమే. మహాభారతము- తదితర పురాణముల నవలోకించియు విమర్శించియు జూచినపిమ్మట మనకీ జలప్లావనము చతుర్యుగ ప్రారంభమున జరిగియుండెనని నిర్ణయమగుచున్నది నాలుయుగముల సంధ్యా, సంధ్యాంశ సహితకాలము క్రమశః 4800, 3600, 2400, 1200 దైవ వర్షములు (మనుస్మృతి 1.68-70) దైవ వర్షము మానవవర్షమునకు 360 రెట్లధికమని తలంచబడు చున్నది. గాని యిది సరిగాదనియు నెంచబడు చున్నది. వస్తుతః దైవ వర్షము సౌరవర్షము. సౌరవర్షమందు చాంద్రవర్షమువలె న్యూనాధిక్యములుండవు గాన కాలగణనము సౌర-దైవవర్షములచేత చేయబడు చున్నది. భారతీయేతిహాసాను సారముగ ద్వాపర యుగము సమాప్తమై నేటికి 5057 సంవత్సరములయ్యెను. కొన్ని పురాణములలో ద్వాపరానంతరమున 1200 సంవత్సరముల పరిమాణముగల కలియుగము సమాప్తమైన పిమ్మట కలి వృద్ధియని యుల్లేఖించబడియున్నది. అది మన ఉద్దేశ్యమునకు పూరకము.

పురాణపాఠముచేత ఇంద్రునికాలము సత్య(కృత) యుగమున కంతమున త్రేతాయుగమునకు ప్రారంభమున నైయుండెనని నిర్ణయించబడుచున్నది. తదను సారముగ ఇంద్రుడు నేటినుంచి ఇంచుమించుగ పద కొండు వేల సంవత్సరముల ప్రాచీనుడని తెలియవచ్చు చున్నది. భారతీయ కాలగణనానుసారముగ ఇది ఇంద్రుని న్యూనతము కాలము. (దైవవర్షముల రెంకన లెక్క ప్రకారము యీ ఇంద్రుడు ఇంచుమించుగ ఇఱువదియొక్కలక్షల యిఱువదివేల సంవత్సరముల ప్రాచీనుడు.)

వ్యాకరణశాస్త్రముయొక్క మూడు విభాగములు—

ఇంద్రునిపిమ్మట ఇంత సుదీర్ఘకాలమందెన్ని వ్యాకరణ గ్రంథముల ప్రణయనమైనదో తెలియ బడదు. ఇప్పుడు లభించు మొత్తము గ్రంథములను మూడు విభాగములుగ బంచవచ్చును. యథా:

1. వైదికశబ్దవిషయకములు-ప్రాతిశాఖ్యాదులు.
2. లౌకిక శబ్దవిషయకములు-కాతంత్రాదులు.
3 ఉభయవిధ శబ్దవిషయకములు: ఆపిశల పాణిని ఆదులు.

వ్యాకరణ ప్రవక్తలలో రెండు భేదములు:—

ఇప్పుడు లభించు వ్యాకరణగ్రంథము లన్నింటి యందును అతి ప్రాచీనమైనది పాణినీయ వ్యాకరణము.

పాణిని ముని ప్రాచీన వ్యాకరణ ప్రవర్తలకు ఆచార్యులలో సంహితికంటె నర్వాచీనుడుగాన వ్యాకరణాచార్యులను రెండు విభాగములు చేయవచ్చును పాణినికి ప్రాచీనులు, పాణినికి అర్వాచీనులు.

ప్రాచీనాచార్యులలో రెండు భేదములు:

పాణినికి ప్రాచీనులైన వ్యాకరణ ప్రవర్తలకు ఆచార్యుల విభాగము ఒకటి- ఛందోమాత్ర విషయక ప్రాతిశాఖ్యాదుల ప్రవర్తలు రెండు. సామాన్య వ్యాకరణ శాస్త్రముయొక్క ప్రవర్తలు.

ప్రాతిశాఖ్య ప్రవర్తలు :

ప్రాచీకాలమున వైదికశాఖ లన్నింటి చరణములకు నన్ని ప్రాతిశాఖ్యలు రచింపబడెను. అందులో నేడు నిమ్నలిఖిత ప్రాతిశాఖ్య లుపలబ్ధ మగుచున్నవి.

1. ఋక్ప్రాతిశాఖ్య- శౌనక ప్రణీతము.

2 వాజసనేయ ప్రాతిశాఖ్య— కాత్యాయన ప్రణీతము

3 తైత్తిరీయ ప్రాతిశాఖ్య.

4 సామ ప్రాతిశాఖ్య.

5 అథర్వ ప్రాతిశాఖ్య.

6. మైత్రాయణీయ ప్రాతిశాఖ్య

ఇందలి మైత్రాయణీయ ప్రాతిశాఖ్య ఇంతవరకు నముద్రితము ఇవియునుగాక—

7. ఆశ్వలాయన ప్రాతిశాఖ్య

8. వాష్కల ప్రాతిశాఖ్య.

9. చారాయణ ప్రాతిశాఖ్యలు గలవు.

ఈ ప్రాతిశాఖ్య లిప్పుడుపలబ్ధము గాకున్నను ఇవి ప్రాచీన గ్రంథములం దచ్చటచ్చట నుద్ధృతములై యున్నవి. కనుక వీనియునికి తథ్యము

అన్యఛందో వ్యాకరణములు:

ప్రాతిశాఖ్యలు గాకుండ, నింకను గొన్ని వ్యాకరణ గ్రంథము లుపలబ్ధము లగుచున్నవి. అవి ప్రాతిశాఖ్యగణనమునకు రాకున్నను వేద— వేదశాఖా విశేషములతో వానికిసంబంధము గలిగియున్నది.

యథా:

1. ఋక్తంత్రము—శాకటాయన లేక శౌద్వజి కృతము.

2. లఘు ఋక్తంత్రము.

3 సామతంత్రము — ఔద్వజి లేక గార్గ్య కృతము.

4 అక్షర తంత్రము—ఆపిశలి కృతము.

5. అథర్వ-చతురధ్యాయి — శౌనక-లేక కౌత్స ప్రణీతము.

6. ప్రతిజ్ఞా సూత్రములు—కాత్యాయనుడు.

7 భాషిక సూత్రములు.

ప్రాచీన వ్యాకరణ ప్రవర్తలు:

ఉపర్యుల్లిఖిత ప్రాతిశాఖ్యాది వైదిక వ్యాకరణ గ్రంథములలో 57 గురు వ్యాకరణ ప్రవర్తలగు ఆచార్యుల నామము లుపలబ్ధము లగుచున్నవి. పాణిని తన అష్టాధ్యాయిలో పదిమంది ప్రాచీనాచార్యుల నామములు వ్రాసియుండెను. వీరుగాక ప్రాచీన గ్రంథములలో పదముప్పదాచార్యుల నామము లుల్లేఖించబడి యున్నవి. ప్రాతిశాఖ్యలలో నుద్ధృతాచార్యులను విడిచిపెట్టినను గూడ పాణిని వలన 23 ప్రాచీనాచార్యుల నామములు మనకు నిశ్చిత రూపమున తెలియుచున్నవి. వారు — 1 ఇంద్రుడు 2 వాయువు 3 భరద్వాజుడు 4 భాగురి 5 పౌష్కరసాది 6 చారాయణుడు 7 కాశకృత్స్నుడు 8 వైయాఘ్రపద్యుడు 9 మాధ్యందిని 10 రౌఢి 11 శౌనకి 12 గౌతముడు 13 వ్యాడి 14 ఆపిశలి 15 కాశ్యపుడు 16 గార్గ్యుడు 17 గాలవుడు 18 చాక్రవర్మణుడు 19 భారద్వాజుడు 20 శాకటాయనుడు 21 శాకల్యుడు 22 సేనకుడు 23 స్ఫోటాయనుడు.

ఇందులో చివరి పదిమంది నామములు పాణినీయాష్టకమున నుల్లిఖితమై యున్నవి. మొదటి 13 గురు ఆచార్యులు పాణినికన్న ప్రాచీనులైయున్నను పాణినీయాష్టకమందు వీరి పేరులు చర్చించబడియుండలేదు.

ఈ 23 గురు ఆచార్యులలో ఇంద్రుడు, భాగురి, కాశకృత్స్నుడు, పౌష్కరసాది, ఆపిశలి-ఈ అయిదుగురి సూత్రము లనేకములు ప్రాచీన గ్రంథములం దుల్లిఖితములు. అన్నిటికంటె యెక్కు డుద్ధరణలు ఆపిశలివ్యాకరణమునకు సంబంధించినవి లభించుచున్నవి.

కాశకృత్స్నుని వ్యాకరణమందు మూడధ్యాయములు గలవు ఆపిశలుని వ్యాకరణమున పాణినీయ వ్యాకరణమువలె నే ఎనిమిదధ్యాయములు గలవు. పాణినీయ వ్యాకరణ సదృశముగ ఆపిశల వ్యాకరణమునకూడ

ధాతుపాఠములు, గణపాఠములు ఉణాదికోశము — యీఖిల పాఠములు గూడ రచింపబడెను

## పాణినీయ వ్యాకరణము

ప్రస్తుత కాలములో ఆర్ష వ్యాకరణములలో ఒక్క యీ వ్యాకరణమే యుపలబ్ధమగుచున్నది.

భారతీయేతిహాసానుసారముగ, మనుష్యుల ఆయువు ధారణాశక్తి హ్రాసమగుచుండుట హేతువుగా ప్రాచీన విస్తృతగ్రంథము లావాటి కావాను సంక్షిప్తమగుచు వచ్చెను. తదనుసారముగ పాణినీయ వ్యాకరణముగూడ ప్రాచీనార్ష వ్యాకరణముల సంక్షిప్త సంస్కరణము గనుక నే:

యాన్యుజ్జహార మాహేంద్రా
ద్వ్యాసో వ్యాకరణార్ణవాత్
పదరత్నాని కిం తాని
సంతి పాణిని గోష్పదే.

అని చెప్పబడినది.

ఇందుచే ఆధునిక వైయాకరణుల "ఉత్తరోత్తర మునీనాం ప్రామాణ్యం" అను నీ స్వకల్పిత నియమాను సారము ప్రాచీనమైన అపాణినీయ ప్రయోగముల నపశబ్దములని చెప్పుట చింత్యము. 'ఆర్షత్వాత్ సాధు, ఛందోవత్ కవయః కుర్వంతి' యున్నగునవి చెప్పుట గూడ ప్రకారాంతరముచే వాని నపశబ్దములని తెలుచుట యగును. పదునారవ శతాబ్దములో వైయాకరణ ప్రక్రియాసర్వస్వ రచయితయగు భట్టనారాయణుడు తన అపాణినీయ ప్రామాణికత యను గ్రంథములో దీనిపై బాగుగా చర్చించియుండెను. ప్రాచీనార్యుల ప్రయోగముల సంగతి యటుండనిచ్చి పాణిని సూత్ర పాఠమందుగూడ "జనికర్తుః తత్ప్రయోజకః" మున్నగు నెన్నియో ప్రయోగములు పాణిని లక్షణానుసారముగ సిద్ధించజాలకున్నవి. అవియు నపశబ్దములేనా? పాణిని వంటి వైయాకరణుడు గూడ అపశబ్ద ప్రయోగములు చేయునా?

పాణినీయ వ్యాకరణమున నైదు గ్రంథములు గలవు. శబ్దానుశాసనము, ధాతుపాఠము, గణపాఠము ఉణాదిసూత్రములు, లింగానుశాసనము. ఇందులో శబ్దానుశాసనము అనగా అష్టాధ్యాయి ముఖ్యమైనది. మిగిలిన నాల్గును దాని పరిశిష్టములే. అష్టాధ్యాయిలో ఇంచుమించు 4000 సూత్రములు గలవు.

అష్టాధ్యాయి రచన సుసంబద్ధము. దీనిలో ఒక్క సూత్రావ్యతిక్రమముచే అర్థమున కనర్థము వాటిల్లి పోవును. ఈ గ్రంథావలోకనము చేయు ప్రతివ్యక్తియు దీని రచనా సౌష్ఠవమును జూచి ముక్తకంఠమున ప్రశంసించును. పాణినీయ సూత్రములను విశదముగ వివరించుటలో నత్యంతదక్షుడగు పతంజలిగూడ నిట్లు వ్రాసియున్నాడు.

సామర్థ్యయోగాన్న హి కించిదస్మిన్
పశ్యామి శాస్త్రే యదనర్థకం స్యాత్.

అష్టాధ్యాయి విషయమున పాశ్చాత్య విద్వాంసుల అభిప్రాయములు —

1. ప్రొ. మోనియర్ విలియంస్, — పాణినీయ వ్యాకరణము మానవ మస్తిష్క ప్రతిభకొక ఆశ్చర్యకరమైన ఉదాహరణ. అట్టిదేదేశము గూడ నింతవరకు సృష్టించియుండలేదు.

2 సర్ విలియం హంటర్ — ప్రపంచములోని వ్యాకరణములందు పాణినియొక్క వ్యాకరణము శిరోమణి దాని వర్ణశుద్ధత్వము భాషా ధాత్వన్వయ సిద్ధాంతము ప్రయోగవిధులు అత్యంత మహత్వపూర్ణావిష్కారములు.

3. ప్రొ టి. శేర్ వాత్స్కీ - పాణినీయ వ్యాకరణము మనుజమస్తిష్కము సృష్టించిన అన్నింటికంటె సర్వోత్కృష్టమైనది.

వర్తమానకాలమున సమస్త భారతదేశమందును పాణినీయ వ్యాకరణమే ముఖ్యముగ జదువబడు చున్నది. సుమారైదు శతాబ్దములనుంచి యీ వ్యాకరణ పఠన-పాఠనము పాణిని విరచిత క్రమమున గాక ప్రక్రియాక్రమముచే జరుగుచున్నది ఇది సర్వథా అస్వాభావికము. ప్రక్రియాగ్రంథాధారమున వ్యాకరణము చదువుటవలన అష్టాధ్యాయి క్రమమున జరిగినంత స్వల్పకాలములో జ్ఞానము లభించజాలుటలేదు. ఇంతేగాక అధ్యేతకు సూత్రముతో పాటుగ నాలుగైదు రెట్లెక్కువగ దానివృత్తి గూడ వల్లించవలసి వచ్చుచున్నది. అష్టాధ్యాయిక్రమమున చదువుటచే వృత్తి వల్లించవలసిన మహాపరిశ్రమ చేయవలసిన అవసరముండదు. ఛాత్రునికి కేవలము వృత్తికి సంబంధించిన దెరిగించినంతనే వృత్తి గతార్థమగుచున్నది. వ్యుత్క్రమముగ నధ్యయనము చేయుటవలన పూర్వా

పర క్రమము తెలుపుటకై 'విప్రతిషేధే పరం కార్యం, అసిద్ధవదత్రాభాత్, పూర్వత్రాసిద్ధం, పూర్వాత్ పరం బలీయః' ఇత్యాది విధుల విషయములో గ్రంథము పైననే ఆశ్రితులై యుండవలసి వచ్చుచున్నది ప్రక్రియానుసారముగ వ్యాకరణ మధ్యయనము చేయుటలో నింకొక పెద్దదోషము కూడ గలదు. ఈ గ్రంథములలో గుణము వృద్ధి ఇడాగమము మున్నగు ప్రకరణముల సూత్రములు విభిన్న స్థానములలో బంధింపబడియున్నవి గాన వీని విషయములో సంశయము గలిగిన విద్యార్థికి కూడ సంశయ నివారణ గావించుకొను నవకాశములేక పోవుచున్నాడు అష్టాధ్యాయిలో అన్ని ప్రకరణముల సూత్రములు ఒక స్థానములో సంగృహీతములై యుండుటచేత సాధారణవిద్యార్థియును తత్తత్ ప్రకరణ పాఠమున స్వల్పకాలమందే సందేహరహితుడగును. అనుభవజ్ఞులగు విద్వాంసుల నిర్ణీతాభిప్రాయము కూడ నిదియే

ఇక పాణినీయ వ్యాకరణముపై వ్రాయబడిన కొన్ని వ్యాఖ్యాగ్రంథముల గూర్చి విచారింతము:

వార్తికము — పాణినీయ సూత్రపాఠముమీద కాత్యాయన ప్రభృతులైన యాచార్యులెందరో వార్తిక పాఠము రచించిరి. అందులో క్రింద వ్రాయబడియున్న ఏడుగురు వార్తిక కారుల నామములు మాత్రమే మహాభాష్యము మొదలైన అనేక ప్రాచీన గ్రంథములలో లభించుచున్నవి: 1 కాత్యాయనుడు. 2. భారద్వాజుడు. 3. సునాగుడు. 4. క్రోష్ట 5. వాడవుడు. 6 వ్యాఘ్రభూతి 7 వైయాఘ్రపద్యుడు. వీరుగాక గోనర్దీయుడు, గోణికాపుత్రుడు కుణారవాడవుడు సూర్యభగవానుడు మున్నగు ఆచార్యుల అభిప్రాయములు గూడ మహాభాష్యములో నుద్ధృతములు. టీకాకారులు కొందఱు గోనర్దీయ గోణికాపుత్ర నామములు పతంజలికి నామాంతరములని తలంచుచున్నారు గాని వీరు భిన్నభిన్న వ్యక్తులేయని చెప్పవచ్చును.

## మహాభాష్యము

పాణినీయ వ్యాకరణముపై అన్నిటికంటె మహత్త్వపూర్ణకృతి పతంజలి విరచిత మహాభాష్యము. దీనిభాష అత్యంత సరళ, సరస, స్వాభావికమైనది. గ్రంథ రచనాదృష్టిచే నిది ఆదర్శభూతమై యొప్పనది. పతంజలి శుంగవంశ మహారాజైన పుష్యమిత్రుని సమకాలికుడు. వారి పురోహితుడని తెలుపబడుచున్నాడు. పాశ్చాత్య విద్వాంసుల అభిప్రాయము పుష్యమిత్రుని కాలము విక్రమశకమునకు 150 ఏండ్లు పూర్వమని. కాని భారతీయ పౌరాణిక కాలగణనాను సారముగ నితని కాలము విక్రమునికి సుమారు 1200 సంవత్సరములు పూర్వమని చెప్పబడుచున్నది.

మహాభాష్యమునకు టీకలు — మహాభాష్యముపైననేక వైయాకరణులు టీకా గ్రంథములు వ్రాసియుండిరి. ఈ టీకాగ్రంథములు రెండు విభాగములు. ఒకటి మహాభాష్యముపై రచించిన టీకాగ్రంథములు, కైయట విరచిత మహాభాష్య ప్రదీపముపై విరచించబడిన టీకా గ్రంథములు. మహాభాష్యముపై విరచించబడిన టీకా గ్రంథములలో నేడు ఇరువది గ్రంథములు సమగ్ర - అసమగ్ర గ్రంథము లుపలబ్ధములు. ఇట్లే మహాభాష్య ప్రదీపముపై వ్రాయబడినవి పదునైదు గ్రంథములు గలవు. ఈ టీకాగ్రంథములలో అన్నిటికంటె ప్రాచీనమైనది మహత్త్వపూర్ణమైనది యగు గ్రంథము భర్తృహరి విరచితమైన 'మహాభాష్యదీపిక'. పాశ్చాత్య పండితులు భర్తృహరి కాలము విక్రముని ఎనిమిదవ శతాబ్దమనిరి. వారి యుద్దేశ్యమునకు ముఖ్యాధారము ఇత్సింగుని లేఖ దానిలో నతడు భర్తృహరి మృత్యువునకు నలుబదియేండ్లు పూర్వమని వ్రాసెను ఇత్సింగుని వ్యాసము భ్రమమూలకము చెప్పన గేమనగా మహాభాష్యదీపిక, వాక్యపదీయ లరచయిత యగు భర్తృహరి ఇంచుమించుగ విక్రమునికి సమకాలికుడు అతడు విక్రముని కర్వాచీను డే పట్టునను గాడనునది నిశ్చితము.

భర్తృహరి విరచించిన మహాభాష్య టీక విషయమై మహాభాష్య ప్రదీపము, గణరత్న మహోదధి మొదలైన అనేక గ్రంథములలో నుల్లిఖితమై యున్నది. గణరత్న మహోదధిలో మహాభాష్యదీపికా పరిమాణము మూడు పాదములని వ్రాయబడి యున్నది దీని ఏకైక హస్తలేఖ బర్లిను పుస్తకాలయములో నున్నది అది ప్రథమ పాదముయొక్క జీవ్ఞ (1-1-55) సూత్రముపై సమాప్తమగుచున్నది. దాని మొదటి రెండు పుటలును ఖండితములైయున్నవి. ఈ హస్తలేఖ విషయమై ప్రథమ పరిచయ మొనర్చిన డాం కీల్ హార్న్ స్తుతిపాత్రుడు. దీని ప్రతికృతి (ఫొటో)యొకటి లాహోరు విశ్వవిద్యాలయ పుస్తకాలయములో నుండెడిది. 1930

లో మహా వైయాకరణులగు పండిత బ్రహ్మదత్త మహాశయుడా ప్రతికృతిని సంపాదించి దానికొక ప్రతిలిపి వ్రాసియుండెను. ఇప్పుడది వారివద్ద గలదు. బహుశా దీని ప్రతికృతి యొకటి మద్రాసులోని రాజకీయ హస్తలిఖిత పుస్తకాలయములో కూడ గలదు. ఆ టీక అత్యంత ప్రౌఢము మహత్వపూర్ణమును.

భర్తృహరి మహాభాష్యదీపిక తిఞవాతి భాష్యముయొక్క మహత్తర వ్యాఖ్య కైయట విరచిత మహాభాష్యప్రదీపము గ్రంథము. ఈ వ్యాఖ్య మిక్కిలి సరళమైనది-పాండిత్య పూర్ణమైనది. మహాభాష్యమువంటి దురూహ్య గ్రంథము నర్థము చేసుకొనుటకు నేడిదియే ముఖ్య సాధనము. దీని యింత మహోపయోగమును జూచి వైయాకరణులనేకులు మహాభాష్యమునకు వ్యాఖ్యలు వ్రాయక దీనికే టీకలు వ్రాసిరి. అందులోని సుమారు పదునైదు వ్యాఖ్యలు-పూర్ణ-లేక ఆంశిక రూపమున భారతదేశమందలి విభిన్న పుస్తకాలయము లందు నుండియున్నవి

వృత్తి గ్రంథములు:-పాణినీయ సూత్రపాఠముపై వైయాకరణు లెందరో వృత్తి గ్రంథములను వ్రాసిరి. స్వయముగ పాణినియు కూడ తన సూత్రముల కొక వృత్తి వ్రాసియుండెను. ఇప్పుడు లభించుచున్న అష్టాధ్యాయి వృత్తులన్నింటిలో కాశికావృత్తియే అన్నింటికంటె ప్రాచీనమైనది. కుణి మాథురాదుల అనేక వృత్తులు మహాభాష్యమునకు పూర్వమున వ్రాయబడియుండెను గాని వానిలో నేదియు నిప్పుడు లభ్యము గాకున్నది. కుణి విరచిత వృత్తి భర్తృహరి విరచిత మహాభాష్యదీపిక యందును మహాభాష్య ప్రదీపమందును నుల్లిఖితమైయున్నది. మాథురవృత్తియొక్క యొక్క ఛేయుద్ధరణ పురుషోత్తమదేవ విరచితమైన భాషావృత్తిలో లభించుచున్నద ఇవియేగాక కాశికా వృత్తికంటెను ప్రాచీనములైన భట్టి, నిర్లూరాది వృత్తుల కొన్నింటి పేర్లు ప్రాచీన టీకా గ్రంథములలో లభించుచున్నవి. నేడు లభ్యమగుచున్న అష్టాధ్యాయి వృత్తులలో నత్యంత ప్రాచీనమైనది ప్రామాణికమైనది కాశికా వృత్తి. ఒక్క భారతదేశమువందే గాక ఇతరదేశము లందును గూడ దీని పఠన పాఠన ప్రచారమైనదన్నచో దీని మహత్వము వేరు చెప్ప నేల? చంపా నరేశుడైన ఇంద్రవర్మ విషయమై యొక శిలాలేఖయం దిట్లున్నది-

“..... షట్తర్క జినేంద్ర సూర్మిః
సకాశికా వ్యాకరణోదకౌఘః”

కాశికావృత్తిలో నచ్చటచ్చట మహాభాష్యము యొక్క యభిప్రాయమును నిరసించియున్నను అది అప్రమాణికముగా లేదు. దీని సమస్త గ్రంథము అష్టాధ్యాయియొక్క ప్రాచీన వృత్తులపై నాశ్రితమై యున్నది ఆ వృత్తిలో నేడు లభించుచున్న సంస్కరణలోని ప్రథమ పంచాధ్యాయములు జయాదిత్య విరచితములు అంత్యమందలి మూడధ్యాయములు వామన విరచితములు చైనా యాత్రికుడైన ఇత్సింగు లేఖానుసారముగ కాశికావృత్తి రచనాకాలము విక్రముని ఏడవశతాబ్దము జినేంద్రబుద్ధి విరచిత న్యాసముల వలనను (8 1-83) అన్యత్రగల పాఠమువలనను జయాదిత్యుడును వామనుడును వేరువేరుగ సమగ్రమైన అష్టాధ్యాయియొక్క వృత్తులను రచించి యుండిరని వ్యక్తమగుచున్నది జయాదిత్య వామను లిద్దరి వృత్తుల సమ్మిశ్రణ మెప్పుడేల నయ్యెనో తెలియబడకున్నది. కాని న్యాసగ్రంథరచనకు పూర్వమే యీ సమ్మిశ్రణమైయున్నదని మాత్రము స్పష్టమగుచున్నది ఇద్దరి సమ్మిశ్రిత సంస్కరణముపై న్యాసనామక వ్యాఖ్య గలదు. విభిన్న గ్రంథములలో లభించుచున్న భాగవృత్తియొక్క యుద్ధరణలను బట్టి భాగవృత్తి రచనకు పూర్వమున జయాదిత్య—వామనుల ఇద్దరి వృత్తుల సమ్మిశ్రణమై పోయియుండెను. భాగవృత్తి రచనాకాలము విక్రమశకము 700 705 మధ్య కాశికావృత్తి వంటి మహత్తర గ్రంథముపైన అనేక వ్యాఖ్యాగ్రంథములు వ్రాయబడెను అందులో జినేంద్రబుద్ధి విరచిత న్యాసము—ఇంకొక పేరు ‘కాశికా వివరణ పంజిక’ అన్నింటికంటె ప్రాచీనమైన విశిష్టగ్రంథము దాని పిమ్మట హరదత్త విరచితమైన పదమంజరి హరదత్తుడు కాశికావృత్తిపై నొక మహాపదమంజరి కూడ రచించి యుండెను. కాని అది నేడు లభించుటలేదు. న్యాస రచనాకాలము విక్రమశకము 1100 కంటె పూర్వము. పదమంజరి విక్రముని 12 వ శతాబ్దములో రచింపబడెను కాశిక పిదప భాగవృత్తి. భాషావృత్తియొక్క వ్యాఖ్యాతయగు సృష్టిధరాచార్యుని మతములో భాగవృత్తియొక్క రచయిత భర్తృహరియని తెలియజేయబడినది ఈ భర్తృహరి మహాభాష్యదీపిక—వాక్యపదీయ రచయితయగు మొదటి భర్తృహరికంటె భిన్నుడు. కొందరు భాగవృత్తి రచయిత పేరు విమల

మతియని వ్రాసిరి. భాగవృత్తి రచయిత యథార్థ నామము విమలమతి. అతడు ప్రౌఢ వైయాకరణుడై భర్తృహరియను ఉపనామము గలిగియుండెనని భావింపబడుచున్నది. భాగవృత్తి రచన. వలభి నరేశుడు చతుర్థ శ్రీధరసేనుని కాలమందు విక్రమశకము 700 705 మధ్యలోనని యూహింపబడుచున్నది. ఇవియే గాక పురుషోత్తమదేవుని భాషావృత్తియు శరణదేవుని దుర్ఘటవృత్తియు గూడ ఉపయోగకరమైన గ్రంథములు. ఇవియు గాక ఇంకను 25 వృత్తులు అష్టాధ్యాయిపైన రచింపబడి లభించుచున్నవి ఇందులో నిప్పటికి మూడుమాత్రము అన్నంభట్టు విరచితమైన మితాక్షర, ఓరంభట్టు రచించిన వ్యాకరణ దీపిక, దయానందస్వామి విరచితములగు అష్టాధ్యాయి భాష్యములు ముద్రితములైనవి

ప్రక్రియా గ్రంథములు:-6 శతాబ్దములనుండి పాణినీయ వ్యాకరణ పఠన, పాఠనములు పాణినీయ అష్టాధ్యాయి క్రమమును విడిచి ప్రక్రియా క్రమమున జరుగుచున్నదని వ్రాసియుంటిమి గదా. ఆ ప్రక్రియా గ్రంథములలో నన్నిటికంటె ప్రాచీనమైనది ధర్మకీర్తియొక్క 'రూపావతార గ్రంథము'. ఈ ధర్మకీర్తి న్యాయబిందు రచయితయగు ధర్మకీర్తికంటె భిన్నుడు. విక్రముని 12వ శతాబ్దమున లేక అంతకు కొంచెము మునుపటివాడు. పాణినీయ వ్యాకరణ ప్రక్రియానుసారి గ్రంథము లనేకములు రచింపబడెను. అందులో రామచంద్ర విరచితమైన 'ప్రక్రియా కౌముది,' భట్టోజిదీక్షిత విరచితమగు 'సిద్ధాంతకౌముది' నారాయణభట్టకృతమగు 'ప్రక్రియా సర్వస్వ' మనునవి ముఖ్యగ్రంథములు. విక్రముని పదునారవ శతాబ్దములోని ప్రథమ చరణము రామచంద్రుని కాలము. భట్టోజిదీక్షితుని కాలము దాని ద్వితీయ—తృతీయ పాదములు. పదునారవ శతాబ్దపు టుత్తరార్ధము నారాయణభట్టు కాలము. ఈ ప్రక్రియా గ్రంథములపైన నెన్నో టీకలు రచింపబడినవి. ప్రక్రియా కౌముదిపై శేషకృష్ణుని, గ్రంథకర్త పుత్రుడైన విఠలుని వ్యాఖ్యలు ప్రసిద్ధములు. సిద్ధాంతకౌముదిపై స్వయం గ్రంథకర్త వ్రాసిన 'ప్రౌఢమనోరమ' వాసుదేవకృతమగు 'బాలమనోరమ' జ్ఞానేంద్ర సరస్వతి కృతి 'తత్త్వబోధిని' నాగేశభట్టకృత 'లఘుశబ్దేందుశేఖర'మను వ్యాఖ్యలు ముఖ్యములు. బాలకుల వ్యాకరణ జ్ఞానమునకై లఘుకౌముది, మధ్యకౌముదియను గ్రంథరచనయు జరిగెను.

## పాణిని కర్వాచీన శబ్దానుశాసనము

పాణిని యనంతరమున ననేక వైయాకరణులు శబ్దానుశాసన గ్రంథములు రచించిరి. అందులో కాతంత్ర, చాంద్ర, జైనేంద్ర, విద్యాధర, అభినవ శాకటాయన, సరస్వతీకంఠాభరణ, హైమ, సారస్వత, కౌమార, ముగ్ధబోధనములు ముఖ్యములు.

కాతంత్రము:- ఇది రెండుభాగములు. తద్ధిత ప్రకరణ పర్యంతము పూర్వార్ధము, కృదంత ప్రకరణ రూపమగు నుత్తరార్ధము తద్ధితాంతభాగము రచించినవాడు శర్వవర్మయని తలంచబడుచున్నది. శర్వవర్మ దీని బృహద్వృత్తి రచయిత. అమ్రుతులబట్టి కాతంత్ర రచన శాతవాహనుని కాలములో జరిగియుండెనని తెలియుచున్నది కాని ఈ వ్యాకరణ మతనికంటెను ప్రాచీనమైనది కాతంత్ర తద్ధితాంత భాగము పాతంజల మహాభాష్యముకంటెను ప్రాచీనమైనదని మా తలంపు కాతంత్రవృత్తికారుడైన దుర్గసింహుని మతమున కాత్యాయనుడు కృదంతభాగ రచయిత. ఈ కాత్యాయనుడే వరరుచి యని ఇంకొక పేరు గలిగి విక్రమాదిత్యుని సభాసదస్యుడై వారి పురోహితుడై యుండెను. కాతంత్ర వ్యాకరణ మత్యంత సరళమైన దగుటచే ఎక్కువ ప్రచారములోనికి వచ్చెను. విదేశీయ బౌద్ధమతావలంబుల కీవ్యాకరణమే సంస్కృత భాషాజ్ఞానము సమకూర్చుటకు ముఖ్య సాధనమయ్యెను. వారిద్వారా దీని ప్రచారము భారతదేశమునకు బయటగూడ విస్తరించెను కీత్ తన సంస్కృత సాహిత్య చరిత్రలో కాతంత్ర భాగములుకొన్ని మధ్యఆసియాలో భూమిత్రవ్వటలో లభించెనని వ్రాసియుండెను. కాతంత్ర ధాతుపాఠము టిబెట్టుభాషలో నిప్పుడును లభించుచున్నది. మారవాడి దేశములోని ప్రాంతీయ పాఠశాలలో మొన్న మొన్నటివఱకు బాలురకు ప్రారంభమున "సీధో వరణా సమామ్నాయా" పాఠము నేర్పబడుచుండెడిది. అది కాతంత్ర ప్రథమపాదముయొక్క వికృతి పాఠము అక్కడక్కడ అయిదు పాదములు చదివించు క్రమముగూడ గలదు బుందేలఖండమునగూడ 'ఓనామాసీదం' తరువాతి బాలురకీపాఠములు గఱపబడుచున్నవి. నేటిరోజులలో కాతంత్ర పఠనపాఠము ఒక్కబంగాళమునకే సీమితమై యున్నది. సుకుమారమతులగు కుమారులకు సంస్కృతము గఱపుటకు కాతంత్రము

రచింపబడెను గాన దీనికి కౌమారమనికూడ పేరుగలదు. అగ్ని, గరుడ పురాణములందు కాతంత్రమును కుమార—అనగా స్కందప్రోక్తమని చెప్పబడినది.

కాతంత్రముపైన నన్నింటికంటె పురాతనమైన వృత్తి దుర్గసింహుడు వ్రాసినదే నేడుపలబ్ధమగు చున్నది. ఈదుర్గసింహుడును నిరుక్తవృత్తికారుడగు దుర్గసింహుడు నొక్కడేయని చెప్పవచ్చును. ధాతువృత్తికారుడైన సాయణుని మతానుసారముగ ఈ దుర్గవృత్తి కాశికావృత్తికంటె ప్రాచీనమైనది. దుర్గవృత్తిపై దురసింహుడు ఉగ్రభూతి, త్రిలోచనదాసు, కాశిరాజు మున్నగు వైయాకరణు లెందరో టీకాగ్రంథములు వ్రాసియుండిరి. కాతంత్రముపై జినప్రభసూరి, జగద్ధరభట్టులుకూడ వృత్తులు రచించియుండిరి.

చాంద్రము:- వ్యాకరణవాఙ్మయమందు పాణినీయ వ్యాకరణము పిమ్మటి స్థానము చాంద్రవ్యాకరణమది. చంద్రగోమినామక ప్రసిద్ధ బౌద్ధవిద్వాంసుడు దీని రచయిత. చంద్రగోమి కాశ్మీర ప్రభువగు అభిమన్యుని ఆదేశముచే వినష్ట మహాభాష్యమును పునరుద్ధరించి తన వ్యాకరణము వ్రాసియున్నాడని కల్హణ విరచిత రాజతరంగిణివలన దెలియవచ్చుచున్నది. భర్తృహరి విరచిత వాక్యపదీయమువలనను దీనికి పుష్టి కలుగుచున్నది. మహారాజైన అభిమన్యుని కాలము విషయమున చరిత్రకారులలో వైమత్యముగలదు. పాశ్చాత్యపండితులు విక్రమునికి 400 వర్షముల పూర్వము పరముఖముగను వివిధ కాలము లూహించెదరు. కల్హణుని గణనానుసారము అభిమన్యుడు విక్రమునికి 1100 యేండ్ల ప్రాచీనుడు.

చాంద్రవ్యాకరణములో నిప్పుడాఱధ్యాయములు లభించుచున్నవి. ఈ ఆఱధ్యాయములందు లౌకిక భాషాశబ్దముల అన్వాఖ్యానము మాత్రమే గలదు. చాంద్రవ్యాకరణము కేవలము లౌకిక భాషావ్యాకరణమని నేటినుండి 800 వత్సరముల పూర్వము వైయాకరణుల అభిప్రాయము. కాని చాంద్రవ్యాకరణమందు స్వరప్రకరణముకూడ గలదని యనేక ప్రమాణముల ద్వారా తెలియవచ్చుచున్నది. చాంద్రవ్యాకరణము 1-1 184 వృత్తిలో స్వరప్రకరణముయొక్క 'అనావసః' సూత్రముకూడ ఉద్ధృతమైయున్నది. స్వరశాస్త్ర ముఖ్యప్రయోజనము వేదములయందు వచ్చుచున్నది. గనుక నే చంద్రగోమి వైదికభాషావిషయక సూత్రములనుకూడ రచించియుండెనని తోచుచున్నది.

చాంద్రవ్యాకరణము 1-1-145 వృత్తియొక్క "సర్వ విశేషవుష్టమే వక్ష్యామః" పాఠముచే చాంద్రవ్యాకరణమందుకూడ నెన్మిదధ్యాయములు గలవని విదితమగుచున్నది. ఈ పాఠమువలన స్వరప్రకరణ మెన్మిదవ అధ్యాయమందు గలదనియు దెలియుచున్నది. కనుక నేడవ యధ్యాయమందు వైదిక ప్రకరణముండియుండు ననుట సిద్ధము. చాంద్ర వ్యాకరణములోని స్వర—వైదికప్రకరణ విషయకమైన అంతిమాధ్యాయములు రెండును చిరకాలమునుండియే వినష్టమైపోయి యున్నవని యీ వివేచనవలన విదితమగుచున్నది. చాంద్రవ్యాకరణమునకు ముఖ్యాధారములు పాణినీయ శబ్దానుశాసన—పాతంజల మహాభాష్యములు. కాని చంద్రగోమి అనేక స్థానములందు వాని నుపేక్షించి ప్రాచీన వ్యాకరణములను ఆశ్రయించెను. చాంద్ర సూత్రముల యొక వృత్తి రోమన్ అక్షరములలో ముద్రితమైయున్నది. అది ధర్మదాసు విరచితమని చెప్పబడు చున్నది గాని గ్రంథముయొక్క ఆంతరిక—బాహ్య సాక్ష్యములవలన నది చంద్రగోమి స్వవిరచిత వృత్తి యని ప్రతీతమగుచున్నది.

జైనేంద్రము:- ఈ వ్యాకరణమును ఆచార్య దేవనంది- ఇంకొక పేరు పూజ్యపాదుడు- విరచించెను. పూజ్యపాదుడు శబ్దానుశాసనముపై శబ్దావతారమను నొక న్యాసముకూడ రచించెను. పూజ్యపాదుని కాలము విక్రమశకము 500 550 మధ్య. జైనేంద్ర వ్యాకరణముయొక్క రెండు సంస్కరణ లిప్పు డుపలబ్ధములు. అభయనంది మహావృత్తి రచించినది యొకటియును గుణనంది శబ్దార్ణవ చంద్రిక రచించినది రెండవదియును. ఇందులో నభయనంది స్వీకృతసూత్రపాఠ మౌదీచ్య పాఠమని పిలువబడుచున్నది. రెండవది దాక్షిణాత్యమని. ఔదీచ్యపాఠము దాక్షిణాత్య పాఠముకంటె లఘువైనది. ఈ రెండుపాఠముల ఆంతరిక—బాహ్య పరీక్షవలన నౌదీచ్య పాఠమే జైనేంద్రుని మూలపాఠమని తేలుచున్నది. జైనేంద్రుని యౌదీచ్యపాఠముపై అభయనంది, ప్రభాచంద్రాచార్యుడు మహాచంద్రుడు మొదలగు ఎందరో వైయాకరణులు వృత్తులు వ్రాసిరి. స్వయముగ దేవనందియు కూడ తన సూత్రపాఠముపై జైనేంద్ర సంజ్ఞక న్యాసము వ్రాసియుండెను.

విశ్రాంత విద్యాధరము—దీనిని వామనుడు వ్రాసియుండెను. సంస్కృత వాఙ్మయమున వామను

డను పేరుగల గ్రంథకర్త లెందఱో ప్రసిద్ధిగాంచిరి. ప్రసిద్ధ జైన తార్కికుడు మల్లవాదిసూరి విశ్రాంత విద్యాధరముపై ఒక వ్యాసగ్రంథము విరచించెను. రాజశేఖరకృత ప్రబంధకోశానుసారముగ మల్లవాది కాలము విక్రమశకము 875 సం॥ రములు. విశ్రాంత విద్యాధర వ్యాకరణము, గణరత్నమహోదధి, హైమ బృహద్వ్యాసాద్యనేక గ్రంథములలో నుల్లేఖింపబడి యున్నది. కాని యీగ్రంథ మిప్పు డప్రాప్యము.

అభినవ శాకటాయనము — జైనాచార్యుడు పాల్యకీర్తి దీనిని రచించెను. పాల్యకీర్తి అమోఘవర్ష నృపాలుని ఆస్థానములో సదస్యుడు గాన నతడు తన వ్యాకరణవృత్తి నామ మమోఘయని పెట్టెను. అమోఘవర్షుని రాజ్యకాలము విక్రమశకము 871-924 యని తెలయబడుచున్నది. పాల్యకీర్తి విరచిత శబ్దశాసనమునకు శాకటాయన నామ మేల వచ్చినదో తెలియవచ్చుటలేదు. జైనవైయాకరణులయందు పాల్యకీర్తి యసాధారణ వైయాకరణుడై యుండుటచేత నతని కిది యుపనామమై యుండవచ్చును. ఏలనన వైదిక మతావలంబులగు వైయాకరణులలో శాకటాయనుడను వాడు సర్వశ్రేష్ఠ వైయాకరణుడని తలచబడుచుండెను. శాకటాయనుని స్వోపజ్ఞావృత్తి ఇంతవఱకును ప్రకటితము గాలేదు. దీనిపై యక్షవర్మ యొక్క చింతామణి పేరుగల లఘువృత్తి యొకటి ప్రకటింపబడినది.

సరస్వతీ కంఠాభరణము — ధారాధిపతియగు భోజదేవుడు సరస్వతీ కంఠాభరణమను పేరుతో నొక శబ్దానుశాసనమును రచించెను. ఇది మిక్కిలి విస్తృతమైనది. గ్రంథకర్త గణపాఠము పరిభాషాపాఠము, లింగానుశాసనము మున్నగు నన్నింటిని సూత్రపాఠమందే సన్నివేశ మొనర్చివేసి యుండెను. ఈ శబ్దానుశాసనమునకు ముఖ్యాధారములు పాణినీయ—చాంద్ర వ్యాకరణములు భోజకృతమైన సరస్వతీ కంఠాభరణమను నొక సాహిత్య గ్రంథముగూడ గలదు. భోజుని కాలము విక్రమ శకము 1075—1110 వరకును. సరస్వతీ కంఠాభరణముపై దండనాథుడు 'హృదయహారిణి' యను టీక వ్రాసెను. ఇదన్నింటికంటె ప్రాచీనమైనది. దేవరాజయజ్వ నిఘంటుభాష్యములో దీనినుద్ధృతముజేసియుండెను. ఈ టీక నాల్గవ అధ్యాయమువఱకు ముద్రితమైనది.

రెండవది కృష్ణలీలాశుకమునియొక్క మహాన్యాసపూర్ణ టీక. అది ఇంకను అముద్రితము.

హైమశబ్దానుశాసనము — జైనాచార్యుడగు హేమచంద్రసూరి దీని రచయిత. హేమచంద్రుడు విక్రమశకము 1145 లో ధుంధుక (అహమదాబాదు) ములో జన్మించెను. 1220 లో స్వర్గస్థుడయ్యెను. హైమశబ్దానుశాసనములో సంస్కృత—ప్రాకృతముల రెండింటి యనుశాసనము గలదు. మొదటి యేడధ్యాయములలో సంస్కృత వ్యాకరణము, ఎనిమిదవ యధ్యాయమున ప్రాకృతభాషా వ్యాకరణము గలదు. హైమ వ్యాకరణరచన పాణినీయ చాంద్ర, జైనేంద్ర, జైనశాకటాయనాది ప్రాచీన శబ్దానుశాసనముల మాదిరిగా నుండక కాతంత్ర సదృశముగ ప్రకరణానుసారియై యున్నది. హేమచంద్రుడు తన సూత్రపాఠముపై లఘ్వీ, బృహతి యను రెండు వృత్తులు వ్రాసియుండెను. బృహన్న్యాసవృత్తి ఇంతవఱకును ప్రకటితము కాలేదు. హేమచంద్రుడు తన వ్యాకరణముపై 90 వేల శ్లోక పరిమాణముగల బృహన్న్యాసము గూడ రచించియుండెనని చెప్పుదురు. ఇతడు తన వ్యాకరణమునకు ధాతుపాఠము గణపాఠము ఉణాదిసూత్రము లింగానుశాసన మను పేరుగల ఖిలపాఠములను గూడ రచించియుండెను. వీటిపై గ్రంథకర్త రచించిన వృత్తులుగూడ లభించుచున్నవి. నూట యిరువదియైదు వేల శ్లోకముల పరిమాణముగల పంచాంగ వ్యాకరణ మిత డొక సంవత్సరములో రచించినాడని మేరుతుంగాచార్య కృతమగు ప్రబంధ చింతామణిలో వ్రాయబడియున్నది.

సారస్వతము — ఈ వ్యాకరణ రచయిత నామము అనుభూతిస్వరూపాచార్యుడు. విక్రమశకము 1300 సం॥ రముల దాదాపున ఇతని కాలమని చెప్పబడెను. క్షేమేంద్రుడు తన సారస్వత ప్రక్రియాంతమున, ఇది నరేంద్రాచార్యుని రచనయని వ్రాసెను. తదనుసారము కొందరు పండితులు దీని మూలకర్త నరేంద్రాచార్యుడని భావించుచున్నారు. ప్రక్రియా కౌముది మున్నగు ననేక గ్రంథములలో నరేంద్రాచార్యుని ప్రసంగము గలదు. నరేంద్రసేను డను వాడొక వైయాకరణుడు, ప్రమాణ ప్రమేయ కలికా రచయిత గలడు. నరేంద్రసేనునకు చాంద్ర, కాతంత్ర జైనేంద్ర, ఐంద్ర, పాణినీయ శబ్దానుశాసనములపై

నధికారము గలదని వ్రాయబడి యున్నది. నరేంద్ర సేనుని గురువు కనకసేను డతనిగురువు అజితసేనుడు. ఈ నరేంద్రసేనుడు విక్రమశకము 1111 సం॥రముల ప్రాంతమువాడు. నరేంద్రసేనుడును నరేంద్రాచార్యుడు నిద్దఱు నొక్కరా? వస్తుతః సారస్వత సూత్రకర్త యెవరు? ఇదియొక సమస్య. అనుభూతి స్వరూపుడు సారస్వత ప్రక్రియా గ్రంథముకూడ వ్రాసియుండెను. సారస్వత ప్రక్రియపై ననేకులు టీకలు వ్రాసియుండిరి అందు చంద్రకీర్తియొక్క సుబోధిని అన్నింటికంటె శ్రేష్ఠమయినది. కాశీనాథుడు సారస్వతముపై భాష్యము రచించెను కాశీనాథుడు విక్రమశకము 1667 వర్షముల దాదాపువాడు.

కౌమారము:- దీనిని క్రమదీశ్వరుడు వ్రాసియుండెను. దీని స్వనామము సంక్షిప్తసారము. క్రమదీశ్వరుని గ్రంథ మసంపూర్ణమై యుండగా జూమరనంది దానిని బూర్తి చేసియుండెనని కొందరు చెప్పుదురు. జూమరనంది దీనికివృత్తి వ్రాసెననియు దీనిని ప్రకటించి యుండెననియు మా యభిప్రాయము. ఈ హేతువు చేతనే యిది కౌమారమని ప్రసిద్ధి కెక్కినది. జూమరనంది యొక్క వృత్తిపేరు 'రసవతి'. ఈ వ్యాకరణముపై గోపీచంద్రుడు కూడ వృత్తి వ్రాసియుండెను. 1200 ప్రాంతము జూమరనంది కాలము. ఆఫ్రెక్ట్ ఇతనిని బోపదేవునికి బూర్వుడనియు కోల్‌బ్రుక్ తరువాతివాడనియు భావించుచున్నారు

ముగ్ధబోధము—ఇది బోపదేవుని రచన. బోపదేవుని తండ్రిపేరు కేశవుడు. గురువుపేరు ధనేశుడు. ధనేశుడు మహాభాష్యమునకు టీకయొకటి వ్రాసెను. విక్రముని పదునాల్గవ శతాబ్దపూర్వార్ధ మితని కాలము. మహారాష్ట్ర సామ్రాజ్య కాలమున ముగ్ధబోధ విశేష ప్రచారములోనికి వచ్చెను. ఇప్పుడొక్క బంగాళ దేశము వఱకిది సీమితమై యున్నది ఈ వ్యాకరణము చాల సంక్షిప్తము.

ఇవియుగాక సుపద్మము, హరినామామృతము మొదలయిన యనేక వ్యాకరణములు వ్రాయబడెను. ఇవి అప్రసిద్ధములై ఏకదేశీయములై యాధునికములై యుండెను. శబ్దానుశాసన రచయితలు హేమచంద్రునితో పూర్తియైరి. పిమ్మట వాస్తవిక రూపమున వ్యాకరణమని చెప్పబడు వ్యాకరణ గ్రంథ మేదియును రచింపబడలేదు. సారస్వత, ముగ్ధబోధ, సుపద్మాదులు బాలుర కుపయుక్తములు. ఇవి చదివినంత నెవ్వడును వైయాకరణుడు కాజాలడు. సంస్కృతభాష—దాని విషయములు ఏ కొంచెమో తెలియునన్నది వేఱు మాట.

పరిశిష్టము—ప్రతియొక శబ్దానుశాసన రచయితకు ధాతుపాఠ గణపాఠ రచనము చేయవలసి యుండును కొందఱు వైయాకరణులు ఉణాది సూత్రములు -లింగానుశాసనముకూడ రచించిరి. ఈ నాల్గును శబ్దానుశాసనమునకు ఖిలములనగా పరిశిష్టములని చెప్పబడును ఈ అయిదవయవముల సమూహమే పంచాంగమని పంచపాఠి యను పేర్లతో వ్యవహృత మగుచుండును.

ధాతుపాఠము— ప్రతియొక్క పదముయొక్క ప్రకృతి-ప్రత్యయ విభాగమును జూపించుట సంస్కృత వ్యాకరణశాస్త్రముయొక్క ముఖ్యప్రయోజనము. శాకటాయన ముఖ్య వైయాకరణులు సమస్తనామ శబ్దములను ఆఖ్యాతజము=ధాతుజములని యనిరి. కనుక ధాతుపాఠము వ్యాకరణశాస్త్రమునకు ప్రధానాంగము. ఉపలబ్ధ ధాతుపాఠములందు పాణినియొక్క ధాతుపాఠ మన్నింటికంటె ప్రాచీనమైనది పాణినికంటెను ప్రాచీనమైన ఆపిశలి ధాతుపాఠముకూడ ననేక ప్రాచీన గ్రంథములయం దుల్లేఖింపబడినది. పాణినీయ ధాతుపాఠముపై క్షీరస్వామి, మైత్రేయరక్షితుడు సాయణుడు వ్రాసిన వృత్తు లుపలబ్ధము లగుచున్నవి. చాంద్రధాతుపాఠముపై పూర్ణచంద్రుని వృత్తి యున్నది. కాతంత్ర ధాతుపాఠము టిబెట్టుభాషలో లభించుచున్నది. జైనేంద్ర, జైనశాకటాయన, హైమ శబ్దానుశాసనముల ధాతుపాఠములు వారి స్వకీయములు వేఱుగనున్నవి హేమచంద్రుడు తన ధాతుపాఠముపై 'పారాయణ' మను పేరుగల వృత్తి వ్రాసియుండెను.

గణపాఠము—శబ్దానుశాసన సూత్రపాఠమును సంక్షిప్తము చేయుటకు గణపాఠ రచన జరిగెను. లభించుచున్న గణపాఠములలో పాణినియొక్క గణపాఠ మత్యంత ప్రాచీనమైనది. ఆపిశలియొక్క గణపాఠచర్చ భర్తృహరి మహాభాష్యదీపిక 1-1.27 లో గావించియుండెను. పాణినీయ గణపాఠము కాశికాది వృత్తి గ్రంథములలో జదువబడినది--వేఱుగ స్వతంత్ర రూపమునను లభించుచున్నది. చంద్రుని గణపాఠ మతని వృత్తిలో ముద్రితమైనది. ఇట్లే జైనేంద్ర,

శాకటాయనాదుల స్వకీయ గణపాఠములు కూడ స్వతంత్రములై యుపలబ్ధము లగుచున్నవి భోజదేవుడు గణపాఠమును తత్తత్ సూత్రములందే చదివినాడు. గణపాఠముపై జైనపండితుడైన వర్ధమాన సూరియొక్క గణరత్న మహోదధి గ్రంథము చాల ఉత్కృష్టమైనది. ఇందు ఇంచుమించుగ అన్ని గణపాఠములయొక్కయు వివేచనము గలదు. పాణినీయ గణపాఠముపై భట్ట యజ్ఞేశ్వరుని "గణరత్నావళి" యను పేరుగల టీక లభించుచున్నది.

ఉణాది సూత్రములు — శాకటాయనాది వైయాకరణులు కొందఱు సంపూర్ణనామ-శబ్దములను ధాతుజములని తలంచుచుండిరి. వారి సంప్రదాయ రక్షణకై ఉత్తరవర్తులైన ఆచార్యులు తమ శబ్దానుశాసనములకు పరిశిష్టరూపములో ఉణాదిసూత్రములను రచించిరి. ఇప్పుడివి యన్నియును అన్ని వ్యాకరణములకు సంగములైయున్నవి. ప్రాచీన-ఉణాది సూత్రములు రెండు విధములవి లభించుచున్నవి. ఒకటి పంచపాది రెండవది దశపాది. పంచపాదియొక్క ఆధారముపై దశపాది రచన జరిగియున్నదని తెలియవచ్చుచున్నది. పంచపాది ఉణాదిసూత్రములు శాకటాయన విరచితములని తలంచబడుచున్నదిగాని యిది పొరపాటు. ప్రక్రియా సర్వస్వముయొక్క ఉణాది ప్రకరణములో నారాయణభట్టు పంచపాది పాణిని విరచితమని పేర్కొనినాడు గాని పంచపాది ఆపిశలి కృతి, దశపాది పాణిని కృతియని మా యభిప్రాయము. పంచపాది ఉణాది సూత్రములపై దాదాపు 20 టీకలు జ్ఞాతములు.

వాటిలో శ్వేతవనవాసి, ఉజ్వలదత్తు, స్వామిదయానందుని వృత్తులు శ్రేష్ఠములు. దశపాదిపై ఒక ప్రాచీన అజ్ఞాతనాముడు రచించిన వృత్తి మాకు లభించినది. ఇది అనేక వ్యాకరణ గ్రంథములలో ఉద్ధృతమైయున్నది. ఇదిగాక దశపాదిపై ఇంకను రెండు వృత్తులు గలవు ఒకటి విఠ్ఠలుని ప్రక్రియా కౌముదీ ప్రసాదాంతర్గతము. రెండవది అజ్ఞాతనామము గలది. కాతంత్ర, చాంద్ర సరస్వతీకంఠాభరణ, హైమసారస్వత వ్యాకరణములకుగూడ వారి వారి ఉణాది సూత్రములు గలవు. వీటిపై ననేకటీకలుగూడ లభ్యమైయున్నవి.

లింగానుశాసనము — ఇప్పుడు అన్నింటికంటె ప్రాచీనమైన పాణిని లింగానుశాసనము ప్రాప్తమైయున్నది. వ్యాడి విరచిత లింగానుశాసనముయొక్క ఉద్ధరణ లెన్నియో, ప్రాచీనగ్రంథములందు గానవచ్చుచున్నవి వామన, హర్షవర్ధన, శాకటాయన, వరరుచి, హేమచంద్రుల లింగానుశాసనములు గూడ నిప్పుడు లభ్యమైయున్నవి. వీటిపై అనేక టీకలు గలవు. చాంద్ర లింగానుశాసనము చాల గ్రంథములలో నుద్ధృతమైయున్నది. సంస్కృతభాషలో లింగజ్ఞానమత్యంత దుష్కరము గనుకనే ప్రతియొక వైయాకరణుడును దీనిపై తన గ్రంథమును వ్రాసియుండెను.

## వ్యాకరణ-వేదాంత గ్రంథములు

సంగ్రహము :— వ్యాకరణముయొక్క అన్నింటికంటె ప్రాచీనము మహత్వపూర్ణమైన వేదాంతగ్రంథమిది ఆచార్య వ్యాడి అపరనామము గల దాక్షాయణుడిది వ్రాసియుండెను భర్తృహరి ఇందులో పదివేల పదార్థముల పరీక్ష గావించబడియున్నదని నుడివినాడు దాక్షాయణుడు పాణినికి మేనమామ. కొందఱు మేనమామ కొడుకని చెప్పుదురు. శబ్దబ్రహ్మ వాదమున కాది ప్రవర్తకుడు వ్యాడియని చెప్పుదురు. మహాభాష్యములో "సంగ్రహము" రెండు తావులయందుల్లేఖించబడినది. "సంగ్రహము" చిరకాలముక్రిందటనే ఉత్సన్నమైపోయి యుండెనని వాక్యపదీయ ద్వితీయకాండవలన దెలియుచున్నది

వాక్యపదీయము — ఇది ఆచార్య భర్తృహరి రచన దీనికి మూడు కాండలు గలవు బ్రహ్మకాండము, పదకాండము, ప్రకీర్ణకాండము. ప్రాచీన పరంపరానుసారము ప్రకీర్ణకాండ వాక్యపదీయమున కవయవము గాదు వర్ధమానుడు వ్రాసెను—

'భర్తృహరిర్వాక్యపదీయ ప్రకీర్ణయోః కర్తా' వాక్యపదీయ కాండల మొదటి రెండింటియందును గ్రంథకర్త స్వవివరణముగలదు. ద్వితీయ కాండపై పుణ్యరాజ, తృతీయ కాండపై హేలారాజ వ్యాఖ్యలు ముద్రితములైనవి.

లఘుమంజూష — ఇది నాగోజిభట్టు రచన. దీనిపై ననేక టీకలు గలవు నాగేశుడు దీని సంక్షిప్త సంస్కరణము వ్రాసియుండెను. అది పరమలఘు మంజూష యను పేరుతో బ్రసిద్ధికెక్కియున్నది.

ఇంకను గొన్ని వేదాంత గ్రంథములు గలవు గాని పైన పేర్కొనబడిన మూడు గ్రంథములే ముఖ్యములైనవని తలంచబడుచున్నవి.

వ్యాకరణశాస్త్రముయొక్క ప్రాచీన వాఙ్మయము మిక్కిలి విశాలమైనది. ఆ వాఙ్మయమును బూర్తిగ దెలియజేయవలెనన్నచో ఎన్నియో పెద్ద పెద్ద గ్రంథములు కావలసియున్నవి. అయినను ఈ వ్యాసములో వ్యాకరణ శాస్త్రముయొక్క ప్రధాన రచయితలను వారి గ్రంథములను సంక్షిప్తముగ దెలియబఱచి యుంటిమి—

[కళ్యాణి పత్రిక సౌజన్యంతో]

# ఉరిత్రాడు

శ్రీ జి. కె. మూర్తి

## : పాత్రలు :

వెంకన్ననాయుడు........తండ్రి
లక్ష్మి ........కూతురు
రాజన్న ........అల్లుడు
చిట్టి ........మనుమరాలు
సూరి ........కొడుకు

* * దృశ్యం:—ఏరుప్రక్క పాత యిల్లు, ప్రక్కనే పశువులసాల; కుడివేపు ఏరు కనిపించేటట్టు రెక్కల తలుపుల ద్వారం; సాలలో రెండు గడ్డికుప్పలు, కర్రలమేటు. ఆప్రక్కనే చిల్లుబడుతున్న ఒక ఎండుదుంగ; దుంగపైని గొడ్డలి...

సాలలో ఒకమూల అటకమీదనుంచి నాలుగైదడుగుల కొబ్బరిత్రాడు వేలాడుతూ వుంటుంది. కొసన జారుముడి "ఉరి"గా వేయబడి ఉంటుంది. ఒక తుప్పుపట్టిన నాగలి, వ్యవసాయపు పరికరాలు పడి ఉంటాయి. ఒక మూల వాటికి చేరువగా ఒక పాత కుర్చీ గోడ కానించి ఉంటుంది. సాల ముందుభాగంలో పొడవైన, పాత బల్ల ఒకటి ఉంటుంది, దానిపై కొన్ని వడ్రంగి పనిముట్లు ఉంటాయి. ఆ బల్ల ముందూ, ఎడమవేపూ రెండు బెంచీలుంటాయి.

సమయం:—వసంతారంభం. సాయంత్రం గం. 6-30. నీరెండలో ఏటిపైన కెరటాలు మెరుస్తుంటాయి. ఆకాశంలో సాగిపోతున్న రెండు మేఘాలఅంచులు బంగారంలా మెరుస్తూవుంటాయి. నాటకం సాగుతున్నంతసేపూ ఈ రంగు క్రమంగా హెచ్చి, మెల్లగా తగ్గి సిందూరంగా మారుతుంది. తెర లేచేటప్పటికి చిట్టి ఒక త్రాడు పట్టుకొని గెంతుతుంటుంది, వయస్సు పది సంవత్సరాలు. ముఖంలో పూర్తిగా అమాయకత్వం కనిపిస్తుంటుంది. వయస్సుకి తగ్గ జ్ఞానం ఆమెలో కనిపించదు. ఎదుట్నే ద్వారం దగ్గర పడున్న రబ్బరు బొమ్మమీద ఆ పిల్ల దృష్టి ఉంటుంది. వెలుపల అడుగులశబ్దం విని, చప్పున ఆట ఆపి, బొమ్మను తీసి భయంతో గుండెలకు అద్దుకొని, ఒక్క క్షణం ఆగి, ఆలోచించి బల్ల క్రింద దూరి దాక్కుంటుంది. అంతలో వెంకన్ననాయుడు ద్వారం దగ్గరకొచ్చి, సాలలోనికి దృష్టి సారించి, నిదానంగా చూస్తాడు. సన్నగా, ఎత్తుగా ఉండి, భుజాలు కూనిపడ్డ అరవై అయిదు సంవత్సరాల మనిషి. సన్నని బలం

లేని కాళ్లు పక్షవాతంతో చుట్టుకుపోయి ఉండడం చేత, లావుపాటి చేతికర్ర ఆసరాతో జోగుతూ నడుస్తుంటాడు. పట్టుదల పెదవుల బిగింపులో కనిపిస్తూంటుంది. పాలిపోయి ముడతలుపడ్డ ముఖం. బట్ట తల. ప్రక్కలను మాత్రం కొద్దిగా, నెరసిన వెంట్రుకలు. దట్టంగా పెరిగిన కనుబొమల్లోనుంచి కష్టంగా చూపు ఆనుతుంది. వంకర తిరిగిన చిలక ముక్కు. పళ్లులేని లోదవడలు. మాసిన గడ్డం, మాసిన గుడ్డలు అక్కడక్కడ చిరుగులు.

వెంక : (తాపీగా గదిలోకివస్తూ, అనుమానంగా నలువైపులా పరికించి బల్లమీద చేయి ఆనుకొని నిల్చుంటాడు. చిట్టి రెండోవైపునుంచి స్రగువ పారిపోతుంది. వెంకన్న త్రుళ్లి పడ్తాడు. చేతికర్ర గాలిలో ఆడించి బెదరిస్తాడు...కోపంతో) పో! యిక్కణ్ణుంచి పో! దొంగభడవా! దెయ్యమా! నా వెనక పడ్తావెందుకూ? వాళ్లు పళ్లిమని ఉంటారు. నాకు తెలుసు. చాటునుండి దొంగతనంగా నేనేం చేస్తున్నానో చూస్తుండమని పంపించి ఉంటారు. (ద్వారందాకా కుంటుతూ వెళ్లి జాగ్రత్తగా చూసి లోనికి వస్తాడు) తెలుసుకోగలమనుకుంటున్నారేమో! వాళ్ళ తాతలు తిరిగి రావాలి తెలుసుకోవాలంటే ...(తాడు ముందు నిలబడి, జాగ్రత్తగా చూసి, బెత్తంతో దాన్ని ఆడించి చూసి తనలో తాను నవ్వుకుంటూ) గట్టిగానే కట్టాను! ఎంత గట్టిగా కట్టాలో అంత గట్టిగానే కట్టాను. కాలపాశంకంటె గట్టిగా వుంది! (సంతృప్తితో నవ్వుకుంటూ) అప్పుడు చూస్తారుగా వాళ్లు! వాళ్లు అప్పుడు చూస్తారు! (బెంచీమీద అతికష్టంగా కూచుంటూ బయటకు చూసి) సాయం ఛాయలు పాకుతున్నాయి! పగలు పయనిస్తోంది! ఏమిటో జొచ్చింది (తనలో తాను గొణుక్కుంటూ ... తర్వాత స్పష్టంగా) నన్ను కనిపెడావటే పాడుముండా! ... (మళ్ళీ తనలో) వీధిలో నడవకుండా కాళ్లు కట్టేస్తారు ... గమ్యం దాపుకొస్తోంది!... రోజులు నిండిపోయాయి!...అంతం సమీపించింది ... (యింతలో కూతురు లక్ష్మి వొస్తుంది. నీరసించిన ఆకృతి. నలభైయేళ్ళ మనిషి — కొరకొరలాడే ముఖం — తారస్థాయిలో మాట్లాడుతుంది ఎప్పుడూ — తండ్రి దగ్గర కొస్తూనే బెత్తంకి అందని దూరంలో నిల్చుంటుంది.)

లక్ష్మి : నాన్నా! డాక్టరు నిన్న చెప్పింది మళ్ళీ మర్చిపోయావ్? ఒక్క దగ్గర స్థిమితంగా కూర్చుమన్నారా నిన్ను!...యిటూ అటూ తిరగకూడదని చెప్పలేదూ?...లోపలకిపద ...భోజనాల వేళయింది, యింకా నీవు మందు తీసుకోవాలి— డాక్టరు అన్నట్టూ...

వెంక : (పరధ్యానంతో) నీ వేరాలకు తగిన శిక్ష అనుభవించే దినం వస్తోంది...దేవుడు కనికరించడు...శిక్షిస్తాడు!

లక్ష్మి : నీ ఒంటి ఆరోగ్యం గురించి నీవు ఆలోచించుకోపోతే ఎలా నాన్నా? నువ్వీ గదిలోకి యికరావద్దు — అటువేపు నేను వెళ్లానో లేదో యిక్కడికి నువ్వు తయారు! ఏమిటీ దాగుడు మూతలు? నీ నడవడి చూస్తుంటే నాకు మతిపోతూంది.

వెంక : అదిగో! ప్రతి ఒక్కరూ నన్ను చూసి అంటున్నారు — తల్లిని పోలి వచ్చిన పిల్లవని...

లక్ష్మి : (కోపంగా) అయితే అయ్యాను. మాఅమ్మ పోలికవాలో ఉంటేనేం? ఆ దేవుడు నీపోలిక లివ్వలేదు రక్షించి. ముసలిపీనుగా! రోజంతా వాగవాగుడూ నువ్వూ! నీ పీనాసితనంతో మాఅమ్మని కొరుక్కుతిని దాన్ని యీలోకంనుంచి పంపించేసావు...నీ పాపం పోవాలంటే దానిపేరు జపంచేస్తూ తపస్సు చెయ్యాలి! దానికి నీవు చేసిన అన్యాయాలకి భగవంతుడి దగ్గర క్షమకోరుకోవాలి...

వెంక : తల్లి ఎలాంటిదో పిల్ల అలాంటిదే!

లక్ష్మి : సిగ్గులేదూ అలా అంటానికి? అదిచచ్చి యింకా ఆకాడు దల్లారలేదు—నువ్వా దూల ముండచుట్టూ కుక్కలా తిరగలేదూ? ఊరు ఊరంతా గగ్గోలయిపోయినా నీకు సిగ్గులేకపోయింది... పైపెచ్చు దాన్ని మళ్లా పెళ్లి చేసుకున్నావు! యింటికి తీసుకొచ్చావు! నేను మరిచిపోయాననుకున్నావేమో! అనుభవిస్తావులే—యీపాపం నిన్నుకట్టి కుడపక పోదు? మీయిద్దరూ కలిసి మా అమ్మను చంపి వేసినట్టే నన్నూ చంపేసుందురు. ముందే మేలుకొని తొందరగా నేను పెళ్లాడక పోయింటే... ఆ నరకంలోనుంచి బయట పడ్డమే చాలనిపించింది నాకు!...అతను కాపువాడని ఎంతనీలిగావు? ఇదంతా దాని పితలాటకమేగా! నాకు తెలీదూ, నువు దాని చేతిలో కీలుబొమ్మవని! మహా నీతి మంతుడిలా నువ్వు యింకొకర్ని ఎగతాళి చెయ్యడం కూడాను! నీ తలమీది వెంట్రుకలు పండి పోయాయి. ఒక్క పుణ్యకార్యం చేసిన పాపాన పోయావ్?...

వెంక : నీ పాపాలకు తగినశాస్తి అవుతుంది—

లక్ష్మి : ఇల్లువొదిలి వెళ్లిపోయిన ఆ తరేళ్లు మీ సంగతి ఊరంతా చెప్పలేదూ? నీ ముద్దుల పెళ్లాం—నీకొడుకంటున్నావే, ఆ వెధవా, నువ్వూ ఎంతగౌరవంగా బ్రతికారో నాకు తెలీదూ? కంటబడిన ప్రతి మొగాడివెంట అదిపోతుంటే నువ్వు కళ్లుమూసుక్కూచున్నావు—నీతో వుండడం మొఖం మొత్తి అది యింకొడితో పారిపోతే, నువ్వూ నీకొడుకూ ఎన్ని అవస్థలు పడ్డారో నాకు తెలీదూ? మార్యంట! మార్యం! పాపం అయిదేళ్ళూ నిండని బిడ్డని వొదిలి ఎలా పోగలిగిందో ఆయిల్లాలు!

వెంకన్న : మార్యం!...మార్యం!

లక్ష్మి : ఆ! తల్లినిపోలిన పిల్లలాగే—పిల్లడుకూడా! నన్ను తిడ్తూ నువ్వన్నమాటే అది—నన్ను తీసుకురావడానికి ఎంత అవస్థపడ్డావు— ఎంత ప్రాధేయపడ్డావు?—బావకూడా రావాలట! ఎందుకూ? యిక్కడ నానా చాకిరీ చెయ్యడానికీ—ఆతల్లి వొదిలేసిన పిల్లణ్ణి పెంచడానికీ—ఏం ఎత్తు?—ఇన్నేళ్ళూ నీకళ్ళలో ఒత్తులెట్టుకొని చూశావు!—ఏం చేశాడు?—ఎంత కృతజ్ఞత చూపించాడు? నువు దాచుకున్న డబ్బు దొంగిలించి, చెప్పకా చెయ్యకా పారిపోయాడు. వెధవకి పదహారేళ్ళు నిండలేదు. అప్పుడే చూడు ఆ పాడు బుద్ధులు! తన బతుకు తను చూసుకోగలడట! నీ ముఖం యెదుటే అన్నాడుగా ఆ మాట! నువ్వేడుస్తూ తిడ్తుంటే ఎలా నవ్వుపోయాడో మరిచిపోయావా? నువ్వు ఉరితాడు కడుతుంటే ఎంత వెర్రిగా నవ్వి, హాస్యం చేశాడో జ్ఞాపకం లేదూ? తిరిగి యింట్లోకి వస్తే ఉరేస్తానన్నావ్! మహా గొప్ప ప్రతిజ్ఞ చేశావులే! నీకోసం తిరిగి వస్తాడు ఆ వెధవ మళ్ళీ!

వెంక : చూస్తావులే—చూస్తావ్!

లక్ష్మి : నీలాంటి పిచ్చివాడి వ్యవహారంలో నోరెత్తడం నాదే పొరపాటు! కానీ-ఆఖరుసారి మళ్లీ చెపుతున్నా-వాడు తిరిగిరాడు-ఒకవేళ తిరిగివచ్చినా నీ చేతుల్తో వాడి తలకాయ ఆ ఉరిలో దూర్చడం కల్ల అని తెలుసుకో-అచ్చంగా ఆ తల్లి పోలికే వాడున్నూ తెలుసా? పైపెచ్చు నీ ముసలి పుర్రెని ఆ ముడిలో దూర్చి బిగించి వేలాడదీయగలడు. నీ దగ్గర యింకా ఏమైనా డబ్బు మిగిలి ఉందని తెలిస్తే...అంచేత ఆ తాడు పీకి పారేయ్-ఎలాగా పారిపోయాడు-మరింక రాడు-ఎక్కడో చచ్చి ఉంటాడు యిప్పటికే.

వెంక : (భయంతో) లేదు! ఎప్పటికీ అలా కాదు-

లక్ష్మి : అట్లాంటి రకాలు అకస్మాత్తుగానే చస్తారు. మోట ముండవాళ్లు, మూర్ఖమృగాలు—అయ్యో! చూశావా? భోజనాల వేళవ్వొస్తుంది. ఇంకా పొయ్యన్నా రాజెయ్యలేదు. నీ పిచ్చిగోలలో పడి భోజనాల విష

యమే మరిచిపోయాను-రా-పద మందు తీసుకుందువుగాని- చూసుకున్నావుగా నీ బంగారం తాడు; ఎవరూ ముట్టనైనా లేదు-యిలా కూమని జపం చేస్తే ఏం ప్రయోజనం లేదు- నా మాటలు వినపడ్డంలేదా? మళ్ళీ పరధ్యానంలో పడ్డావేమిటి? ఎవరు మాట్లాడుతున్నారో తెలుసా?— నేనే! లక్ష్మిని- మీ అమ్మాయిని నాన్నా నీ కూతురిని-

వెంక : (అర్థంలేని కోపంతో) నా కూతురివటే కాపుముండా! (బెత్తంతో గట్టిగా కొడతాడు చేతిమీద- లక్ష్మి కేక వేసి దెబ్బ తగిలినచోట పట్టుకుంటుంది బాధతో!)

లక్ష్మి : (ఏడుస్తూ కోపంతో) ముసలి పీనుగా! యిది కదూ చివరికి నువ్విచ్చేది యింత కనికరం చూపిస్తున్నందుకు!

[మనిషి అడుగుల చప్పుడు- రాజన్న ప్రవేశం బలంగా వుంటాడు కుటిలత్వం, టక్కరితనం చూపుల్లో కనిపిస్తుంటాయి-త్రాగి ఉంటాడు- కోపంగా ఉంటాడు]

రాజ : ఇంకా వంట కాలేదూ? సోమరిముండా! ఏంటే సంగతి?...ఏంటయిందీ".

లక్ష్మి : తప్పంతా నాన్నదే! లోపలికి రమ్మంటుంటే రాకుండా చూడు—చూడు యీ దెబ్బ! ఎంత గట్టిగా కొట్టాడో—ఆ వెధవ కర్రతో కొట్టాడు.

రాజ : కొట్టాడూ! ఏదే! ఉండు వీడి పనిపడ్తా! (కోపంతో ముందరికి వెళ్ళబోతుంటే లక్ష్మి పట్టుకుంటుంది)

లక్ష్మి : వొద్దు!—దగ్గరికి వెళ్ళొద్దు! - ముట్టుకోవద్దు రోగం తిరగబడుతుంది - కోపంలో ఊపిరాడక చచ్చిపోగలడు కిక్కురుమనకుండా!

రాజ : చస్తే పీడవిరగడవుతుంది!

వెంక : కాపు వెధవా! ఉండుండు! దేవుడున్నాడు! వొస్తుంది - మీకు కాలం దగ్గర కొస్తుంది!-

రాజ : తిట్టుకో! ఊపిరాడక ఉక్కిరిబిక్కిరయి నువ్వు చచ్చేంత వరకూ తిట్టుకో! నీలాంటి పాపిష్ఠివాడి ప్రార్థనలే వింటాడు దేవుడు! (పెళ్ళాంతో) యిక్కడికెలా వచ్చాడు? - నేను వెళ్ళేటప్పటికి అడుగు కదపలేని నీరసంతో ఉన్నాడే!

లక్ష్మి : అనూరిగాడు పోయిననాటినుంచీ వున్న రోగమేగా యిది! అదో ఆ తాడు భద్రంగా వుందో లేదో చూసుకుందికి -

వెంక : (తాడు చూపిస్తూ) హహ! వొస్తాడు! వాడు తప్పక వొస్తాడు! అప్పుడు మీరే చూస్తారుగా - చూస్తారుగా!

రాజ : (భయంతో) ఆపవయ్యా వెధవ గోల! (బలవంతంగా నవ్వి) ఏం తెలివినీది? ఆదొంగ వెధవ మళ్ళీ తిరిగి వస్తాడనే! నీ పిచ్చి చూస్తుంటే నవ్వొస్తుంది - నీకోసం పాపం యీ ఉరిలో బుర్ర పెట్టడానికి వస్తాడు. అయిదేళ్ళయింది పారిపోయి - యింతవరకూ వాడేమయ్యాడో ఒక్క పిసరు తెలీదు - రోజూ రాత్రి పగలూ నీతిట్లగోల తప్ప యింట్లో మరోటిలేదు - పాపం! దేవుడు రోజూ నీ ప్రార్థన వింటూనే వున్నాడు - కాని ఏంలాభం - యింతవరకూ కనికరించలేదు.

లక్ష్మి : ఎంతకోపపడ్డి లాభం ఏమిటి? యింతసేపూ నేను చెప్పాను

రాజ : అనూరిగాడిని ఏనాడో పోలీసులే ఉరి తీసి ఉంటారు - అని నాకు తెలుసు! నేను బాధపడే రకం అనుకున్నావేంటే? (తాడు చూసి) యీ తాడు పీకి పారేస్తే తంటా తీరి పోతుంది. లాగేయనా? ఏదో ఒకనాడు తప్పదుగా! ఇది లాగేస్తే యీ పీనుగ రోగం కుదురుతుంది. చచ్చినట్టు ఒకమూల కూచుంటాడు - తరువాత - ఏమో....(తాడు అందుకోబోతాడు-ముసలాడు కోపంగా, పిచ్చిగా కర్ర జాడిస్తూ కేకలు వేస్తాడు)

లక్ష్మి : వొద్దు! వొద్దు! వొదిలెయ్! అటు చూడు కోపంతో పాపం మాటాడలేక పోతున్నాడు. గుండెలాగి పోగలదు! ఆ తాడు అలాగే వుండనీ - అదిలా ఉంచటంవల్ల మనకి పోయేదేంటి?

రాజ : (దూరంపోతూ ఆగి) అది ఇలా వేలాడ్తుంటే చూడ్డానికి అసహ్యంగా వుంది - చావు నోరు

తెరచి పిలుస్తున్నట్టు భయం వేస్తుంటుంది! (ముసలాడు సంతృప్తితో కూర్చుంటాడు) చిట్టేదీ?—కేకెయ్యి—వీణ్ణి లోపలికి తీసుకెళ్తుంది—వీడికి తెలియకుండా నీతో ఒక విషయం మాట్లాడాలి చిట్టీ!—చిటీ! (చిట్టి పరుగెత్తుకుంటూ వస్తుంది, మాటుగా పట్టుకుంటాడు రాజన్న చిట్టిని—భయంతో వొదిలించుకుంటుంది) తాతని తీసుకెళ్లు లోపలికి—అక్కడే ఉండేట్టు చూస్తుండు. యిటు రానివ్వకు

లక్ష్మి : అలమరలో మందుంది, మందు తాగించు.

రాజ : (చిట్టి బిక్క చచ్చి చూస్తుంటే కోపంగా) ఏం వినబడిందా లేదా? మొద్దు మొగమా—వెళ్ళు—వెళ్ళూ—(భార్యతో) యింత తెలివిమాలింకేం ఇది? చెప్పానుగా ఆపాటి అర్థం చేసుకోలేదు? నీకు బుద్ధి చెప్పాలే; దాన్ని నువ్వే యిలా తయారు చేశావ్—అటు చూడు వాణ్ణి—మీ వంశంలోనే వుంది—వెనక పిచ్చి జాట్టు!......మా కొంపాళ్లలో...

లక్ష్మి : మళ్ళీ తాగి వచ్చావన్నమాట! అందుకే అంత జోరుగా వొస్తున్నాయి మాటలు!

చిట్టి : అమ్మో! భయమేస్తోందే!

రాజ : (తాత దగ్గరికి వెళ్లి) లేవయ్యా! లే! చిట్టితో యింట్లోకి వెళ్ళు. (తాత కర్రతో కొట్టబోతాడు) ఆ! కొడ్తావూ! నన్నే—(కర్ర విదిల్చి తీసుకుంటాడు) లే! ఊ! లేస్తావా లేదా? (జబ్బ పట్టుకొని లేపి) యిదుగో—చిట్టీ యీ చెయి పట్టుకో ఊ—ఁదూ—తీసుకెళ్ళు...

లక్ష్మి : పసివాన్నా—నేనూ వొస్తున్నా—

వెంక : (మొండిగా నిల్చి) భగవంతుడా! నా బాధ చూశావ్! నా తిప్పలు చూశావ్! నన్ను కాపాడు! వీళ్ళని...

రాజ : (తోస్తూ—తాత కదలడు. చిట్టి నవ్వబోయి ఊరుకుంటుంది భయంతో) నోరు మూసుకొని లోపలికి పో! ఊ—నడు—

వెంక : ఈ పాపానికి తగిన ప్రతిఫలం అనుభవిస్తారు! భగవంతుడా ఇలా చేస్తున్నావా?—

రాజ : నోర్ముయ్! నోటికుండేలా ఎందుకలా వాగుతావ్! యిదిగో నీ చేతికర్ర—(యిచ్చి దూరంగా తప్పుకుంటాడు) జాగ్రత్త! చిట్టికి గాని బెత్తం తగిలిందా నీ వీపు చిట్లగొట్టేస్తా; ఆ!—మర్యాద దక్కదు.

వెంక : (చిట్టిని తోసి—కర్ర ఆడిస్తూ) వాళ్ళ బ్రతుకుల్లో నిప్పులు పొయ్యి! శపించు—వాళ్లని నాశనం చెయ్యి! భగవంతుడా—

చిట్టి : (చెయిలాగుతూ) రా తాతా వెళ్దాంరా! (ముసలాయన చిట్టి మెల్లగా నిష్క్రమణ)

రాజ : అరి భగవంతుడా! ముసలాడి నోట్లో విషం కక్కే నాలిక పెట్టావా? మాట మాటకి విషం కక్కుతుంటాడు. (కూచుని) రా! యిలా రా! కూచో! నీతో మాట్లాడాలి— (లక్ష్మి ప్రక్కనే కూర్చుంటుంది)

రాజ : (కన్నుతో సైగచేస్తూ) యీవాళ వాడిని చూశానే!

లక్ష్మి : (బోగ పసెక) ఎవడూ?

రాజ : ఇంకెవరే! వాడే వెంకటనారాయణ—ప్లీడరు గుమాస్తా! వాణ్ణి చూద్దామనేగా కొట్టుకెళ్ళాను. ఇన్నాళ్ళూ మనం దేని కోసం నానా గుంజాటన పడ్డామో అది యీవాళ తెలిసిపోయింది తాగొచ్చావని అనుకుంటున్నావు కదూ? నీ వనుకున్నదీ, అనుమానించినదీ నిజం! అక్షరాల నిజం! కాని ఎందుకు తాగానో అది నీకు తెలీదు. అదంతా వొక ప్లానే! ఎంత తాగినా నేను తట్టుకోగలను కానీ—వాడున్నాడే—ఆ ప్లీడరు గుమస్తా వాడు నిలబడలేడు. నాలుక తడుస్తేనే మాట పెగుల్తుంది. మనకి కావలసిన రహస్యం కక్కేశాడు

లక్ష్మి : నాన్న వీలునామా విషయం ఏమయినా చెప్పాడా?

రాజ : ఆ! చెప్పాడు—(నిరాశతో) మనకి మొండి చెయ్యే—యిన్నాళ్లూ మనకి తెలియక ఎంత లాభమో, మనకి యిప్పుడు తెలిసీ అంతే

(ఆలోచించి—టేబిలు మీద గుద్దుతూ) వెధవ పిసనారి ముసలి పీనుగ!

లక్ష్మి : ఇంకేం చెప్పాడు?

రాజ : అసలు ఏమీ చెప్పలేదు మొదట. వాడొక టక్కరి నక్క! నీ పేగు నీకు చెప్పడానికే లంచం కావాలంటాడు! పాపం యింత డబ్బు గడిస్తాడా అంతా కల్లు పాకకే చెల్లు కడ్తాడు. అది తెలిసే యీవాళ వాణ్ణి కొట్టుకి పట్టుకెళ్ళాను. వాడి తత్వం తెలిసి కడుపునిండా పట్టించి, అడిగాను వీలునామా గురించి. ముసలాడు పిచ్చెత్తిపోయాడు, యీవాళో, రేపో బాల్చీ తన్నేస్తాడు, యింకా రహస్యం ఎందుకని వచ్చి చెప్పాను. వాడేగా వీలునామా రాశాడు! తల కెక్కింది విషా—అంతా కక్కేశాడు. అన్నాడూ "ఏం లాభం లేదు రాజన్నా! భూములన్నీ సూరిగాడి పేర రాసేశాడు" అని. నేనన్నానూ "పొలాలు పోతేపోనీ వాటి శిఖా కోసిరి అవతలికి కావాలి. తలకిమించిన తాకట్లలో అవేమున్నాయ్, డబ్బు—నగదు—నగదేం చేశాడూ" అని. "ఏబ్బా! ఏం డబ్బా" అని తెల్ల మొగం వేశాడు. నగదు విషయం అసలు వీలునామాలో నే లేదట, ఒట్టు వేసి మరీ చెప్పాడు. ఒలవంగం చేసినా లేదనే అన్నాడు—చూశావా మీ నాన్న ఎంత జిత్తులమారో!

లక్ష్మి : ఆ గుమాస్తా అబద్ధం చెప్తున్నాడేమో!

రాజ : ఒట్టు వేస్తే!

లక్ష్మి : అది లేచిపోయేముందు భూమిమీద నాలుగు వేలు తెచ్చాడే!

రాజ : ఆ అప్పుకి వడ్డీకోసం నేను రెక్కలు ముక్కలు చేసి, చెమటోడ్చి, నెల నెలా కడుతున్నానే కష్టార్జితం.

లక్ష్మి : ఆడబ్బేంచేసాడో! ఖర్చు మాత్రం చెయ్యలేదు-అదినిజం. అన్నీ రూపాయలేనట! కోటిరెడ్డి స్వయంగా చెప్పాడు నాతో. నాన్న ఖర్చు చెయ్యలేదు.

రాజ : ఆ! ఆముసలి ముఖానికి ఖర్చు చెయ్యడం కూడా తెలుసా? నేను వొళ్ళువంచి కష్టపడక పోతే యీపాటికి వీధిలో చిప్పపట్టుకు తిరిగేవాడు! నీకుమాత్రం తెలీదూ?

లక్ష్మి : ఆరంకుముండగాని ఆడబ్బు లంకించుకు పోయుంటుందా?

రాజ : ఏమో! నాకు తెలీదు. అదినీకే తెలియాలి. అన్నట్టు అది పోతూ పోతూ ఉత్తరం రాసిందిగా! ఆభూమిమీద తెచ్చిన డబ్బు తనకక్కర్లేదనీ, అదిసూరిగాడి చదువుకి ఖర్చు చెయ్యమనీ...లక్ష్మీ! సూరిగాడు ఆరోజు నాలుగొందలు ఎక్కడ్నుంచి దొంగిలించాడంటావ్?...ఉందే—ముసలాడి దగ్గర రొక్కం నగదేవుంది. అంటే అప్పుడన్నమాట...అయిదేళ్ళ క్రితం అన్నమాట.

లక్ష్మి : అలా అయితే ఆడబ్బు యీ యింట్లోనే ఎక్కడో దాచిపెట్టి వుంటాడు.

రాజ : దాచివుండొచ్చు. నీ అనుమానం నిజం అయిండొచ్చు. మీనాన్న నిద్రపోయిం తర్వాత యీ వేళ రాత్రికి ఆమూలగది తవ్వి చూద్దాం. ఈమధ్య పదేపదే ఆగదిలోకి వెళ్తున్నాడులే!

లక్ష్మి : ఔను! ఆగది వొదలి ఉండటంలేదు కూడా. ఇంకా ఏమయినా చెప్పాడా ఆ గుమస్తా?

రాజ : మరింకేం చెప్పలేదు. ఆ! అన్నట్టు యింకొకటి చెప్పాడు. పత్రికల్లో సూరి గాడి గురించి ప్రకటించమన్నాడు. ఏడేళ్లలోగా వాడి ఫికరు లేకపోతే, వాడు చచ్చినట్టే కోర్టులో జమకట్టి వారసులుగా మనకి ఆస్తిపాస్తుల్ని ఆధీనం చేస్తారట. అంటే యింకో రెండేళ్లు ఆగాలన్నమాట మనం. దమ్మిడీ రొక్కం ఆస్తి లేకుండా, తలమునిగిన అప్పుల్లో యీ భూముల్ని మాత్రం ఏంచేసుకుంటాం? అన్నట్టు ముసలాడు యీ మధ్య కొత్తకొత్త బట్టలు కొంటున్నాడే! డబ్బెక్కడనుంచి తీస్తున్నాడో!

లక్ష్మి : మతిచెడిపోయిందే మరి, నాన్న వీలునామా పనికొస్తుందన్నాడా గుమస్తా?

రాజు : వీలునామా రాసినప్పుడు మతిసరిగ్గానే ఉండేదిసిందట!

లక్ష్మి : మతి సరిగ్గాలేదని మనం దావా చేద్దాం!

రాజ : కోర్టుకెక్కితే ఒకంతట్లో తెగుతుందే... ఎంతఖర్చు!

లక్ష్మి : అయితే మనం ఏమీ చెయ్యలేమన్న మాట!

రాజు : ఆ! అంతే! ఏమీ చెయ్యలేం! ఆ సూరిగాడిని చంపరా బాబూ అని ఆ దేవుణ్ణి ప్రార్థించడమో లేదా యీ ముసలిపీనుగ ఎక్కడ డబ్బు దాచాడో వెతికి మనమే తెలుసుకోవడమో అంతే! నీకన్నా శం(పోయిపోయాడు గాని పీక పిసికి చంపాలన్నంత కోపం వస్తోంది నాకు. (జేబులోంచి బుడ్డితీసి తాగుతాడు) ఒకరిద్దరు పాలేరుల్ని పెట్టి సాగు చేయిద్దామే! మునుపు బంగారం పండేదిగా యిప్పుడుమాత్రం పండదా? ఏమో మన అదృష్టం ఎలావుందో!

లక్ష్మి : అంతే—నిజంగా ఎంత మంచిభూమో తెలుసా?

రాజ : ఇదుగో మీ నాన్న యింకా అట్టేకాలం బతకడులే! డాక్టరు చెప్పనే చెప్పాడు ఇంకో సారి మూర్ఛవచ్చిందంటే సఫా! ముసలి పీనుగ! ఇంతకీ ఆ డబ్బెక్కడ పాతిపెట్టాడో చెప్పి మరీ చస్తే బావుండును (యింకో గుక్క తాగి) సరే! మనకష్టం మనం పడదాం పైసా పరకా దాచివుంచితే ఆతర్వాత చూసుకోవచ్చు. ఎరలు పెరిగిపోతున్నాయి. ...(యిద్దరూ బైట అడుగులచప్పుడు విని త్రుళ్లిపడి చూస్తారు చిట్టి కీచుగొంతుకతో నవ్వుతూంటుంది. ఒక యువకుని గొంతుక వినిపిస్తుంటుంది మన్యమన్య!) చిట్టిలావుంది కదూ? ఎవరూ చిట్టితో మాట్లాడుతున్నారు చెప్మా? కొంపతీసి వాడుకాడుకదా! (యింతలో సూరి వస్తాడు. చిట్టి వాడి చేతిని పట్టుకొని అనుతూంటుంది. పాతికేళ్లుంటాయి. చక్కని ముఖం, నవ్వుతున్న కళ్లు, ఎత్తుగా బలంగా ఉంటాడు. ఉంగరాలజుట్టు నుదుటిపై పడుతూవుంటుంది. నిర్విచారం సూచించే పల్చని పెదవులు వెక్కిరిస్తున్నట్లుంటాయి. లోనికివచ్చి సూటిగా గ్రాడు క్రిందనే నిల్చుంటాడు. దంపతులు ఒకరి నొకరు అర్థంచేసుకున్నట్లు ఆశ్చర్యంతో చూసుకుంటారు.)

సూరి : (నవ్వుతూ) అలా ఆశ్చర్యపోతారేం? నేనే! అయిదుసంవత్సరాలు దేశదేశాలన్నీ తిరిగి తిరిగి విసుగెత్తి ఈనాటికి ఇంటికొచ్చాను. మీకు నిజంగా ఆశ్చర్యంగా వుందికదూ? (లక్ష్మిదగ్గరికి వెళ్ళి) ఇన్నేళ్ళూ తప్పిపోయిన తమ్ముణ్ణి చూస్తే నీకెలావుందే అక్కా? చిన్నప్పుడు మనమిద్దరం ఎలా పోట్లాడుకునే వాళ్ళం? ఎంతగట్టిగా కొట్టుకునేవాళ్ళం.

లక్ష్మి : మీదపడతావేం? దూరంగావుండు—

సూరి : కొంచెంకూడా మారలేదే నువ్వు! వయస్సు మాత్రం జారిందంతే.. ఆఁ...ఏమయ్యా నాయకుబావా?

రాజ : ఒరే! సిగ్గులేదూ...నీలాటివాడికి...

సూరి : (బెదిరిస్తూ) ఆలోచించి మాటాడోయ్! చిన్నప్పుడు నీతో చీటికిమాటికి చీవాట్లు తిన్నట్టూ తిన్న సూరిగాణ్ణి కాను తెలుసా? అది జ్ఞాపకం పెట్టుకో! యిప్పుడు నీలాంటి వాళ్లని ముగ్గుర్ని దొంతరపెట్టి తంతాను! ఆ!

లక్ష్మి : (వెండిరూపాయి ఎగరవేస్తూ ఆడుకుంటున్న చిట్టితో) చిట్టే ఏమిటది? ఎక్కడిది రూపాయ్? యిలాతే! తెస్తావా లేదా? (చిట్టి రూపాయి ఇవ్వకుండా ఒళ్ళో దాచుకుంటుంది—మౌనంగా ద్వారం దగ్గర నిలుచుంటోంది.)

సూరి : దాన్నలా ఆడుకోనీవే! ఎందుకంత కోపం? అది రూపాయి...కరిచేయదులే. నేనే ఇచ్చాను. బైట కనుపించి, మీరిద్దరూ ఇక్కడున్నారని చెప్పింది—ఏమయినా కొనుక్కోమని యిచ్చాను తప్పా?...దీని సంగతి నాకు జ్ఞాపకమేలేదు. ఉంటేఉంటే బొమ్మలేమయినా తెచ్చిఉందును.

లక్ష్మి : అక్కర్లే! నువ్వేమీ తేనక్కర్లే—యిచ్చినా ఆ రూపాయి మనకొద్దు, ఎవడి బుఱ్ఱకొటి తీసు

కొచ్చాడో—చిట్టీ పారేయ్. అక్కడ పారేయ్—ఊ! పారేశావా లేదా?... ఎవరికి చెపుతున్నా...విన్నావా లేదా? (చిట్టి బిక్క చచ్చి ఏడుస్తుంది. మెల్లగా వచ్చి నూరికి ఆరూపాయిస్తుంది)

నూరి : (రూపాయి తీసుకుంటూ, లక్ష్మిని అపహాస్యంగా చూసి) నువ్వు ఏమీ మారలేదనటంలో నేను అబద్దం చెప్పలేదన్నమాట! నీలో ఎంతకుళ్లువుందో బైటికి వేరేగా కక్కి చూపించాలా? (చిట్టిని బుజ్జగిస్తూ) ఊరుకో అమ్మ ఊరుకో...పద! బైటికిపోయి ఆ కొండచివరదాకా వెళ్ళి నీళ్లల్లోకి చిల్ల పెంకులు విసురుదాం. కప్పగంతులు వేయిస్తా—చిన్నప్పుడు ఆడేవాళ్లం జ్ఞాపకముందా? (చిట్టి వెంటనే ఏడుపు మానేస్తుంది. కళ్లల్లో ఆనందం కనిపిస్తుంది. చప్పట్లు కొట్టి గెంతుతుంది )

చిట్టి : (నూరిచేతిలోని రూపాయిని చూపిస్తూ) ఇది విసురుదాం మామా బాగా గంతులేస్తుంది నీట్లో—

నూరి : (నవ్వుతూ) అద్దదీ! నిజం చెప్పావుతల్లీ! ఇది విసిరిపారేయటానికే తయారయింది! పాతిపెట్టి పాకరవేసుకోడానికి కాదు! ఇదిగో! తీసుకో! బలంగా, సత్తువకొద్దీ విసురు, యిదినీదే. (చిట్టి రూపాయి తీసుకుని ద్వారంవేపు పరుగెత్తుతుంది) అమాయకురాలు! చాలా మంచిపిల్ల—మీరిద్దరూ దాన్ని చెరిపేస్తున్నారు.

చిట్టి : (తిరిగివచ్చి) మామయ్యా రావూ! రామరీ—నే విసురుతా నువు చూద్దువుగాని.

నూరి : వొస్తున్నా నమ్మా! (లక్ష్మితో) ఒక్క నిమిషం బయిటికి వెళ్తాను. ఒక్కసారి నాగురించి ఎంతవిషం కక్కాలనుందో మీరిద్దరూ కక్కేసుకోండి యీలోగా. (బెదిరిస్తూ) మళ్ళీ తిరిగొస్తా, సావకాశంగా అప్పుడు మాట్లాడుకుందాం. తమాషాకోసం యిన్నాళ్ళకి తిరిగి యింటికి రాలేదు నేను. ఆవిషయం మీరెంత త్వరలో గమనిస్తే అంత మంచిది.

చిట్టి : రా మామయ్యా! చూద్దూగాని—రామరీ!

నూరి : పద! (వెళ్తాడు. ద్వారానికి చేరగిలబడి నిలబడ్డాడు. చిట్టి కొంచెందూరంలో గుమ్మం అవతల నిల్చొని నీటికేసి చూసి ఆనందిస్తుంటుంది.)

చిట్టి : విసరేదా? యిప్పుడు విసరేదా? యిక్కడ్నించి విసరేనా?

నూరి : నేను ఒకటి, రెండు, మూడు అంటాను. మూడు అనేసరికి విసురు. రెడీ (చిట్టి చేయి ఊపుతుంటుంది విసరడానికి) ఒకటి, రెండు, మూడు. (రూపాయి విసురుతుంది. తొంగి చూస్తుంది.)

చిట్టి : (చప్పట్లు కొడుతూ) అదిగో-నాక్కనిపించింది. నాక్కనిపించింది తళుక్కున నీటిలో మెరిసి మునిగిపోయింది. అడుక్కుపోయింది కదు మామా?

నూరి : అమ్మదొంగ బాగా విసరావే! ఎంతదూరం విసరావ్! రెండు చిల్ల పెంకులు పట్టుకొని) చూడవే విసుర్తా (వెళ్తాడు)

రాజ : (ద్వారంవేపు దొంగతనంగా చూసి నిట్టూరుస్తూ) అనుకోడమే తరవాయి దెయ్యంలా తయారై పోయాడు ఎక్కణ్ణుంచో—నీళ్ళల్లోకి రూపాయలెట్లా విసురుతున్నాడో చూడు. వెధవ! మనం దమ్మిడీకోసం యింత కష్టపడి చెమటలు కారుస్తూ అవస్థపడుతున్నాం

లక్ష్మి : (వారిస్తూ) వాడన్నమాటలు విన్నావా? ఈ వెధవ ఉరికే నే వొచ్చినట్టు కనిపించటం లేదు. (మెల్లిగా) భూములు వీడికే నాన్న రాసినట్టు తెలిసుంటుందంటావా వీడికి?

రాజ : ఎలా తెలుస్తుందే? (సందేహంలో) ఏమో! (నిర్ధారణతో) వాడి విషయం వాకొదిలే! ముఖం ముందే నీ ఉక్రోషం చూపించాలే నువ్వు? మీరంతా ఒక్క మూసలోంచి వచ్చినవాళ్ళే-కొంచెమయినా విచక్షణ లేదు. ఎందుకొచ్చాడో, ఏమిటో మెల్లిగా మాట్లాడి తెలుసుకోవాలా? నేను వీడిని బుట్టలో వేస్తా, నీవెళ్లి మా నాన్నతో చెప్ప

వీడొచ్చాడని - జాగ్రత్తగా చెప్పు సుమా - ఒక్కసారి సంతోషం పట్టలేక ముసలాడు ఆ ఉన్న రెండు ప్రాణాలూ గుటుక్కున వొదిలేగలడు. ఉన్న భూమంతా యీవాళే నూరిగాడి స్వాధీనం అయిపోగలదు!

లక్ష్మి : నెమ్మదిగానే చెప్తాలే! ఆపాటి నాకు తెలీదూ?

రాజ : ఏమోలే! లేకపోతే యీరాత్రే మనం బయలుదేరాల్సొంటుంది నెత్తిని కొంగు వేసుకొని. (లక్ష్మి బయలుదేరుతుంది. రాజన్న అనోలా తనలో) వచ్చీ రావడం వాడు ఎక్కడనిల్చున్నాడో చూశావా... సరిగా ఆ ఉరితాడు కిందే బుర్ర సరిగ్గా - ఆ-అనుకున్నాను... కాని (సంశయిస్తాడు)

లక్ష్మి : (కసిగా) వాడి మెడలో ఆతాడు బిగించి లాగేసి ఉంటే ఎంత బావుండేది నాన్న కలవరించేటట్టు వాణ్ని అపశంగా ఉరి వేసుంటే-

రాజ : ష్-ష్-వినగలడే-మెల్లిగా మాట్లాడు. వాడొస్తున్నాడు నువు పో!

[నూరి చిట్టి ప్రవేశం]

చిట్టి : (నూరిచొక్కా లాగుతూ) ఇంకోటియ్యి మామయ్యా--యింకోటి విసురుతా-యింకోటి కావాలి.

నూరి : (వెళ్తూ వున్న లక్ష్మిని చూసి) ఎక్కడికే? ఆకలేస్తూంది. తినటానికేమయినా వుందా?

లక్ష్మి : (కోపాన్నాపుకొని) ఎందుకుండదూ? వొడ్డించి పిలుస్తాలే.

నూరి : ముసలాడితో చెప్పు ముద్దులకొడుకొచ్చాడని. బావగారితో మాట్లాడి వస్తున్నానని కూడా చెప్పు! (లక్ష్మి లోనికి పోతుంది)

చిట్టి : ఇంకో రూపాయియ్యి మామయ్యా! నీట్లోకి విసుర్తా-ఇంకోటి మామయ్యా...(చొక్కా పట్టి లాగుతుంది.)

నూరి : (వదిలించుకొని) గట్టుమీద కావలసినన్ని పెంకుముక్కలున్నాయి విసురుకో అమ్మా. రూపాయలెక్కువగా లేవు విసరడానికి. ఐపోయాయి.

చిట్టి : (మొండిగా) ఊ-నాకు పెంకులు వొద్దూ— గింకులు వద్దూ. రూపాయలే కావాలి— ఇయ్యి మామయ్యా—విసుర్తా నియ్యి మామయ్యా!

రాజ : (కోపంగా) చిట్టీ! ఏమిటా ఆట? ఊరుకున్నావా లేదా? పాపం మామయ్యని అలా అల్లర పెట్టకమ్మా? వెళ్లు—పో - లోపలికి పోయి అమ్మకి సాయం చెయ్యి— వెళ్తావా లేదా? మాట వినకపోతే వీపు బద్దలై పోతుంది ఆ! (చిట్టి ఏడుస్తూ లోనికి పోతుంది. రాజన్న నూరిదగ్గరికొచ్చి భుజం తట్టుతాడు నవ్వుతూ)

నూరి : (ఆశ్చర్యంతో) ఓహో! యిదేమి ప్రేమ?

రాజ : (చిన్నగా నవ్వుతూ) నూరీ! గతం అంతా మరిచిపో! నాకు నువ్వంటే ఏ నాడూ కోపం లేదు. ఇల్లొదిలి చిన్నప్పుడే పారిపోయావు నువ్వు. అది నీ తప్పు కాదు. నాకు తెలుసు మీ అక్క యెదుట అలా వుండకపోతే యిసుండదీ నా బ్రతుకు! అది వొట్టి రాక్షసంటే నమ్ము. నీకుమాత్రం తెలీదేంటి దాని సంగతి. నీ మీద ఎంత కంతఉక్రోషమో నా కీనాటికీ తెలిసింది కాదు. నా విషయంలో నువ్వేం అపోహపడకు!

నూరి : (యింకా అపనమ్మకంతో) ఆ! బావుంది.. కానీ......

రాజ : నా మాటలు నీకు నమ్మకం కలిగించడం లేదా?

నూరి : (నవ్వి) నమ్మేనులే సరే-నమ్మేను!
[యిద్దరూ సంతోషంతో భుజాలు కలుపుకుంటారు.]

రాజ : (బుడ్డితీసి కన్నుకొడ్తూ) రుచి చూస్తావా? మంచి సరుకే!

నూరి : ఓ! తప్పకుండా-(తీసుకొని కొంచెం త్రాగి తిరిగి యిచ్చేస్తాడు.)

రాజ : (కొంత తనూత్రాగి బుడ్డి టేబిలుపై పెడుతూ) ఇది దాని కంట బడటం నాకు ఇష్టం లేదు. లేకపోతే ఇంతకు ముందే నీ కిచ్చే వాణ్ణి. (కొంతసేపు యిద్దరూ మౌనంగా చూసుకుంటారు.)

సూరి : ముసలాడెలా వున్నాడు ముందు చెప్పుదూ-

రాజ : (తాపీగా) మామూలుగానే వున్నాడు. కాకుంటే యింకొంచెం ముసలయిపోయి అసహ్యంగా కనిపిస్తున్నాడంతే—

సూరి : ఈపాటికి ఏ పిచ్చాసుపత్రిలోనో మూలుగుతుంటాడని అనుకున్నాను నేను.

రాజ : అయ్యయ్యో! నిజం చెప్పాల్సివస్తే వాడిదంతా ఒకనటన. ఇప్పటికీ ఆ ముసలినక్క వాడి టక్కరితనం చూపిస్తూ పిచ్చికేకలు వేస్తూ పిచ్చిచేష్టలు చేస్తుంటాడు తెలుసా?

సూరి : అప్పట్లాగే డబ్బుదగ్గర పిసినారిగా వుంటున్నాడా?

రాజ : సముద్రం వాడికిచ్చినా పిత్తపరిగిపిల్లకి ఒక్క నీటిబొట్టు యివ్వడు! యిప్పుడేమంత డబ్బు వాడిదగ్గర వున్నట్టు కనిపించడంలేదు. వాడేమయినా నగదు వెనకేసుకుంటే అది మీ అమ్మ తన వెంట తీసుకొని పోయివుంటుంది. (శౌర్యం తెచ్చుకున్నట్టు నవ్వుతాడు) కూలిపోతున్న యీ యిల్లూ, దుక్కి కట్టకుండా వదిలేసిన ఆ పొలం చెక్కా మాత్రం యిప్పటికి మిగిలివున్నాయి. ఇవికూడా తనఖాలో మునిగిపోయినట్లున్నాయి. ఇంతవరకూ నా రెక్కలు ముక్కలు చేసుకొని, అటు ఆ అప్పులకి వడ్డీకడుతూ, యిటు యిల్లు గడుపుతూ వొచ్చాను. అందులో యీ ముసలిపీనుగ జబ్బులకి మందుల ఖర్చొకటి-ఏది తప్పినా అది తప్పడంలేదు చెల చెలా.

సూరి : నువ్వొక వెధవవి! అయిదేళ్లు అనుభవించీ, నీకు కళ్లు పెగల్లేదు!

రాజ : అంటే! నీ అర్థంఏమిటి?

సూరి : ఏమీ లేదులే! (వేలాడుతున్న ఉరినిచూసి) ఇక్కడిదెందుకూ? (ఏమి తోచిందో ఒక్కసారి చిటికవేసి పిచ్చివాడిలా నవ్వి లేచి నుంచుంటాడు) హ-హా-హా! అమ్మా! ముసలిగాడిదకొడకా ఎంత పట్టుదలా! ఆ!

రాజ : ఏమిటోయ్?

సూరి : అదుగో! ఆ ఉరి! నేను ఇక్కణ్ణుంచి అయిదేళ్ల క్రితం వెళ్ళిపోతున్నవాడు ఆ ముసలాడు వేసిందికాదూ ఆ ఉరిత్రాడు? నాకోసం వేసిందికాదూ?

రాజ : నీకు జ్ఞాపకంవుందీ? ఇన్నిరోజులూ నువ్వు ఉరిపోసుకోడానికి తప్పకుండా వస్తావనే అంటూ వుండేవాడు. ఇప్పటికీ అంటున్నాడు మీ నాన్న!

సూరి : హ-హ-హో-హో! యీ ఘటమా! మా నాన్నని పిచ్చివేషాలని నువ్వంటున్నావు! వాడే పిచ్చివాడా! ఛే! ఆ బుడ్డీ యిలా తే- (తాగుతాడు-యిద్దరూ తాగుతారు) ఈ తాడు సంగతే జ్ఞాపకంలేదు నాకు (తాడు చూపించి మళ్లీ తాగుతాడు) ఆనాడు నాలుగువందల రూపాయలు తీసుకున్నానని ఎలా కోతిలా చిందులుదొక్కి, తిట్టాడో జ్ఞాపకం వుందీ-తిడ్తూ, శపిస్తూ, ఏడుస్తూ యీ తాడు ఉరివత్యాసం మరిచిపోయావా? అక్కడే చేతికర్రని తాటిస్తూ చిందులుతొక్కాడు- నేనిక్కడ అందకుండా నించొని నవ్వుతున్నా-పిచ్చికుక్కలా కేకలు వేస్తున్న నాన్నని చూస్తే నవ్వాగేదికాదు-మీదపడి పట్టుకోబోయేటప్పటికి నేను పారిపోతుంటే అన్నమాటలు యింకా మరచిపోలేదు "జాగ్రత్త! జ్ఞాపకం పెట్టుకో! ఈ యింట్లో తిరిగి నువ్వు కాలుపెడితే నిన్ను ఉరితీస్తాను! యిదిగో! యీ తాడుతో నే" -అని బూతులు తిట్టాడు. జ్ఞాపకంలేదూ? (అసహ్యంగా ఉమ్మి) ఇంకా యిది అలాగే వుంచాడా? (ఒక్కసారి తాపీపడి ఆలోచిస్తూ) పిసినారి ముసలిగాడిదకొడకా! అరె! భగవాన్! ఎలాంటి తండ్రిని ఇచ్చావురా బాబూ!

రాజ : సూరీ-ఈ గుక్క తాగి ఆవిషయం మరిచిపో!

సూరి : (ఆవేశంతో) మరిచిపోవాలా? ఎలా మరిచిపోగలను. కళ్ళముందు యీ తాడు వేలాడుతూ కనిపిస్తూ ఉంటే—"కన్న తండ్రి - కన్నకొడుకోసం ఇన్నాళ్ళూ

"దాచిన శిక్ష!" (ఆగి) తగినశాస్తి చేస్తాను! తగిన బుద్ధి చెప్తాను ముసలాడికి! నువు కూచుని చూస్తూ వుండు-అంతే! యీ సారి ఒక చిల్లిగవ్వ కూడా వాడిదగ్గర మిగిలిస్తే నా పేరు సూరి కాదు! ఆ!

రాజ : (కపటంగా) నిజంగా వాడిదగ్గర డబ్బుంటే అంతకంటే నేనుమాత్రం కోరకేముంది? అలాగే చెయ్యి—కాని (సంశయంగా తల ఆడిస్తాడు)

సూరి : (తెలుసునన్నట్టు చిటిక వేసి) ఆ! నాకు తెలుసునోయ్! వాడిదగ్గర ఏముందో అంతా మనకి తెలుసు! చూస్తుండమన్నానుగా! ఆ! ఆంతే (నిషా తలకెక్కిన సూచనలు కనిపిస్తాయి. సిగరెట్టు ముట్టించి, పొగ వదులుతూ డాబుసరిగా) మీలాంటి పల్లెటూరి బైతులు కళ్లు తెరవాలోయ్! నా వేపు చూడు. ఇల్లు వొదిలేటప్పుడు నేను వొట్టి అప్రయోజకుణ్ణి! అమాయకుణ్ణి! దేశదేశాలు తిరిగి, అన్ని కష్టాలు అనుభవించాను. అన్ని పట్టణాలు చూశాను. అన్ని రకాల మనుష్యుల్తో కలిసి సంచరించి, తెలివి తేటలు ఉపయోగించి, బ్రతికి బయటపడ్డాను! కళ్లు మూసుకొని మీలాగ కూచుంటే...

రాజ : నీవన్నది నిజమే! పల్లెటూరి వాళ్ళం, మేం నిజంగా మూర్ఖులం. నీలాంటి అనుభవశాలి నేర్పుతున్నదంతా తెలుసుకోడానికి మాకు ఎట్లా వీలవుతుంది

సూరి : నన్ను చూస్తూ ఉండమన్నానుగా—నీకు నేర్పిస్తానులే నేనన్నీ!...అయితే ముసలాడి దగ్గర దమ్మిడీ లేదంటావ్! దివాలా తీసాడంటావు!

రాజ : అనే అనుకుంటున్నా నిన్నాట్నా!

సూరి : అయితే నువ్వు పచ్చిపల్లెటూరిబైతువి వాడు గాదు మీ కళ్లు కప్పింది! మీ మట్టుకు మీరే కళ్లుమూసుకు కూర్చున్నారు! అంతే! ఆ!

రాజ : ఏమయినా పరకా పాతికా వుంటే అతి రహస్యంగా దాచిపెట్టుకున్నాడేమో! మీ నాన్న జిత్తులమారి నక్కలే! అది నాకు తెలుసు.

సూరి : అంతకంటె టక్కరినోయ్ నేను! ఆ తండ్రి కన్నబిడ్డను కానూ నేను! చూస్తుండు నువ్వు. వాడి ఆట వాడి చేత్తోనే కట్టించేస్తాను! చూడు నా తడాఖా! చూస్తుండు నువు కూచుని! ఆ! అంతే! (తాగుతాడు. నిషాలో ఎక్కిళ్ళు ప్రారంభమవుతాయి! మాట అస్పష్టంగా వొస్తుంటుంది)

రాజ : ఇది బ్రహ్మసత్యంరా సూరీ! వాడు దాచిన డబ్బు నీవు తీయగలిగితే, నీవు నాకు తెలిసినాళ్లందరికంటే తెలివయినవాడివే!

సూరి : కూచుని చూస్తుండమని చెప్పాను! ఎక్కడున్నా తీసి చూపించే పూచి నాదీ - ఆ! చూస్తూ ఉండు! అంతే! యీ రాత్రి చూపిస్తా! ముసలాడు పడుకొని నిద్రపోనీ! యీ రాత్రే - చూపిస్తాగా - నువు చూస్తూ ఉండు—

[బైట అడుగులు తడబడుతున్న శబ్దం, లాలిస్తున్న లక్ష్మి గొంతు!]

రాజ : ష్! ష్! అడుగో వొస్తున్నాడల్లే వుంది. ఊర్కో!—

[సూరి లేచి-నిర్ధారణ కొచ్చినట్టు మైకంలోనుంచి మెలుకవగా చూస్తుంటాడు. వెంకన్న ద్వారంలోనుంచి వస్తాడు. వెనకనే లక్ష్మి వొస్తుంది. ముసలాయన ఉద్రేకాన్ని ఆపుకోలేక గోడకి చేరగిలి నుంచుంటాడు. ఒళ్లంతా వణికిపోతూ వుంటుంది. ఊపిరి అతికష్టంగా పీలుస్తుంటాడు. సూరిని ఆపాదమస్తకం కళ్లతో అతి ఆతురతతో దాహం తీర్చుకున్నట్టు చూస్తుంటాడు]

లక్ష్మి : ఎంత చెప్పినా నిలుస్తేనా? ఎంత ఆపినా ఉంటేనా! కొడుకొచ్చాడనేటప్పటికి కొండంత బలం వొచ్చినట్టుంది యీ కొంకనక్కకి! ఒకటే గింజుకోవడం యిక్కడికి రావడానికి! ఒక్క రైను ఎంత ఆపినా ఆపలేకపోయాను చూడండీ ఆనోట్లోంచి చొంగ ఎలా కారిపోతూ వుందో! (కోపంతో) ఇంకా వంటాగింటాఏమీ లేదు-ముసలాడిని మీరు చూస్తూవుండండి-నాకు చచ్చేదాకయిదే గోలయిపోయింది.

రాజ : నోరు ముయ్యి! కుక్కలా మొరక్కు! మేం చూస్తుంటాంలే మీ నాన్నని-నువ్వెళ్లు.

లక్ష్మి : ఏం చేస్తారో చేసుకోండి! నా కెందుకు మన్య, నేనింకా వంట చేసుకోవాలి.

[లక్ష్మి వెళ్ళిపోతుంది. తండ్రి, కొడుకు లొకరినొకరు చూస్తుంటారు. సూరి చూపుల్లోనుంచి కొంటెతనం పోయి క్రమంగా నవ్వుతాడు]

సూరి : (నవ్వుతూ) నాన్నా! ఏమిటి! నేను రావడం ఆశ్చర్యంగా, భారంగా వుందా నీకు?

[ముసలాడు వొణికి పోతుంటాడు-ఏవో వినీ వినపడని మాటలు గొణుగుతాడు-ఉద్రేకంలో మాటపడిపోయినట్లు బాధపడ్తాడు)

సూరి : ఇంకా ఆ పాత చేతికర్రవుందే! యీ తల మీద ఆ కర్ర ఎన్ని బొప్పెలు పెట్టిందో నేను మరిచిపోలేనులే నాన్నా!

వెంక : (ఒక్కసారి కష్టంగా గొంతు విప్పుతుంది) పట్టుబట్టలు పట్టుకరండి! పన్నీరు తీసుకు రండి! యిల్లలికి ముగ్గులు వేయండి! వాడవాడలా మంగళ వాయిద్యాలు మ్రోయించండి! అందర్నీ విందుకి పిలవండి! బాటలో పూవులు పరచండి! పునిస్త్రీలు నివాళీ పట్టండి! అందరం ఆనందంగా వుందాం! ఆనందంగా విందులు తిందాం! చనిపోయాడనుకొన్న నా కొడుకు బ్రతికున్నాడు! మరి రాడని అనుకున్నా తిరిగొచ్చాడు — తప్పిపోయాడనుకున్నా దొరికాడు నేడే!-(దుఃఖంతో, ఆనందంతో ఉక్కిరి బిక్కిరయిపోతాడు)

సూరి : నువ్వింకా ఆ పాడు కవిత్వం పిచ్చి వొదల్లేదన్నమాట! సరే! మిగిలినదికూడా పాడేయ్! ...యిదిగో దగ్గరకొచ్చి ఒంటిమీద చేయి వేశావా (తండ్రి దగ్గరకొస్తాడు మెల్లగా— సూరి చేతులు పట్టుకొని ముఖంలోనికి ఆప్యాయంగా చూస్తాడు) ఏంటిది?— ఏంటిదంతా ప్రేమే!

రాజ : మీ అయ్యకి రెండు నాలుకలోయ్! నాగు పాము! టక్కరి ఎత్తులు సుమీ! జాగ్రత్త!

(వెంకన్న వొణుకుతున్న చేతుల్తో సూరి ఒళ్ళంతా తడుముతుంటాడు. ఆపుకోలేని ఆనందంతో ముఖం వెలుగుతుంటుంది)

సూరి : (వెటకారంగా) చూశావా బావా! చైటికి ముసలాడు నేనొచ్చానని సంతోషిస్తున్నట్లే నటిస్తున్నాడు అసలా ముసలిముఖంలో నవ్వే నేనాడూ చూసినట్టు నాకు జ్ఞాపకం లేదు నేటివరకూ! ఇప్పుడు పాపం ముసలాడు నవ్వడానికి ప్రయత్నిస్తున్నాడల్లే వుంది (తండ్రిముఖం, చేతులూ తడుముతుంటే, చిరాకుగా) అరే! చాలులే! నీ ప్రేమ! (చెయ్యి తప్పిస్తాడు మెల్లగా) ఎందుకలా తడుముతావ్! నా ఒంట్లో అన్ని భాగాలూ తీసుకొచ్చానులే! ఏదీ వొరి లెక్కలేదు! ఎందుకంత గాభరా? అలా చూస్తావేం? నేనేం దయ్యాన్ని కాను! కూచో! (తూలి కూలిపోగలవ్ నేలమీద... కూచో! (బెంచీమీద కూచో పెడ్తాడు) కాస్సేపు ఆయాసం తీర్చుకో! పాపం చాలా అలసిపోయావ్! (బుడ్డీ చూపించి) యిదో? కాస్త బలం యిస్తుంది. పుచ్చుకో!

రాజ : ఒరే! ఒరే! ఘాటుకి ఉక్కిరిబిక్కిరయి చావగలడు జాగ్రత్త!

సూరి : (తండ్రి తల ఓ చేత్తో పట్టుకొని, రెండో చేత్తో బుడ్డి నోట్లో పెట్టి ఒంపుతాడు, ముసలాయన పలుమారు ఉక్కిరిబిక్కిరవుతాడు! దగ్గుతాడు, సూరి నవ్వుతూ) అసలు యీ ముసలి పక్కకి తాగడం చాతనౌతేగా! ఎలా తాగాలో చూపిస్తా (అది తను తాగి, బుడ్డీ రాజన్నకి అందిస్తాడు)

రాజ : నువ్వెళ్ళి అయిదు సంవత్సరాలవుతుందా? వీడొక్క చుక్క ముట్టలేదు తెలుసా యింతవరకూ—మాకు మహా చికాకుగా వుండేది- రాత్రి పగలు ఒకటేగోల—నిన్ను తిట్టడం! ఎంతో చెప్పాను నేను—ఏం లాభం? ఈ ప్రేమంతా నిజం అనుకునేవు సుమీ! లోపల ఏదో పన్నాగం పన్నుతుంటాడు! జాగ్రత్త! నటించడంలో మీ

తాన్నని మించినవాడు లేడు తెలుసుగా నీకు !

[ముసలాయన చేత్తో ఏదో సంజ్ఞ చేస్తుంటాడు]

నూరి : ఏంటొ చెప్మా అంటున్నాడు! మళ్ళీ మట పెంపలదంటున్నాడేమో! ఏమిటి కావాలి? (తండ్రి చేతికర్రతో ఉరితాడు చూపిస్తాడు—పెదవులు వొణికి పోతుంటాయి)

వెంక : (అస్పష్టంగా) నాయనా! నూరీ! ఆ ఉరి! ఆ తాడు—నీకే నీ కోసమే!

రాజ : అదో! చూశావా! నే నేమన్నాను! యీ ముసలిగాడిదకొడుకు నిన్ను ఉరిపోసుకో మంటున్నాడు — చూస్తాడట — కళ్లారా చూస్తాడట!

వెంక : (తడబడుతూ - ఆందోళనతో, ఔనన్నట్లు తలూపుతూ) అవును!...నూరీ...నీకే... అది నీకే!...

నూరి : (హాస్యంగా తీసుకొని నవ్వుతూ) హహ్హ- బలేబావుంది! నీకు సరదాగావుందా! సరే నీ మాటెందుకు కొట్టిపారెయ్యాలి! ఏమి చెయ్యమన్నా సిద్ధమే! హా హ్హ హ్హ! (కుర్చీతీసికి ఉరితాడుక్రింద వేసి కుర్చీమీద నిల్చుంటాడు ముసలాయన అతి ఆతురతతో చూస్తుంటాడు కళ్ళప్పగించి)

రాజ : జాగ్రత్తిరోయ్! ముసలాడి టక్కులకి మోస పోయేవ్!

నూరి : ఫరవాలేదోయ్ పిచ్చిప్రల్లయ్యా! గాభరా పడకు! యీ దేశదిమ్మరి యీవాడు స్వయంగా తన చేతుల్తో తనే వురిపోసు కుంటున్నాడు-చూడు (ఉరిలో తలదూర్చి, గొంతుకు చుట్టూ తాడు పెట్టుకొని తగిన విధాలో ధీమాగా తండ్రినిచూసి నవ్వుతాడు. ముసలాయన తాడులాగి వేలాడమని అదే సంజ్ఞ చేస్తుంటాడు) చూశావా బావా! ముస లాడికెంత తొందరగావుందో! సరే! యిదో చూడు నీ కోర్కె యిదేకదా. (అంటూ కుర్చీ తన్నినట్టు గెంతినట్టు నటిస్తాడు.)

రాజ : (గాభరాతో లేచి) నూరీ! నూరీ! నీకు పిచ్చి గాని పట్టలేదుకదా! కిందికి దిగు! దిగరా!

నూరి : (లాగమని సంజ్ఞచేస్తున్న తండ్రిని అదేపనిగా చూసి చిన్నగా నవ్వుతాడు పెదవి బిగించి) నిజంగా నన్ను ఉరిపోసుకో మంటున్నావా నాన్నా! నీకు నా చావు చూడాలనుందా? నా శవం యీ తాడులోంచి వేలాడుతుంటే నిజంగా నీకు చూడాలనేవుందా? (ముస లాయన 'ఔనౌను' అన్నట్లు తలాడిస్తాడు) ముసలివెధవా! గాడిదకొడకా! అమ్మ! ఎంత కుళ్లింది నీలో! (బావతో) ఇదంతా యింత సేపూ వట్టి గమ్మత్తు నాటక మనుకున్నాను. (మెల్లగా తాడులోనుంచి తల తప్పించి దిగ బోతుంటే, తండ్రి కోపంతో కర్ర నేల మీద కొట్టుంటాడు. గొంతుకలోనుంచి అసంతృప్తిగా ఏవో శబ్దాలు వొస్తుంటాయి. నూరి కుర్చీమీదనుంచి కిందికి దూకుతాడు. తండ్రిని ఒక్కక్షణం తీక్షణంగా చూస్తాడు. కోపంతో ముఖం గంభీరంగా ఎర్రగా వుంటుంది) నీపనిపడ్తానుండు! ముసలితొత్తు కొడకా (అని కుర్చీకాళ్ళు పట్టుకొని పైకెత్తి ముసలాయన బుర్రమీద కొట్ట బోతూంటే ముసలాయన తల భయంతో టేబిలుక్రింద దాచుకుంటాడు.)

రాజ : (లేచి అడ్డంవొచ్చి) నూరీ! ఒరే! ఏంట్రా అది? ఛి! ఛీ! ఏం పనిరా? (నూరి ఆలో చిస్తుంటాడు. కుర్చీ కిందపడేస్తాడు కోపంతో—తండ్రిని తీక్షణంగా చూస్తాడు చేతులు నడుంపైన పెట్టుకొని)

నూరి : (ముసలాయన జబ్బపట్టుకుని జోరుగా ఊపుతూ, బొంగురుపోయిన గొంతుకతో) నిజంగా నా శవం ఆ తాడులోంచి వేలా డ్తుంటే నీకు చూడాలని వుందా? చెప్పు! చెప్పు! నిజంగా నే! నీకే బలంవుంటే ఆ పని నీ చేతులారా చేసుంగావు కదూ! ఏం? మాటాడవేం? కడుపారా కన్నతండ్రివే! ఓరి! కసాయివెధవా! ఇదా నీ కన్నప్రేమ! నీబుఱ్ఱ చితగ్గొట్టి పచ్చడి చేస్తాను జాగ్రత్త! (జోరుగా ముసలాయన్ని ఊపేస్తాడు)

రాజ : (అడ్డంవచ్చి) అరె! అరె! చచ్చిపోగల దురా! అలా ఊపేస్తున్నావేమిటి?

నూరి : (ముసలాడిని నేలపై ఒక్క తోపు తోస్తాడు) పో! నా కంటి యెదుట్నుంచి పో! నా యెదుట కనిపిస్తే ఏం చేస్తానో నాకే తెలీదు. పో! పో! పో! (రాజన్న భయంతో వొణికిపోతున్న ముసలాయన్ని లేవనెత్తుతాడు) తీసుకు పో! యిక్కడ్నుంచి తీసుకు పో వాణ్ణి! వాడు నాతండ్రి కాడు! కాడు! కంటి ముందుంటే ఎముకలు గుండ కింద కొట్టేస్తా! తీసుకుపో! (పిడికిలి బిగించి చేయి పైకెత్తుతాడు)

రాజ : ష్! ష్! ష్! ఏమి టాపిచ్చికేకలు — తీసుకెళుతున్నావే! (దుఃఖంతో దీనంగా ఉన్న ముసలాయన్ని ద్వారంవేపు తీసుకు వెళుతాడు, పద! పదవయ్యా! యింట్లోకి పద! యీనాల్టికి యీ గొడవ చాలు యీయింట్లో (వెళ్తారు)

[నూరి బెంచీమీద కూలపడ్తూ బుడ్డీతీసి తాగుతాడు. రాజన్న తిరిగి వెంటనే వచ్చి కూర్చుంటాడు నిశ్శబ్దంగా]

రాజ : రక్షించి ఏఅల్లరి చేయకుండా వెళిపోయాడు లోపలికి! నిజంగా బెదరి భయపడిపోయాడు ముసలాడు పాపం! కలలో కూడా అనుకోనుండడు యిలా జరుగుతుందని! యిక్కడికి విని పిస్తూంది చూశావా ఆ ఏడుపు! (నిట్టూర్చి) నిజంగా పిచ్చి ఉన్నట్లే ఉంది ముసలాడికి ...నిన్ను ప్రాణాల్తో ఉరివేయాలనే వాడి ఆలోచనలావుంది!

నూరి : కటిక కసాయి వెధవ!

రాజ : కుర్చీ ఎత్తేటప్పటికి నిజంగా చచ్చాడను కున్నాను!

నూరి : చంపేస్తుంటే బావున్ను! తగిన శాస్తి అయ్యున్ను!

రాజ : నీవు నవ్వుతుంటే నవ్వుతాలనుకున్నాను!

నూరి : నవ్వుతాలుగానే పోనిద్దామనుకున్నా నేనూ వాడు నవ్వుతాలు కంటున్నాడనే అనుకున్నా! ఇలా తెగించి ఉన్నాడనుకోలేదు. నేను చావాలనే వాడి కోరికని నాకు మొదట్లో తెలిసుంటే......(టేబిలుమీద గుద్దుతూ) ఇలాంటి పిచ్చి వాడితో మీరెందుకుంటున్నారు? ఎలా గడుపుతున్నారు?

రాజ : మరెందుకామాట! ఎంత పిసినారవుతున్నావ్! తుచ్ఛపు వెధవ!

నూరి : నిజంగా ఉరిపోసుకు చావాలనేనా వాడి కోరిక! ఎలా కళ్ళప్పగించి చూశాడో చూశావా; మెడలో నేను ఉరిపోసుకుంటుంటే; (కోపంతో) ఆహా! ఏం తండ్రి!

రాజ : ఏదో అయిపోయిందిలే మరి ఆమాట మనసులో పెట్టుకోవద్దు నామాట విను, మరిచిపో.

నూరి : (విషాలో ఏడుస్తూ) ఎలా మరచిపోగలను బావా! అందులో స్వయంగా కన్నతండ్రే ఆయిదు సంవత్సరాలు నానా కష్టాలుపడి, ఆకలి దప్పులతో బాధపడి, యిల్లని వాకిలని లేక, తిరిగి తిరిగి చావునోట్లోంచి తప్పించుకొని యింటికొస్తే యిదా మర్యాద? నా శవాన్ని చూడడానికి నా తండ్రి ఉబలాట పడ్డాడా? కడుపార కన్నాడే! కసాయి తొత్తుకొడుకు!

రాజ : అయిపోయింది అయిపోయింది! అంతే! యిక ఎంత మొత్తుకొని ఏంలాభం? మరిచిపోవోయ్! లే! భోంచేద్దాం పద!

నూరి : (తాగి మూతి తుడుచుకుంటూ) ఏమిటీ? .. ఒక్కటిమాత్రం నీతో చెపుతున్నా జ్ఞాపకం పెట్టుకో! యిది యింతటితో ఆగిపోదు! ఆగిపోవడానికి వీలులేదు! (యింకా ఉద్రేకంతో) నేను మర్చిపోను! మర్చిపోలేను! ఏమంటేఅను నువ్వు! వాడికి ఆముసలి నక్కకి తగిన పాఠం చెప్తాను! చూస్తుండు. కొడుకు అన్న అభిమానం నామీదచూపించలేదే! నేను మాత్రం...చూస్తూ ఉండు! ఆ! అంతే! యీవాళే! ఈ రాత్రే వాడి అంతం చూస్తా!

రాజ : ఏమిటీ! ఏమిటంటున్నావ్?

నూరి : చూస్తావుగా! నేనిప్పుడే చెప్పడం దేనికి? (టేబిలుమీద గుద్దుతూ) తగిన గుణపాఠం

చెప్తా! యీరాత్రే! యింకా ఊరుకుంటా ననుకోకు! (ఆలోచిస్తూ) వాడంటే నీకే మయినా అభిమానం ఉందేమిటి? ముందే చెప్పు!

రాజ : (అసహ్యంతో ఉమ్మి) ఛూ! ఏం! ఎందుకలా అనుకుంటున్నావ్? రోజూ వాణ్ణి చూసినప్పుడల్లా పీకపిసికి చంపా లనిపిస్తుంటుంది నాకు! మా అక్కని చూసి......

రాజ : సరే! అయితే యిది మనం యిద్దరం కలిసే చేద్దాం! నువ్వూ నేనూ! ఏం? చెయికలుపుతావా?

రాజ : ఓ! తప్పక! (చేతులు కలుపుతారు)

మూరి : ఏం దొరికినా చెరిసగం! ఏం రాజీయేనా?

రాజ : ఓ! తప్పకుండా!

మూరి : నాకు యీయిల్లుగాని, పొలాలు గాని ఏమీ అక్కర్లేదు. అవన్నీ నీవు తీస్కో. నేను భూములు దున్నుకొని గడ్డితినే బ్రతుకు బ్రతికేదానికి పుట్టలేదు. ఇంకా ఎన్నో దేశాలు తిరగాలి! యీసారి వెళ్తే మరి తిరిగిరాను! రావంటే రాను! యీ వెధవ పొలాలూ, యిల్లూ నాకెందుకూ, నీవు తీస్కో. నాక్కావల్సిందల్లా నగదు! రొక్కం! ఖర్చుచేయడానికి నగదే నాక్కావలసింది. నీకూతురు చిట్టి ఎలా రూపాయలు విసిరిందో చూశావుగా నువ్వే! అలాగే రెండు చేతులా విసిరి ఖర్చు చేయడానికి రొక్కం కావాలి!... నీ కూతురు దిలాకీదే బావా!

రాజ : (విషయంలోనికి తీసుకువస్తూ) అసలు ఆనగదు రొక్కం ఎక్కడుందంటావ్? అంటేఎక్కడ దాచిపెట్టి ఉంటాడంటావ్?

మూరి : అది నాకొదిలేయ్! నీ కాబాన వద్దు నేను తీసి చూపిస్తా నన్నాగా! వాడెక్కడ డబ్బు దాస్తాడో నాకు తెలుసు. చిన్నప్పుడు దొంగచాటుగా వాడికి తెలీకుండా కనిపెడ్తూండేవాణ్ణి. మా అమ్మకి కూడా తెలియకుండా దాచేవాడు! వాడిసంగతి నా ఒక్కడికే తెలుసు. పిసినారిదొంగ తొత్తుకొడుకు!

రాజ : నువ్వు చెప్పేది ఆరోజుల్లో! అంటే అయిదారేళ్ల క్రితం నాటిసంగతి. ఇప్పుడు నీ కెట్లా తెలుస్తుంది?

మూరి : నాకు తెలుసన్నాను కదా! నీవు చూస్తూ వుండు. రెండుచోట్లు నాడు దాచేస్థలా లున్నాయి. అది నాకు తెలుసు. అప్పుడు నాలుగు వందల రూపాయలు నేను చెక్కేశానే అది ఒకటి!

రాజ : ఇక అక్కడెందుకు దాస్తాడూ?

మూరి : ఛా! అంత తెలివితక్కువ దద్దమ్మ కాదులే ఆముసలిపీనుగ! అక్కడ యింకో దమ్మిడీ కూడా వుండదు. రెండోచోటు సంగతి నాకు తెలుసని వాడికి తెలీదులే! అప్పుడే ఒక్కదమ్మిడీ మిగల్చకుండా డబ్బంతా తీసుకుపోదాం అనుకున్నా! కాని భయం వేసింది! అసలు అతీసిన నాలుగువందలు ఎలా ఖర్చుచేయాలో తెలియలేదు. అంత చిన్నవాణ్ని నేను!.... ఇద్దరికీ చెరిసగం వాటా లన్నానుగా! నువ్వూయికో! అంతే చాలు ఈమాత్రం సహాయానికి నీకు నగదులో వాటా, యీ ఇల్లూ, పొలాలూ!... నా దారిని నేను పోతాలే!

రాజ : డబ్బు మనకి దొరక్కపోతే! ఎక్కడా కనిపించకపోతే!...

మూరి : అప్పుడు యిద్దరం కలిసి ఆముసలాడి నోట్లోంచే కక్కిద్దాం ఎక్కడ పాతిపెట్టాడో!

రాజ : వాడా! వాడా చెప్తాడు!

మూరి : పట్టి పల్లెటూరి గబ్బిలాయివని నిన్నారికే అన్నానా? ఆభారం నామీద వదిలేయవోయ్! నువ్వు చూస్తూ వుండు! అంతే! ఎలా మాట్లాడించాలో ... ఎలా చెప్పించాలో...ఎలా కక్కించాలో నాకు తెలుసు! (టేబిల్ మీద ఉలి అందుకొని) యిది చూశావా. మంచితనంగా మాటల్తో చెప్పకపోతే...చెప్తాడే ఏం చేస్తాడో (పిచ్చిగా

నవ్వుతూ) యిద్దరం ఉక్కు ముక్కల్లాంటి మొగాళ్ళం ఆ ముసలిపీనుగని సాధించలేం? తప్పకుండా వాడే చెప్తాడు. ఇది కుంపట్లో కాలనివ్వు! ఎర్రగా కాలనీ! అది కాళ్ళలో చురకలు పెడుతుంటే వాడికి తెలుస్తుందిలే! ఏమి చెప్పమంటే అది చెప్తాడు—నీ కా భయం వొద్దు!

రాజ : మీ అక్క లక్ష్మి వుందిగ! అది ఊరుకుంటుందా? గొడవ చేస్తుంది!

సూరి : కేకలు వెయ్యకుండా నోట్లో గుడ్డలు కుక్కుదాం! ఊరుకోవంటే ఉరివేద్దాం!

రాజ : ముసలాడిని ఎక్కువగా బాధపెట్టవద్దు. చెప్పకుండానే చచ్చిపోగలడు!

సూరి : (కోపంతో) నన్ను ఉరితీస్తాడేం? చూద్దాం, వాడికి సాయంగా ఎవర్ని రమ్మంటాడో చూద్దాం అన్నాగా! పద! ఇక కార్యరంగంలోకి దిగుదాం యిది ఎంత త్వరగా తెముల్తే అంత మంచిది!

[యిద్దరూ నిషాలో జోగుతూ లేస్తారు చిట్టి వొస్తుంది.]

చిట్టి : అమ్మ అన్నానికి రమ్మంది.... నేను అన్నం తినేశాను మామా! మీ యిద్దర్ని రమ్మంది. (వొస్తూనే వేలాడుతున్న తాడుకోసం గెంతుతుంది...అందదు....) మామయ్యా ఆ తాడు నాకు అందించవూ? ఊగుతాను. ఉయ్యాల ఊగుతా మామయ్యా!

సూరి : (కోపంగా) అది ముట్టుకోకు! జాగ్రత్త!

చిట్టి : ఉయ్యాలూగుతా మామయ్యా!

సూరి : (వొణికిపోతూ) అదివొద్దమ్మా! అది మంచిది కాదు!...అది మంచిది కాదు...యింకోటి మంచిది రేపు తెస్తా...నామాట విను. (విన నట్టే తాడుకోసం గెంతుతుంటుంది)

రాజ : మళ్లీ గెంతూ! వీపు పగులుతుంది!

సూరి : పద బావా, అన్నంమాట తరవాత చూద్దాం గాని, ముందు మనపని సాగనీ!

[ద్వారందాకా వెళ్తారు. రాజన్న వెనక్కి చూసి]

రాజ : చిట్టీ యిక్కడే ఉండమ్మా! మేం పిల్చిందాకా యిక్కడే ఉండాలి! లోపలికి రాకు! వొచ్చావా (కోపంతో) చర్మం వొలిచేస్తా! ఆ!

సూరి : రేపొద్దున్న నీకు కావలసినన్ని రూపాయలిస్తారే! నీట్లోకి విసురుదువుగాని - కప్పగంతులు వేయిద్దువుగాని- నీమనసుతీరా ఆడుకుందువుగాని—లోపలికి మాత్రం రావద్దు! యిక్కడేవుండు...మంచిదానివికదూ!

చిట్టి : (సూరిని పట్టుకొని) యిప్పుడే కావాలి! రూపాయలు యిప్పుడే విసుర్తా! కప్పగంతులు వెయ్యిస్తా! మామయ్యా పోనీ ఒక్కటివ్వు — ఒక్కటివ్వకూడదా యిప్పుడు! యివ్వవూ?

సూరి : లేవమ్మా! తెప్పిస్తానన్నాగా! నాన్నా నేనూ అందుకే వెళ్తున్నాం. తాతదగ్గర నుంచి రూపాయలు తీసుకురావడానికి.

రాజ : అరె గట్టిగా అనకోయ్! మీ అక్క వినగలదు!

సూరి : విననీ!...పద! పిసినారిముసలిపీనుగపనిపడదాం!

[యిద్దరూ వెళ్లిపోతారు. చిట్టి ద్వారందాకా వెళ్లి అటు, యిటు తొంగిచూసి, తిరిగి లోనికివస్తుంది...తాడుకోసం యింకోసారి గెంతుతుంది. అందదు. ఇటు అటు చూసి తిరగబడిఉన్న కుర్చీ సరిచేసి, మీదనెక్కి తాడు అందుకుంటుంది రెండు చేతుల్లో తాడుపట్టుకొని "ఉయ్యాలో, ఉయ్యాల" అని సంతోషంగా కేకలు వేస్తూ ఊగుతుంది. దూలానికి కట్టిఉన్న ఆ తాడు జారుతుంది. తాడుచివరని కట్టిఉన్న చినిగిపోయిన గోనె మూట క్రిందపడ్తుంది తాడుతో సహా. చిట్టి కూడా క్రిందపడ్తుంది. లేస్తుంది. ధూళి దులుపుకొని సంచిని చూస్తుంది. సంచి మూతివిప్పి లోన చెయి పెడ్తుంది. ఆనందంతో పెద్దకేక వేస్తుంది. సంచీ ఒంపుతుంది. రూపాయలు పోగవుతాయి ఆనందంతో కేకలు వేస్తూ రూపాయల్ని కుప్పచేస్తుంది. రెండు పిడికిళ్లతో రూపాయలు తీసి ద్వారందగ్గిరికిపోయి పాడుతూ, ఒళ్లో రూపాయలు పోసుకొని, ఒక్కొక్క రూపాయి చీకటిలో ఏటిలోకి విసురుతుంది. నీటిలో శబ్దంకి గెంతుతుంటుంది ఆనందంగా. ఒళ్లో రూపాయలు అయిపోగానే తిరిగి వచ్చి తీసికొని నీటిలో విసురుతుంది. అయిపోగానే మళ్లీవచ్చి రూపాయలు తీసుకొని విసురుతుంటుంది. అలా విసురుతుండగా తెర జార్తుంది.]

---

ప్రసిద్ధ అమెరికన్ రచయిత యూజీన్ ఓనీల్ రచించిన 'రోప్' (Rope) అనే నాటికకు స్వేచ్ఛానువాదము.

# కలగూరగంప

## మల్లినాథుని వ్యాఖ్యాన వైఖరి

శ్రీ జటావల్లభుల పురుషోత్తం

మల్లినాథుని వ్యాఖ్యానముతో కావ్యపంచకమును పఠించుట మూలముననే సంస్కృత భాషా జ్ఞానమును సంపాదించుకొను పద్ధతి భారతదేశములోని యన్ని ప్రాంతములవారిలోను కొన్ని తరములనుండి వచ్చుచున్నది. కట్టుదిట్టముగా కావ్యపంచకమును మల్లినాథ వ్యాఖ్యాసహితముగా చదివినవారికి చక్కని సాహిత్యజ్ఞాన మలవడుటయేకాక వీరు పండితులుగా కూడ దేశములో చెల్లుబడి యగుచుండిరి. మల్లినాథుని వ్యాఖ్యద్వారా పాఠకుడు గ్రహింపగల్గిన వ్యాకరణాంశములు, అలంకారశాస్త్ర విషయములు, బహుశాస్త్ర సంప్రదాయములు అట్టివిగా నున్నవి. పదముల స్వారస్యమును, భావతాత్పర్యములను వెల్లడించుటలో మల్లినాథుడు చూపిన కౌశలము ఆయన సకలశాస్త్ర పాండిత్యమునకుతోడై యాయన వ్యాఖ్యానవైఖరి కొక లోకోత్తర సౌరభమును కూర్చినది. ఏతద్వ్యాఖ్యాన వైఖరీ వైభవమునకు మచ్చుగా కొలది ఘట్టముల నిట తిలకింతము.

వసిష్ఠమహాముని సాయంతనానుష్ఠానములో నుండగా సుదక్షిణా దిలీపు లాశ్రమము చేరిరి. అనుష్ఠానావసానమున వారు ఋషిని దర్శించినారని మాత్రమే కాళిదాసు చెప్పినాడు. అంతవఱకు వేచియుండుటకు మల్లినాథుడు కారణము చెప్పినాడు. జపహోమాదులలో నున్నవానికి అభివాదనము చేయరాదను ధర్మశాస్త్ర వచనమును మల్లినాథుడు చూపినాడు:

"జపంహోమం చ కుర్వాణో నా
భివాద్యో ద్విజో భవేత్."

మల్లినాథు డీ వచనమును చూపియుండనిచో మనకు అనుష్ఠానవిఘ్న భయముచే దిలీపుడు కాలమును ప్రతీక్షించెనని మాత్రమే తోచియుండును. అనుష్ఠానములోనుండి అభివాదమును స్వీకరించుట దేవతాపచారమను భావమును మనకు మల్లినాథుడు తెలిపినాడు. కవిహృదయమును ఆ యా శాస్త్రముల మర్యాద ననుసరించి యావిష్కరింపగల శక్తి మల్లినాథున కున్నట్లు మరొకనికి లేదు.

కుమార సంభవములో కాళిదాసు మైనాక జన్మమును వర్ణించినాడు. ఇది యెందులకో మల్లినాథుడు ధర్మశాస్త్ర దృష్టితో వివరించినాడు. పార్వతికి సోదరుడున్నాడని చెప్పిననే కాని ఆమెకు ఉత్తమ వధూత్వము సిద్ధింపదు. అభ్రాతృకన్య ఉత్తమ వధువు కాదు.

యస్యాస్తు నభవే ద్భ్రాతా న విజ్ఞాయే త వా పితా।
నోపయచ్ఛేత తాం ప్రాజ్ఞః పుత్రికా ధర్మశంకయా.

అను మనువచనమును మల్లినాథు డుదహరించి యుండనిచో మైనాక ప్రసంగ మప్రస్తుత ప్రసంగమని మనకు తోచియుండును. ఈ రీతిగా మల్లినాథుడు తన శాస్త్రజ్ఞానముచే వ్యాఖ్యానమునకు తేట తెచ్చినాడు.

యజ్ఞమునకు దక్షిణవలె దిలీపునకు సుదక్షిణ భార్యగా నుండెననుచోట మల్లినాథుడు శ్రుతివాక్యము నుదాహరించి యుపమానమును సమర్థించినాడు. మల్లినాథుడు కృత్స్న వేదాధ్యేతయనుట స్పష్టము. ఈ సందర్భమున నాతడు "యజ్ఞో గంధర్వ స్తస్య దక్షిణా అప్సరసః" అను వాక్యము నుదాహరించి యుండనిచో నీ యుపమానములోని సాంప్రదాయికత మనకు తెలియదు.

"జాయా ప్రతిగ్రాహిత గంధమాల్యాం" అనుచోట కవి సుదక్షిణాదేవిపట్ల భార్యాది శబ్దములను వాడక జాయా శబ్దమును ప్రయోగించినాడు. దీని స్వారస్యమును శ్రుత్యాధారముచే మల్లినాథుడు నిరూపించినాడు. త్వరలో సుదక్షిణాదేవి కుమారుని కనునను భావము జాయా శబ్దమువలన స్ఫురించును. జాయా

శబ్దము 'జనీ' (ప్రాదుర్భావే) అను ధాతువునుండి వచ్చినది. పురుషుడు తానే పుత్రరూపమున భార్య నుండి జనించుచున్నవాడు కావున ఆమె "జాయ" యగుచున్నది. ఐతరేయ బ్రాహ్మణములోని ఈ క్రింది వాక్యమును మల్లినాథు డుదహరించి సుదక్షిణ "జాయ" కాబోవుచున్నదను ధ్వనిని మనకు చూపినాడు.

పతిర్జాయాం సంప్రవిశతి గర్భోభూత్వేహమాతరం।
తస్యాంపునర్నవో భూత్వాదశమే మాసి జాయతే।
తజ్జాయాజాయా భవతి యదస్యాంజాయతేపునః.॥

సమస్త వేదశాస్త్రములను జీర్ణించుకొన్నవాడు కావుననే మల్లినాథుడు సందర్భశుద్ధిగా నెప్పడే గ్రంథమునుండి యెంతవర కుల్లేఖించుట కవి హృదయావిష్కారణమునకు అవశ్యక మగునో యంతవఱకునుల్లేఖించుచు లోకోత్తర వ్యాఖ్యను వెలయింపచేసినాడు. మల్లినాథవ్యాఖ్యతో కావ్యములను చదివిన వారికి భాషాజ్ఞానమే కాక సాంస్కృతిక సంస్కృతి విశేషముగా నలవడు నన నతిశయోక్తి కాదు.

నడచుచున్న గోవులపాదములనుండి రేగిన పరాగము శరీరమునకు తగులుటచే దిలీపునకు తీర్థాభిషేక శుద్ధి కల్గెనని కాళిదాసు నుడివినాడు. మల్లినాథుని పాండిత్య వైభవమును చూడుడు. గోరజఃస్నానము వాయవ్య తీర్థాభిషేకమనియు, భస్మలేపనము ఆగ్నేయ స్నానమనియు, జలమజ్జనము వారుణస్నానమనియు, ఆపోహిష్ఠేతి మార్జనము బ్రాహ్మస్నానమనియు తెలుపు స్మృతి వచనమును మల్లినాథు డుదాహరించినాడు.

"ఆగ్నేయం భస్మనా స్నాన మవ గాహ్యతువారుణం
ఆపోహిష్ఠేతి చ బ్రాహ్మం వాయవ్యంగోరజఃస్మృతం"

"తీర్థాభిషేకజాం శుద్ధిం" అనుదాని నింత ప్రామాణికముగా వ్యాఖ్యానించుట సామాన్యముకాదు.

గర్భిణియైన సుదక్షిణ కోరినదానినెల్ల రాజు కూర్చెనని కాళిదాసు చెప్పినాడు. హితాహితముల నాలోచింపక యిట్లు భార్యావశుడగుట స్త్రీలౌల్యమను దోషము కాదాయన మల్లినాథుడు కాదని యిట్లు సమర్థించును. "గర్భిణి వాంఛను తీర్పనిచో గర్భస్థ శిశువునకు దోషము కల్గును. కావున గర్భిణీ వాంఛాపూరణము న్యాయము." దీని కనుకుగుణమగు వైద్యశాస్త్ర వచనమును మల్లినాథుడు కన్పఱచినాడు.

'దోహదస్యాప్రదానేన గర్భోదోషమ వాప్నుయాత్'

"ఆపర్వతముమీది పథ్యమైన లఘూదకమును నీవు సేవింపుము" అని యక్షుడు మేఘునితో పల్కెను. ఆనీటికి పథ్య లఘు విశేషణ మెట్లుచెల్లునో మల్లినాథుని పాండితీ పరిణతబుద్ధి గ్రహించినది. శిలలపై కొట్టుకొనుచు ప్రవహించు నీరు తేలికగా నుండునను వాగ్భటవచనము నాత డుదాహరించినాడు.

"ఉపలాస్ఫాలనాక్షేప విక్షేపాద్భేదితోదకాః।
హిమవన్మలయోద్భూతాః పథ్యానద్యోభవన్త్యమూః"

ఏశాస్త్రమునుండియైనను ఇట్టి సూటి వచనముల నుల్లేఖించి తత్తత్సందర్భములలో మూలగ్రంథ వివరణము గావింపగల శక్తి లోకోత్తరము.

యక్షుడు మేఘునితో "నీవుపోవునప్పటికి నాభార్య నిద్రించుచుండవచ్చును; స్వప్నములో నేనామెకు కన్పట్టవచ్చును. ఒకజాము వేచియుండి యాపిమ్మట నామెను మేల్కొలుపుము." ఇచట జాము వేచియుండవలసిన కారణమును మల్లినాథు డిట్లు వివరించినాడు; స్వప్నసమాగమ భంగము కలుగకుండవలయు నన్నచో జాము నిరీక్షింపవలయును. రతిరహస్యములోని యీ క్రింది శ్లోకము మల్లినాథునిచే నుదాహరింపబడినది.

"చండశక్తి మతో ర్యూనో రుద్భట క్రమవర్తినోః
ఏక వారావధి ర్యామో రతస్య పరమోమతః."

రఘువు దండెత్తి వచ్చుచుండగా సింహదేశరాజులు వైతసవృత్తి నవలంబించినారు. వెల్లువ వచ్చునపుడు ప్రెబ్బలిచెట్టు వంగినదై తన్నుతాను నిలద్రొక్కుకొని ప్రవాహము తగ్గగానే లేచి నిలబడగల్గుచున్నది. అట్లే బలవంతుడు దండెత్తివచ్చునపుడు దుర్బలుడు వంగి ఆత్మరక్షణము కావించుకొనును. కాళిదాసుని వైతసోపమానమును సమర్థించుటకు మల్లినాథుడు కౌటిల్యార్థశాస్త్రములోని వైతసశబ్ద ఘటితమైన ఈ క్రిందిశ్లోకము నుదాహరించుచున్నాడు.

"బలీయసాభియుక్తో దుర్బల స్సర్వత్రాను
ప్రణతో వైతసంధర్మ మాతిష్ఠేత్."

ఇందుమతీస్వయంవరములో నొక రాజు చేతితో లీలారవిందమును త్రిప్పెను. ఇందుమతి అతనినెంచుకొనక మరొక రాజునొద్దకేగెను. ఎందువలననో కాళిదాసు చెప్పలేదు. మల్లినాథుడు శకున సాముద్రికాది

శాస్త్రములలో కూడ తర్క వ్యాకరణాదులలో వలెనే మహావిద్వాంసుడైనందున ఇట్టిపట్ల కాళిదాసాభిప్రాయమును వ్యాఖ్యానింపగల్గినాడు. హస్తఘూర్ణకత్వమవలక్షణమని మల్లినాథుడు స్పష్టపరచినాడు. మరొక రాజు శత్రురాజులను నాశనము చేయుదునని తెల్పుటకు కాలు నేలరాచెను. పాదోల్లేఖనము లక్ష్మీవినాశకమని మల్లినాథుడు వివరించినాడు. మెలకువతో వ్యాఖ్యానించి మల్లినాథుడు మెరుగుపెట్టిన ఘట్టము లసంఖ్యాకములు.

యక్షుడు భార్యకు సందేశమును పంపుటలో "స్వప్నములో కన్పట్టిన నిన్నాలింగనము చేసికొనుటకు నేను బాహువులను సాచగా నన్ను చూచి జాలిపడు దేవతలు కార్చు కన్నీరు చెట్లచిగుళ్ళపై బడుచున్నది" అని చెప్పెను.

చెట్ల చిగుళ్ళపై కన్నీరు పడుచున్న దని కాళిదాసెందులకు చెప్పెనో మల్లినాథుడు వివరించినాడు. దేవతల కన్నీరు నేలపైబడుచో అపశకునమనియు, యక్షుడు శాపాంతములోగా మరణించునను భయము దానివలన నాతని భార్యకు కల్గుననియు, ఆ భయమును వారించుటకై దేవతల కన్నీరు తరుకిసలయములందు పడుచున్నదని చెప్పబడినదనియు మల్లినాథుడు వ్యాఖ్యానించుచు నీక్రింది నిమిత్తశాస్త్ర శ్లోకము నుదాహరించినాడు.

"మహాత్మగురుదేవానా మశ్రుపాతః క్షితౌయది
దేశభంగో మహద్దుఃఖం మరణంచ భవేద్ధ్రువం"

మహాకవి గ్రంథములలో నిగూఢములుగానున్న యిట్టి భావముల నెన్నిటినో మల్లినాథుడు తన బహు శాస్త్ర పాండిత్య ప్రకర్షచేతను, ఔచితీ విశేషము చేతను ఆవిష్కరించినాడు. కాళిదాస కావ్య గౌరవమును లోకులు గ్రహింపగల్గుటకు కారణభూతుడైన యీ వ్యాఖ్యాతను యావద్భారత దేశీయ సాంస్కృతికులును ఆ కవితోబాటు ఆదరించి యాతని వ్యాఖ్య ద్వారముననే తత్కావ్యములను పఠించుటయు, తన్మూలముననే సంస్కృతభాషాజ్ఞానమును, సాహిత్య ప్రవేశమును పొందుచుండుటయు గమనింతుమేని సంస్కృత వాఙ్మయాతిరథులలో నీతని స్థానమును గుర్తెరింగి యిట్టి పుత్రరత్నమును గన్న యాంధ్రమాత ధన్యురాలని గ్రహింపగల్గుదుము.

# ఖడ్గాలు

## అమృత్

వీరభద్రుడి పళ్లెం పట్టేటప్పుడు వీరశైవులు ఖడ్గాలు అని చదువుతారు. ఖడ్గంఅంటే కత్తి అని అందరికీ తెలిసిందే. ఖడ్గంఅనేది చదువదగిన రచనావిశేషంగా ఎక్కడా చెప్పబడలేదు: ఆసమయంలో వీరశైవులు చదివేపద్ధతి చూస్తే అందులో ఏ ఛందస్సన్నా ఉన్నదేమో సులభంగా తెలీదు.

వీటి కేఛందస్సు లేదని ముందు అనిపిస్తుంది. ఒక రకమైన వచనాలని అనుమానంవేస్తుంది. మార్గిక, వృత్తగంధి వంటి వచనభేదాలలో ఖడ్గం అనేది గూడా ఏమన్నా ఒకటిఉన్నదా అని అనుమానం వస్తుంది. కాని సంస్కృత గ్రంథాల్లో అటువంటిభేదం ఏదీ పేర్కొనబడలేదు.

ఈ చదివేవాటిలో విషయం వీరభద్రుని లీలాదికం అనేదిస్పష్టమే. అందులో విషయం ఏదైనా, అది చదివేటప్పుడు ఏ అర్థంమీదా ప్రత్యేకంగా దృష్టి పోదు. ఒకవిధమైన రౌద్రం, ఉద్రేకం కలుగుతయ్. ఆ ఉద్రేకం అంతా అప్పటి ఆపాఠకుల భయావహ వేష భాషాదికంవల్ల కలుగుతుంది.

చిన్న చిన్న మాటలుగా ఈ ఖడ్గాలను చదువుతారు. ఒక్కొక్కమాట అనగానే 'అల్లల్లవీరా'అని అంటాడు పాఠకుడు. చుట్టూ ఉన్నవాళ్ళు 'శ్శరభ, శరభా!' అని అరుస్తారు. - ఖడ్గాలు చదివేవ్యక్తి ఒక చేతిలో వీరభద్రుని పళ్లెం పట్టుకొని మరొక చేతిలో ఒకఖడ్గం ధరించి, ముందుకు వెనక్కు అడుగులు వేస్తూ చెబుతుంటాడు. వీరశైవుల యిండ్లలోనే గాక కొందరు స్మార్తుల యిండ్లలో కూడా శుభకార్య సమయాల్లో ఈ వీరభద్రుడి పళ్లెం పట్టటంఉంది.

ఈ చదివేవాటికి ఖడ్గాలనే పేరు ఎట్లావచ్చింది? అటువంటి ఛందఃప్రక్రియ ఎక్కడాలేదు. ఏ ఛందోకారుడు చెప్పలేదు. గద్యభేదమూ కాదు. వచనాలు చదివినట్లు చదవటంవల్ల వచనభేదమేమో అనిపిస్తుంది. అది చెవికి తగిలేక్రమంబట్టి దానికి ఛందస్సు లేకపోయినా, అంటే ఛందోకారుల లక్షణాలకు సరిపడకపోయినా, ఏదోఒక వరుస (రైమ్) ఉండి తీరుతుందని

నోస్తుంది. కాబట్టి అవరుసని బట్టి ఆ పేరువచ్చిందా? 'కత్తులు దూసినట్లు మాట్లాడటం' మొదలైన నానుడులు దేశంలో ఉన్నయ్. అంటే కత్తులంత పదునుగా పలకటం. 'తెగేసిమాట్లాడటం' అనిగూడా అంటుంటారు. కత్తుల్తో తెగేసినట్లు చిన్న చిన్న మాటలుగా అవ్వి పలుకుతారు గాబట్టి వాటికి ఖడ్గాలు అని పేరు వచ్చిందా? కావచ్చు. మధుపర్కాం పెట్టే సమయంలో ఇచ్చే వస్త్రాలకు మధుపర్కాం అనే వ్యవహారం ఏర్పడి పోయింది. అట్లాగే ఖడ్గం చేతధరించి పలుకుతారు గాబట్టి ఖడ్గాలు అనే పేరువచ్చి ఉండొచ్చు. ఇటువంటి వేవో కారణాలౌతయ్గాని అంతకుమించి, శైవగ్రంథాల్లోగాని, ఛందో గ్రంథాల్లోగాని ఖడ్గాలనే మాట ఈఅర్థంలో దొరకదు.

ఐతే ఈచదివే వాటిల్లో వినిపించేవరుస ఏమిటి? అందులో ఏ ఛందస్సైనా అంతర్లీనంగా ఉందా? అని ఆలోచిస్తే, ఆ చదివేవి వేటికవిగా చూసుకొంటే, తీర్థానికి తీర్థం, ప్రసాదానికి ప్రసాదమే. ఆ పలికేవి, మధ్యలో చుట్టూ వాళ్ళుపలికే వంత పలుకులు, అల్లల్ల వీరా, అశ్శరభా, అనేవి తొలగించి, ఒకచోట కూర్చి చూస్తే, అందులో ఒక అతిసాధారణ ఛందస్సు ఉన్నట్లు తోస్తుంది. ఆ ఛందస్సు సీసము. వారు చదివేవి సీసపద్య భాగాలు. సాధారణంగా ఒక్కొక్క పాదాన్ని నాలుగు తుంపులుగా చేసి వారు చదువుకుంటారు. యీక్రింది ఉదాహరణ చూడండి.

వీ భూతి యొకచేత వీరాంగ మొకచేత
ఘలు ఘల్లు మనుచును ఘంటమ్రోయ

ఇట్లా నాలుగు భాగాలుగా తుంపి మధ్య మధ్య 'శరభ, శరభా' అంటుండటంవల్ల అది సీసపద్య భాగమని తెలీదు. కలిపి చదువుకొంటే తేలిపోతుంది.

ఈ ఛందస్సు గూడా సాధుశబ్ద ప్రయోగం వల్ల సిద్ధించిందిగాదు. 'విభూతి' అనేది సాధుశబ్దం. అది వాడితే ఛందస్సు నిలవదు. 'వీభూతి' అంటేనే గాని గతి కుదరదు. శబ్ద సాధుత్వాసాధుత్వాల్తో వారికి నిమిత్తంలేదు. ఐతే ఛందస్సుకోసం అసాధు శబ్దాలు వాడటానికైనా వెనుదీయని ఛందశ్శాస్త్ర భక్తులా ఆ రచయితలు? అదీకాదు. ఆఛందస్సు అంత సహజమైంది అవటంవల్ల, చదివేటప్పుడు దానంతట అదే అమరింది అట్లా.

సీసపద్యాన్ని మహాకవులు అనేక ప్రయోజనాలకి అనేకవిధాల వాడినట్లు పరిశీలిస్తే తెలుస్తుంది. దాన్నిగూర్చిన పరిశోధన విజ్ఞులు చేసేఉన్నారు. ఖడ్గాలుగా రౌద్ర రసోత్పాదక రచనా విశేషంగా గూడా దాన్ని వాడుతారు. ఈ ఉపయోగం గూడా గమనార్హం. కేవలం గమనార్హం అంటే చాలదు. ఇదే మిగిలిన అనేక ఉపయోగాలకంటె ముఖ్యమైంది. ముఖ్యమైందంటే అత్యంత సహజమైంది గాబట్టి. ఒక వ్యక్తి యొక్క ఔన్నత్యం అతన్ని ఏకొంచ మీదో కోర్చొబెట్టినప్పుడు గాని, ఏ తూగుటుయ్యాలలోనో పవ్వళింపజేసి పన్నీరు చిలకరించేటప్పుడు గానీ తెలీదు. మామూలుగా నడిచేటప్పుడు, అలవాటుగా కేకవేసేటప్పుడు తెలుస్తుంది. నిత్యజీవితంలో, నిత్య ప్రవర్తనలో వ్యక్తి యథార్థపు విలువ తెలిసొస్తుంది. అట్లాగే దేని విలువైనా. సీసపద్యం ఖడ్గాలుగా చదువబడేటప్పుడు, అది అతి సహజంగా, అదిపద్యమే కాదు అన్నంతగా కనబడుతుంది. యతి స్థానం దగ్గిర మాట, భావమూ రెండూ తెగి నిలుస్తయ్. యతి అంటే నిజానికి విశ్రామస్థానం గదా. ఆయతిని యతిగా మన్నించిన వాళ్ళు ఆంధ్రకవుల్లో చాలా కొద్దిమంది. ఐతే ఆయా ఛందస్సులకు సహజరూపం, ఆయారచనలు పూర్తిగా ఆయా ఛందస్సులు నిర్దేశించిన విధంగా ఉన్నప్పుడే సిద్ధిస్తుంది. అంటే ఫలానా అక్షరం దగ్గర యతి అంటే అక్కడికి వచ్చేసరికి నిజంగా పదాలకి, సాధ్యమైతే భావానికి గూడా విశ్రాంతి లభించాలి. లేకపోతే అది యతి అనటంలో అంతగా అర్థం ఉండదు. ఖడ్గాలు ఆ విధమైన విరుపులతో ఉంటయ్. కాబట్టే ఖడ్గాలుగా చదివే సీస పద్యాలు, సీస ఛందస్సుకు అతి సహజమైన ఉదాహృతు లనటం. ఆ అతి సహజమైన రూపంలో వాటి ఈ ఉపయోగం అతి ముఖ్యమైందంటంలో సందేహంలేదు.

ఈఉపయోగం అంటే రౌద్రరసోత్పాదనకాదు. అది సీస పద్యాలవల్ల రాదు. వాళ్ళు చదివే పద్ధతివల్ల వస్తుంది. ఆ వేషభాషాదిక జన్యమూ రౌద్రం. అయితే సీస పద్య ఛందస్సు ఉపయోగమల్లా, వ్యక్తులు రెండు పక్షాలుగా అయి, ఒకటి వారు, ఒకటి వీరూగా చదవటానికి వీలుగా ఉండటం. భజగోవిందం, భజ గోవిందం, గోవిందం భజ మూఢమతే, అన్న ఛందస్సులోని గతిని ఖడ్గాలుగా చదవబడే సీసం అనుకరిసున్నది.

చివరకు అనే 'మూఢమతే' అనేది ముందు అనే 'భజ గోవిందం' అనే వాటికన్న చిన్నది. తక్కువ మాత్ర లున్నది. అట్లా చివరకి పఠించటంలో సౌలభ్యం, సౌందర్యం సిద్ధిస్తుంది. సీస పద్య పాదపు చివరి తుంపు గూడా ముందటి మూడు తుంపుల కన్న చిన్నది. రెండు నూర్యగణాలేగా. కాబట్టే అందులో సొంపు.

వీరశైవు లంటే శివరూపమైన విద్యలో రమించే వారని శ్రీ చిలుకూరి నారాయణరావు గారు తమ పండితారాధ్య చరిత్ర పీఠికలో తెలియజేశారు. వీరభద్రుడు శివునిమూర్తి విశేషమే. ఆ విద్యలో రమించే పరమభద్రమూర్తి. వీరభద్రుని ఆరాధించటం అంటే తామూ అటువంటి భద్రమూర్తులు కావటానికి ప్రయత్నించటమే. మరి ఈ రౌద్రభయానక ఆరాధన విధానమేమిటి? మానవునిలోని సమస్తాంశలు పరమేశ్వరాభిముఖ్యాన్ని పొందితేనేగాని ఆ భద్రమూర్తిత్వం చేకూరదు. మానవునిలో ఉన్న ఆవేశాలు, రజోగుణ సంబంధమైన విలతనిలోని ముఖ్యాంశల్లో ముఖ్యమైనవి. ఆ రజోగుణంవల్లనే జీవయాత్ర సాగటం. దాన్నంతా పరమేశ్వరాభిముఖం చేయటానికి ఉద్దిష్టమైనదే ఈ ప్రక్రియ. ఈవిధంగా ఇతరత్రా నడిస్తే ప్రమాదకారులైన ఆవేశాలు సరైనదారిలో నడిచి, చివరకి తమ నైచ్యాన్ని కడిగేసుకొన్న పౌతయ్. ఈవిషయాన్నే "అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయామృతమశ్నుతే" అని ఉపనిషద్వాక్యం తెలివిడిచేస్తున్నది. ఈ లౌకికజీవితమంతా మృత్యువు. ఇందులో సమస్తమూ అవిద్యే. మరి ఇందులోనే ఉంటున్న జీవి వీటెనికాదని ఎక్కడికి పోతాడు? ఏ అడవికి పోయినా తాను తానేగా. కాబట్టి ఈ ఉన్నవాటిని ఊతచేసుకొనే, ఉన్నస్థితినించి ఉన్నత స్థితికి చేరాలి. అలా చేసే ప్రయత్నమే వీరభద్రసంబంధియైన రౌద్ర ప్రక్రియలో గోచరిస్తుంది. ఖడ్గాలుగా చదవబడే సీస పద్యాలు ఆమార్గానికి సోపానభూతా లౌతున్నయ్.

---

* ఈ 'ఖడ్గాలను' గురించీ, 'వీరభద్రపళ్ళె'మనే ఈ ఉపాసనాక్రమంయొక్క అంతరార్థాన్ని గురించీ, బాగా తెలిసినపండితు లెవరైనా ఒక వ్యాసం అందజేస్తే కృతజ్ఞతతో స్వీకరించగలమ్. సంపా.

# హంససందేశము

## శ్రీ లంకా సీతారామశాస్త్రి

ఈ హంస సందేశమను కావ్యమును రచించినది వేదాన్త దేశికులని ప్రసిద్ధి బడసిన వేంకటనాథాచార్యులవారు. వీరు వైష్ణవులు: కాంచీపుర సమీపమున తూప్పుల్ అను గ్రామమందు శాలివాహనశకము ౧౧౯౦ లో జన్మించిరట. వీరి పాండిత్యము వంశానుక్రమణికమే కాక-కవితార్కిక సింహము, సర్వతంత్ర స్వతంత్ర బిరుదాంచితమునైనది.

ఈ మహాకవి 120 గ్రంథములు సంస్కృత భాషలో వ్రాసి గీర్వాణ వాఙ్మయాభివృద్ధికి మిక్కిలిగ తోడ్పడినాడు. ఈయన రచించిన 'యాదవాభ్యుదయము' వేదాన్తసారము, న్యాయసిద్ధాంజనములు లోకస్తుత్యములు.

ఇక హంస సందేశమను కావ్యమును గూడా నీ మహనీయుడే వ్రాసెనని తదాశ్వాసాంత గద్యమును బట్టి తెలియుచున్నది. ఇది కాళిదాసుని మేఘ సందేశమున కనుకరణమనిన సరిపోవును-కాని ప్రస్తుత మీతని హంససందేశములోని శ్లోకముల గమనించిన సంస్కృత కవితారాధకుడైన వేంకటనాథుని యారంభ కవిత్వమైనగావలయును; లేదా? (కట్టుకథననుసరించి) ఒక్కరాతిరిలో వ్రాసిన గ్రంథమయిన గావలయును-అగేమనగా? కాళిదాసు శ్లోకానుకరణ మనుటకు-మందాక్రాంత వృత్తము, శబ్దసంయోగము, పద విన్యాస ముండియున్నను. అతని భావములుగాని, పదవినిమయాసహనముగాని వీరి కవితలో గానరాదనుటకీ క్రింది శ్లోకముల జూచునది.

సీతకు శ్రీరాముడు హంసతో సందేశమును బంపుట కావ్య వస్తువు. అసలు హనుమంతుడు సీత దగ్గరనుండి వార్తను గొనివచ్చిన మఱురోజుననే సుగ్రీవుడు కపిసైన్యముతో లంకా పట్టణము మీదికి బో బయనమయ్యెనని మన వేంకటనాథులవారే.

"ప్రత్యాయాతే పవనతనయే నిశ్చితార్థస్సకామీ
కల్పాకారాం కథమపి నిశా మావిభాతం విషేహే"

1 ఆ. శ్లో 1.

# కలగూరగంప

"కాల్యేసేనాం కపికులపతే స్తూర్ణముద్యోజయిష్యన్" 1 ఆ 2 శ్లో-అను శ్లోకములను వ్రాసిరి. ఇందు రెండవశ్లోకముయొక్క అవతారికలో "ప్రాతఃకాలే సుగ్రీవప్రముఖ వానరసేనాం ప్రస్థాపయిష్యన్ జనకదుహితుః" అని వ్రాసిరి. కాగా హనుమంతుడు వార్త గొనివచ్చిన నాటిరాత్రి శ్రీరాము డతి సంలోపముగ నుండెననిగదా చెప్పవలసినది! పోనిమ్ము. శ్రీరాము డా వార్తవినిన తరువాత సరోవరముల జాడ బోవుటేమి? చూచెదో! నాటిరాత్రి యా హంస ప్రయాణ మెట్లు చేయును? అను సందేహము లనేకములు. అట్లుగాక మరురోజున బయలుదేరి తాము వెళ్లుటకుముందుగా దూతకువలె హంస ననిపెనందము! అట్లయినను హంసకు ఉపదేశించిన పుణ్యతీర్థములకు బోవుటతోడనే సరిపోవునుగదా? ఈ లోపు తామే చేరుదురుగదా! కాబట్టి యీ కవి హంసను ఆ కొంచెము వ్యవధానములో దూతగానుంచు దానికన్న-కాళిదాసు ననుకరింప బోవునపుడు-సీతాం ప్రతి రామస్య హనుమత్సందేశ మ్మనసినిధాయ-అన్న మేఘసందేశ వాక్యము నే ప్రమాణముగ గొని-హనుమత్సందేశ-మను పేరనే వ్రాసిన బాగుండెడిదేమో? పోనిమ్ము. హంససందేశ మను పేరున్న మనకేమి? కవి కల్పనాచాతుర్యముగదా.? కావ్యమనినచో. ఇందుగల కల్పనలోగూడ సహృదయ హృదయరంజక మగున ట్లగుపించుటలేదు. చూడుడు.

"ఆనీతం య త్త్వరిత మచలా దు త్తరీయం ప్లవంగై
రస్యాకారై స్సదృశ మభిత స్త్విప్రియా రూపచిహ్నమ్।
బాలాదిత్యద్యుతి సహచరం చారువాసోవసానాం
సంధ్యారాగ వ్యతికరవతీం చంద్రరేఖ్యామి వాన్యామ్॥
2 ఆ. 19 శ్లో.

వ్యా॥ ఆ నీతమితి; ప్లవంగైః=కపిభిః, అచలాన్మతంగ పర్వతా ద్యదు త్తరీయం - బహిర్వాసః, త్వరిత మానీతం - శీఘ్రమానీతం, అభితః త్వత్ప్రియా రూప చిహ్నం - పరితః త్వత్ప్రియాయాః రాజహంస్యాః రూపం చిహ్నం లాంఛనం యస్యతత్ అస్యాకారైః సదృశ మేత దుత్తరీయస్యాకారైస్సమానం బాలాదిత్య ద్యుతిసహచరం - బాల సూర్య కిరణ సఖం చారువాసః మనోహరవస్త్రం ఉత్తరీయ యుగ్మేఒన్యతర దిత్యర్థః. వసానాం ధారయంతీం అతఏవ సంధ్యారాగ వ్యతికరవతీం సంధ్యారాగేణ మిశ్రాం అన్యాం చంద్రరేఖామివస్థితామ్.

'సీతాదేవిని నీవు చూచునప్పు డిట్లుండు - నని హంసలో శ్రీరాముడు చెప్పుట. కపులు వస్త్రము నొ క దా ని ని మ తం గ ప ర్వ త ము నుం డి కొనిపోయి సీత కొసగిరట. అందలి వస్త్రములలో నొకటి తెలుపుదట - ఒకటి రొజుపుదట - ఆ తెల్లని వస్త్రము - దూతగాబోయెడి హంసకు - ఆడు హంస యను భ్రాంతిని గలిగించుచున్నదట. సీత ధరించిన రొజ్జని వస్త్రము సంధ్యారాగము ననుకరించునట. ఆ రెండు వస్త్రములు, దూతయగు హంస సీతవద్దకు వచ్చునప్పటికి. సంధ్యారాగ వ్యతికరవతీం చంద్రరేఖామివాన్యా - మని ఉపమానము. ఈ పైజెప్పిన లింగవచన వాక్య వ్యతికరమువలన సహృదయ హృదయరంజక మెంతటిదో? దీని సందర్భశుద్ధియెట్టిదో? కవితాశైలి యేరీతిగ నుండెనో పండితులకు దెలియ రానిదికాదు. ఇంతేకాదు - వ్రేలుబెట్టి చూపింప వలయునన్న - హంస సందేశములోని 2వ ఆశ్వాసములో 18, 20, 41 ఇత్యాదులలో భావగాంభీర్యము లేకపోగా భావదారిద్ర్యమే బయల్పడుచున్నది.

ఇక శబ్ద విన్యాసవిషయములో

"యా దైన్యం భవతి కిముత క్వాపి సంవేదనార్తా"

1 ఆ. 5 శ్లో. అనుచోట-సందేశయోగ్యే - అనిన నెంత స్పష్టముగ నుండునో గమనింపుడు. ఇట్లే—

"శంకే తీవ్రం భవతి సమయే శాసనం మీనకేతోః"

1 ఆ. 3 శ్లో.

ఇట-సమయే-అనుచోట- విరహో—అనియున్న బాగుండునుగదా? ఇట్టివి పదములలో విస్పష్టార్థమును జూపింపని వెన్నియో కలవు. భావమునకు - శబ్దములకు దారిద్ర్యము మాట నటుండనిండు. దూరాన్వయములు గూడ ననేకములు గలవు. సాధారణముగ ద్వితీయాశ్వాసములో నిట్టివి పెక్కు గలవు. అయినను లోకాదర మీగ్రంథమెక్కినమాట నటుండనిండు-కవికి వేదాన్తాచార్యులను బిరుదము గలదే? ఇట్టి వ్రాతలేమి? ఇంత కన్న సారళ్యమగు రీతిలో—నాబోటి యల్పు డెవడేని వ్రాసిన లోక మాదరించునా? ఆదరించదు. కారణము? సమకాలీనతయే. వారి నాదరించుటలో నట్టి

మానమన్న యుండవలయును? లేదా? కావ్యమును చూడకయే పేరునుబట్టి యాదరించుచుండవలయును. పోనిండు! ప్రకృతమను సరామః పాయసంభక్షయామః.

ఇక చారిత్రకముగ జూచినచో—ఈ హంస సందేశమున—శ్రీరాముడు హంసకు—ఓ! హంసమా! నీవు కంచినుండి తిరుపతిమీదుగా కాళహస్తికి వెళ్ళి అటనుండి శ్రీరంగముమీదుగా పాండ్యదేశమును, అటుపై శ్వేతాద్రిని—ఆపై లంకాపురమును చేరుము — అని యుపదేశించెను. ఇందు మతంగ పర్వతముపైని శ్రీరాముడు హంస కుపదేశము — పైస్థలముల దిరుగుట — లంకకు. జేరుట. ఇది ద్రావిడప్రాణాయామమునకువలె తలతిరుగుడొంకరైనది.

"తవా మృతస్యందిని పాదపంకజే నివేశితాత్మాకథ
మన్యదిచ్ఛతి ।
స్థితేఽరవిందేమకరంద నిర్భరే మధువ్రతో నేక్షుర
సంహి వీక్షతే ॥

ఇట్టి మకరందనిర్భరమగు భావసముదాయముతో గూడిన కవిత్వసంపదగలిగిన వేంకటనాథు డీ హంస సందేశమును వ్రాసెనని యుండుట యెట్లు పొసగును?

అగుగాక! ఒకనాటి రాత్రిలో - హంస సందేశము-ను బూర్తి జేసెనను నీతని గూర్చిన కథనుబట్టి పద మార్దవముగాని, భావగాంభీర్యముగాని లేకుండుగాక! దూరాన్వయ మెందులకు గలిగెనో తెలియదుగదా? అది యెట్లయిన నుండుగాక!

ఈ పుస్తకము బి, ఏ పరీక్షకు సంస్కృతభాగమును జదువువారలకు పాఠ్యగ్రంథముగ నాంధ్ర విశ్వ విద్యాలయమువారిచే నియమింపబడినది, ఇట్టి క్లిష్టాన్వయము, భావదారిద్ర్యము, పద వినిమయసహనము గల పుస్తకములుకాక, మఱి యితర పుస్తకములా విద్యార్థులకు బనికిరావా? ఈకవిపై నభిమానమున్నచో యాదవాభ్యుదయములోని కొంత భాగమును నిర్ణయింపగూడదా? లేక ఆంగ్లభాషా సాంప్రదాయానుసరణమా? పుస్తకము నామూలాగ్రముగా జూచుట పాఠ్యగ్రంథ నిర్ణాయకుల పనిగాదా? సంస్కృత భాగము M. A తో కలిసియున్న నాడే ప్రభుత్వాదరమా? ఒకవేళ-సందేశము-అనునదే పాఠ్యభాగముగ నిర్ణయింపదలకొనిన మేఘసందేశమునే పాఠ్యగ్రంథముగ నిర్ణయింపగూడదా? ఒకవేళ నందు శృంగారరసమధికముగనున్న కారణమున నది విద్యార్థి జనమున కవినీతిని బోధించిన ట్లగుననినచో-నిందు లోక మాతాపితరులగు సీతారాముల శృంగారము. 2 ఆశ్వాసములో 33, 34 శ్లోకములలో-మిక్కిలి అతివేలముగ జూపబడి యుండలేదా? కాగా విద్యార్థుల కష్ట సుఖములను గాని, గ్రంథసారళ్యమునుగాని విచారింపక-విద్యార్థి జనమున కనుపయుక్త గ్రంథములను పాఠ్యప్రణాళికలో నుంచుట విమర్శనాస్పదమేకాని విజ్ఞానప్రదముకాదు. కాబట్టి పాఠ్యగ్రంథముల నిర్ణయించు నిర్ణాయకులు గ్రంథముల నాపాతతఃకాక సమగ్రముగ జూచి నిర్ణయించి విద్యార్థి జనమునకు విజ్ఞానదాయకులై మహాకవుల గూడ రచ్చకీడ్చి విమర్శనకు స్థానభూతులుగ జేయకుందురుగాక అని నా మనవి.

# గ్రంథ విమర్శనము

## స్వయంప్రకాశ ప్రబోధము

పద్యకావ్యం; రచన. శ్రీ అక్కిరాజు చంద్రమౌళిశర్మ; ప్రాప్తిస్థానం; శ్రీ అక్కిరాజు వేంకటేశ్వరశర్మ, పండితులు, ఏ. సి. కాలేజి, గుంటూరు, మూల్యం రు. 3-0-0.

ఇది, శ్రీ శ్రీ స్వయంప్రకాశానంద యతీంద్రుల చరిత్ర కథా వస్తువుగా సంఘటింపబడిన మహాకావ్యం. మంత్రతంత్రోపాసనాదికాలకు సంబంధించిన అనేక విషయాలు ఇందు ఉల్లేఖింపబడివున్న కారణంగా, చరిత్ర గ్రంథంగా దీన్ని అంగీకరించటానికి నవీన చారిత్రక పరిశోధకులకు అభ్యంతరం వుండవచ్చు. అట్టి చరిత్రగ్రంథ మాత్రంగా దీన్ని వెలయించాలనే అభిప్రాయం రచయితకు ఉన్నట్టుకూడ తోపదు. మత సాంఘికాధ్యాత్మికాద్యనేక విషయములనూ, అనేక కావ్యకల్పనలను యిందు చొప్పించియున్న కారణంగా, ధర్మప్రబోధకరూపమైన మహాకావ్య నిర్మాణమే రచయిత ప్రధానాశయమైనట్లు విస్పష్టం. చారిత్రకుల దృక్పథ మెట్టిదైనా, రామకృష్ణపరమహంస చరిత్ర వంటి గ్రంథములతోపాటు ఈ గ్రంథముగూడా అర్చనధ్యేయమై వెలయగలదనేది నిస్సందేహ విషయం. రామకృష్ణపరమహంస జీవిత చరిత్రకూ, ఈ స్వయంప్రకాశానంద యతీంద్రుల జీవిత చరిత్రకూ యెన్నో పోలికలు కనుపించుతూ వుండటంకూడా గమనార్హమైన విషయం.

ఈగ్రంథములో ఉల్లేఖింపబడిన ఉపాసనాసంప్రదాయములను గురించిగాని ఆధ్యాత్మిక సాధనలను గురించిగాని విమర్శపూర్వకముగా పరిశీలన చేయుటకు ఆ సంప్రదాయములలో తగిన ప్రవేశములేని సామాన్యులకు సాధ్యముకాదు గనుక వాటిని అట్లే వదలి, కేవల కావ్యదృష్టితో మాత్రమే పరిశీలన చేస్తున్నాము. అయినా, ఈ సంప్రదాయ విశేషాలలో గ్రంథ కర్తకు గల విజ్ఞానానుభవాలు మనకు గ్రంథం సర్వత్రా గోచరమవుతూనే వుంటాయి.

ఈ గ్రంథం తిలకించగానే అధునాతనాంధ్ర సాహిత్యరంగంతో పరిచయంగలవారికి ఒక ఆశ్చర్యం కలుగుతుంది. ఈనాడు, కావ్య రచనలో ఇంతటి ప్రతిభా ప్రాభవములున్న కవులు బహు కొద్దిమంది. ఇట్టి ప్రతిభాశాలి రచన యింతవరకు మరొకటేదీ యింతవరకూ మనం చూచి వుండక పోవటం, కవిగా వీరి నామధేయం కూడా యింత వరకూ బహుళ వ్యాప్తంగా తెలియబడకపోవటం విచిత్రం. కాని ఇందుకుగల కారణమేమో గ్రంథకర్త 'తొలి పలుకులో' రచించిన ఈ వాక్యాలను గమనించితే బోధపడుతుంది.

"వారి జీవిత రహస్యముల నెక్కువగా నెరుగుట కవకాశము గలిగి తద్వంశ్యుడనైయుండి యూరకుండ లేకపోతిని. చిన్ననాటినుండి కవితా కన్యను తల వాకిలి దాటనీయక యదుపున నుంచితిని, కాని స్వామివారిపైనున్న భక్తి గుట్టు చక్కగా నున్న యామెను రచ్చకెక్కించి లోకపు పోకడ చూపినది. సహృదయలోక మేమనునో కదా!"

వీరు శ్రీ అక్కిరాజు ఉమా కాంత కవిగారికి సోదరులట:

'అస్మదన్వయ పాథోధి యమృతకిరణు
డాంధ్ర సంస్కృతహూణ విద్యావిదుండు
అన్నయును, నెచ్చెలియు, హితుండైనయట్టి
మాయుమాకాంతు, ధీమంతు, మదిదలంతు.'

అని సంస్మరించినారు.

ఈ కావ్య నాయకుడైన శ్రీ స్వయం ప్రకాశానంద యతీంద్రులు పూర్వాశ్రమమున శ్రీ లక్ష్మి


## చౌదరి ప్రచురణలు

"కళోద్ధారకులు"—శ్రీ అంగర సూర్యారావుగారి నాటికల సంపుటి 120 పేజీలు రు. 1-4-0

"అంతరాత్మ"—శ్రీ బలివాడ కాంతారావుగారి కథల సంపుటి 100 పేజీలు రు. 1-0-0

రెండు పుస్తకాలూ చక్కని గ్లేజుకాగితం, ముచ్చటైన మూడురంగుల టైటిల్సుతో వెలువడినై.

అన్ని బుక్ స్టాల్సులోను లభిస్తాయి.

చౌదరి పబ్లికేషన్సు—మండపేట,

తూర్పు గోదావరి జిల్లా.

నారాయణాభిధానులు. గ్రంథకర్తకు ప్రపితామహులు. అనగా యిది సుమారు రెండు వందల సంవత్సరముల నాటి గాథ. శ్రీ లక్ష్మీనారాయణగారి స్వగ్రామం గుత్తికొండ. బాల్యంలోనే తలిదండ్రులు పోవటంచేత నెమలిపురిలో మేనమామగారియింట పెరుగుతున్నారు. నెమలిపురిలోవున్న ఆంజనేయస్వామి కోవెలలో, కనుపర్తి వంశానికి చెందిన నియోగి బ్రాహ్మణుడొకరు, పరివ్రాజకుడై, నిస్సంగుడై, దిగంబరుడై, నిత్యానందావధూత అనే ప్రసిద్ధ నామంతో, వుంటూ వుండేవారు. వారు యీ బాలునియందు ప్రసన్నులై నాలుకపై బీజాక్షరములు రచించి, హస్తమస్తక సంయోగంతో జ్ఞానభిక్ష పెట్టారు. అనంతరం ఈ బాలుకు ఉపనయనం కాగానే, ఇంటవద్ద చెప్పకుండా, శ్రీశైలం వెళ్ళిపోయి ఆ పర్వతంమీద పన్నెండు సంవత్సరాలు అనేక సాధనలు చేశారు. కాని గృహస్థాశ్రమం స్వీకరించమని పరాశక్తి ఆదేశం కావటంవల్ల గత్యంతరంలేక మేనమామ యింటికి తిరిగివచ్చి మేనమామ కుమార్తెను వివాహం చేసుకుని, స్వగ్రామమైన గుత్తికొండలో కాపురంబెట్టి సంతానప్రాప్తి గలిగి చిరకాలం సుఖంగా వున్నారు. ఆ దశలో అనేక మంది శిష్యులను చేకూర్చుకొని వారికి ధర్మప్రబోధం చేస్తూవుండేవారు. చివరిదశలో కాశీకిపోయి ఆశ్రమ స్వీకారం చేశారు. సూక్ష్మంగా ఇది కథ. కాని ఈగాథను శ్రీ చంద్రమౌళిగారు ధర్మవిన్యాసపూర్వకమైన ఒక మహాకావ్యంగా ప్రబంధించారు. ఇది ఆదిపర్వము, తపోవనపర్వము, గురూపదేశపర్వము, గృహస్థపర్వము, విజయపర్వము, ప్రబోధపర్వము, పరివ్రాజకపర్వము అని ఎనిమిది పర్వములుగా విభజింపబడి వుంది. ఇందు ప్రబోధపర్వము అత్యంత ప్రధానమైనది. స్వామివారు శిష్యులకు చిన్ని చిన్ని కథల రూపంలో ధర్మప్రబోధ చేయుటం ఇందలి విషయం. పూర్వ ఖండం, ఉత్తరఖండం అని రెండు భాగాలుగా వున్న ఈప్రబోధపర్వం శాంతి ఆనుశాసనిక పర్వాలను తలపునకు తెస్తూవుంది. ప్రతి కథను మధురమైన ఒక చిన్ని ఖండకావ్యంగా నిర్వహించారు. ఈ పర్వంలో అనేక దార్శనిక విషయాలను త్రవ్విపోశారు. స్వామి వారి విషయమేమో మనకు తెలియకపోయినా యీ పర్వాన్ని సంఘటించిన శ్రీ చంద్రమౌళిగారి ప్రతిభావ్యుత్పత్తులు మనలను విభ్రాంతులను చేయగలవు.

నిసర్గసుందరమూ, నిరాడంబరమూ అయిన వారి శైలి పండువెన్నెలవలే ప్రసన్నమై హృదయాహ్లాదిగా వుంది. ఈ బాలా త్రిపురసుందరీవర్ణన ఎంత మనోహరంగా వుంది!

పాప గన్పడునట్టి ఫాలభాగముతోడ
  బొమల దిద్దిన చుక్కబొట్టుతోడ
వాలుగన్నులతోడ నీలవేణికతోడ
  నోరూరు కెమ్మోవిసొరుతోడ
కమ్మల రుచిమించు గండభాగములతో
  నవ్య చంపకరమ్య నాసతోడ
తొలకరి నునుమించు దులకించు మేనితో
  కలదు లేదనునట్టి కౌనుతోడ

బాల రవిబొల్చు జల్తారు వలువగట్టి
నీలి రవికను గుబ్బలు నిక్కదొడిగి
గంథమును పున్గు కస్తురి గమగమ యన
మొలకనవ్వుల బాల సమ్మోహినియయి.

ఈ గ్రీష్మఋతు వర్ణనను చిత్తగించితే కల్పన విషయంలో రచయితకుగల వ్యక్తిత్వం ఎలాంటిదో బోధపడుతుంది.

‘విరితూపు లడుగంటె వెన్నిచ్చె సేనాని
  కేతనము కిరాతు చేతబడియె
చెఱకువిల్ తుంపులై చేగాన్గలోజారె
  తలిరాకు నునుబాకు తుకుమాసె
మలయమారుత మంత్రి చిలువలపాలాయె
  రాజయక్ష్మమున రేరాజుక్రుంగె

ఓహో అదేమిటామాట!
సంతానం కుళ్లి కృషిస్తూ ఉంటే తల్లికి క్షోభ కాదూ?
భారతి-భారతాంబ తన బొల్లి, సమస్తచర్మవ్యాధులచే పీడింప బడుచున్న సంతానంకోసం ఎంతని విచారిస్తూఉందో?
(స్థాపితము 1920 సం॥రం)
ఇదుగో మా చిరకాల అనుభవంతో ఇస్తూ ఉన్న అభయం.
మాకు నేడే వ్రాయండి
రెడ్డి అండ్ కో.,
గోపాలపురం. (తూ.గో.జ)

# గ్రంథ విమర్శనము

కోకిలయను వంది మూకభావముదాల్చె
రాచిల్క తేజి తొట్టిలకుబాకె
ఖరకరున కోడి బలమిట్లు కలతపడిన
మల్లె విరిమొగ్గ గదదాల్చి మగలదాకి
మదవతుల సాయమున నెదల్ ప్రిదులవైచి
కువలయము గెల్చె వలరాజు శివ విజేత.

*    *    *    *

మల్లుకోకనుగట్టి మల్లెపూవులు జుట్టె
మంచిగంధము బూసె మందయాన
నవరసాల రసాలు నవలతో జతకూడి
నమలె వెన్నెలరేల నవరసికుడు
చెఱకు తుంటను రెండుచేసి తల్లియొసంగ
బీల్చి పిప్పినిజేసె పిల్లవాడు
వృద్ధులు తొలిజాము ప్రొద్దెక్కలోపల
దూలిరాకటిబాధ తాళలేక

క్రొత్తకుండలు కూజాలు దుత్తలాది
ఆమమున వ్రేల్చి కుమ్మరి యమ్మదొడగ
శీమలెల్లెడ మిగుల విశేషమయ్యె
గువ్వలకు నీరుపోసిరి గుంటలందు.

*    *    *    *

తపనుండు వేప సంతప్తుడై యుడుకెక్క
దుమ్మెత్తిపోసె క్ష్మాధూర్తయగుచు.

పై స్వభావోక్తియే రసపిపాసువు హృదయాన్ని వికసింపజేయదు! ఈ కావ్యంలోగల సౌందర్య విశేషాలను వివరించాలంటే ఇంచుమించు ప్రతి పద్యాన్నీ ఉదాహరించి వ్యాఖ్యానించవలసి వుంటుంది. అందుచేత ఆ ప్రయత్నాన్ని విరమించుతున్నాము. శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు ఈ రచననుగురించి సెలవిచ్చిన ఒకటి రెండు వాక్యాల నిట ఉటంకించి ఈ పరిశీలనను ముగింపజేస్తాము.

'వారి కవిత్వము ఒక గంగాప్రవాహము. యతి ప్రాసల సహజమైన యాదొరలుట, ఆ మాటల పొందిక —యిదియొక సహజమైన తేనెకాలువ. వీరి కవిత వినవిన తొలినాటి యాంధ్ర నియోగుల తెలుగు సరస్వతి మరల సాక్షాత్కరించుచున్నది.

'ఆంధ్ర నియోగులు తెలుగు కవితను పుట్టించినవారు, పెంచినవారు. సంస్కృతము వాడినచో నది తెలుగనిపించునట్లు వాడుట వారికే తెలియును. ఈ కవిగారి కవితలో ననేక సంస్కృతశబ్దములు కలవు. కాని అవి చదువుచుండగా సంస్కృతమని తెలుసుకొనలేము. అన్నిటినిమించి యీ పూర్వాంధ్ర నియోగుల భక్తిజ్ఞానవైరాగ్యభావములకు వ్యక్తీకరణమైన వారి తెలుగు కైతలోని వలపు శ్రీ చంద్రమౌళిగారి రచనలోనను మూర్తుల గనుపించుచున్నది.'—

## రాజ తరంగిణి

[సప్తమ తరంగము]

పద్యకావ్యం: రచన: శ్రీ రెండుచింతల లక్ష్మీనరసింహశాస్త్రి; ప్రచురణ: కల్లోలినీ గ్రంథమాల, గొల్లపల్లి, కృష్ణాజిల్లా. వెల రు 1-0-0.

'విన్నప' వాక్యములలో రచయిత ఇట్లు దెలుపుతున్నారు: 'మా యింట నెన్నాళ్ళనుండియో పుస్తకములయం దడుగున బడియున్న యొక తెలుగు వచన గ్రంథమును పైకిదీసిచూడ నది రాజతరంగిణి యొక్క ఆంధ్రానువాదముగా నగుపడినది. అది సమగ్రముగ లేక పోవుటయేగాక అందున్న ఒకటి రెండు తరంగములు గూడ క్రిమిదష్టములై పఠించుటకు గడు క్లేశకారిగా నుండెను."

ఈ గ్రంథమును గూర్చిగాని తద్గ్రంథకర్తను గూర్చిగాని శ్రీ లక్ష్మీనరసింహశాస్త్రిగారు వివరముగా తెలుపకపోవుట ఆశ్చర్యజనకముగా నున్నది. ఆంధ్ర భాషలో ప్రాచీన వచన వాఙ్మయం చాలా పరిమితంగా వుంది. ప్రాచీనాంధ్ర వచనస్వరూప మెలాంటిదో కూడా తెలుసుకోలేని స్థితిలో వున్నాము. ఇది ప్రాచీన వచనరచన అయివున్నట్లయితే, తప్పక యీ వ్రాతప్రతిని గురించి వివరములు శ్రీ లక్ష్మీనరసింహశాస్త్రిగారు వెంటనే ప్రకటింపవలసివుంది.

ప్రస్తుత పద్యరచన కల్హణుని సంస్కృత రచనకు అనువాదం కాదు. పై వచనానువాదాన్ని అధారంగా చేసుకొని సంఘటింపబడినట్టు తోస్తుంది. ఈ సప్తమతరంగాన్ని మాత్రమే రచించుటకు ఎందుకు పూనుకొనినారో కూడా తెలిపినారుగాదు. బహుశా ఈ తరంగములోని హృద్యమైన కథావస్తువు శ్రీ లక్ష్మీనరసింహశాస్త్రిగారిని ఆకర్షించివుండవచ్చు. కాని ఇంతటి ముచ్చటైన కథను చెప్పే అవకాశంలోకూడా శ్రీ శాస్త్రిగారి పద్యాలు కావ్యగౌరవాన్ని సంతరించుకోగలగటం లేదు. సరళమైన శైలిలో కథనుమాత్రం సుబోధకంగా హృదయానికి హత్తుకొనేటట్టు చెప్పారు. గ్రంథాంతమందు అందజేసిన లఘుటీకను గమనించితే, రచయిత ఈ రచనను బాలబాలికలకొరకు ఉద్దేశించారేమోననిపించుతుంది. అలాంటి సందర్భంలో వచనమే ఇంకా అనువుగా వుండేదేమో!

**యాత్రా మార్గదర్శి:** హిందూ, బౌద్ధ, జైన చారిత్రక, పౌరాణిక బదరీ, కేదార, అమరనాథ్, పసుపతినాథ్ కైలాస మానససరోవరాది క్షేత్రములనుగూర్చి వివరించు గ్రంథము. క్రౌనులో 1026 పుటలు, 300 బ్లాకులు, రెండు భాగములు. భాగము 1 కి రు. 4/- పోస్టేజిరు 1-10-0 శ్రీరామనామక్షేత్రము, గుంటూరు 1

## ఆంధ్ర ప్రదేశలక్ష్మి

పద్యకావ్యం: రచన: శ్రీయుతులు కోట సోదర కవులు: ప్రాప్తి స్థానము: 'కవి చంద్ర గ్రంథమాల,' కనిగిరి, నెల్లూరుజిల్లా, లేక 147 మింట్ స్ట్రీట్ మద్రాసు—1.

విశాలాంధ్రావతరణ మహోత్సవాన్ని పురస్కరించుకుని కోట సోదరకవులు ఈ కావ్యాన్ని రచించారు. ఆంధ్రాభిమాన పురస్సరమైన ఈ కావ్యము ఆంధ్రబాల బాలికలకు ఉపవాచకముగా చదివించుటకు చక్కగానున్నది. ఆంధ్ర చరిత్ర సర్వమును, పురాణ యుగము, శాతవాహన యుగము, చాళుక్యయుగము, కాకతీయయుగము, రాయలయుగము గోలకొండ యుగము, స్వాతంత్ర్య సిద్ధి, ఆంధ్ర రాష్ట్రావతరణ ఆంధ్ర ప్రదేశలక్ష్మి, ఆకాంక్ష, అను పది శీర్షికలలో వారు సంగ్రథించినారు. వీరు అనేక గ్రంథములను రచయించిన కవులు, సరళమైన వీరిశైలి తెలుగు నానుడులతో ముచ్చట గొల్పును. ఉదాహరణకు:

'సరదాగా మృగయార్థమై చన తురు
    ష్క శ్రేణి జృంభించి భూ
వరుడైనట్టి ప్రతాపరుద్రుని వడిన్
    బంధింప నాలోచనా
పరతంత్రతజ్ఞత మారు వేసమున తన్
    బంధంబు వాపెన్, యుగం
ధరుడా నైపుణి యాంధ్ర భూపతికి ము
    క్త్యాహారమై జెల్లదే!'


# గ్రంథకర్తలకు, ప్రచురణకర్తలకు, విక్రేతలకు
# ప్రత్యేక సదుపాయములు!

మన దేశంలో గ్రంథప్రచురణ చాలా వెనుకబడివుంది. ప్రచురణసంస్థలు విరివిగా లేక చాలామంది గ్రంథకర్తలు తమ గ్రంథాలు తామే అచ్చువేసుకుని అమ్ముకుంటున్నారు. ఉన్న కొద్ది ప్రచురణసంస్థలకుకూడా విశేషలాభాలు వుండటంలేదు. ప్రచురణావకాశాలు ఇలా వుండటంచేత వైజ్ఞానిక ప్రచారంకూడా చాలా వెనుకబడిపోతున్నది.

**భారతి** కేవలం వైజ్ఞానిక ప్రచారానికి యేర్పడిన వ్యవస్థ. గ్రంథప్రచురణను ప్రోత్సహించే తలంపుతో, గ్రంథముల ప్రకటనలకు సంబంధించినంతవరకు తన ప్రకటనరేట్లు తగ్గించుకుని కొంత సదుపాయం చేస్తున్నది.

ఈ అవకాశాన్ని వినియోగించుకోదలచిన గ్రంథకర్తలు, ప్రచురణకర్తలు, విక్రేతలు ఈ దిగువ చిరునామాకు వ్రాసి ఈ ప్రత్యేక సదుపాయపురేట్ల వివరములు తెలుసుకొనవచ్చును

**అడ్వర్టైజ్‌మెంట్ మానేజర్, భారతి**

7, తంబుచెట్టివీధి, మద్రాసు-1.



**Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.**

Bharathi 7th January 1957 Regd. No. M. 1857

# అమృతాంజనము

''ఏనుగు తలనొప్పుల'నుకూడా

క్షణంలో
ఉపశమింపజేస్తుంది



లక్షలాది ప్రజలు 1893 నుంచి దేశమంతటా అమృతాంజనాన్ని వాడు తున్నారు. అమృతాంజనము బెణుకులు, వాపులు, తలనొప్పి, పళ్లపోటు, జలుబులు, దగ్గులు మొదలైన వాటిని ఉపశమింపజేస్తుంది.




అమృతాంజనము అన్ని నొప్పులకు దివ్యామృతము.



అమృతాంజన్ లిమిటెడ్.
మద్రాసు-4, బొంబాయి-1, కలకత్తా-7.

AL.86 B